అట్ట లోపలివైపున అచ్చు వేసిన శిల్పంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్య చేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వాఖ్యను వ్రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనమైనది.

నాగార్జునకొండ, 2వ శతాబ్దం

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీ వారి సౌజన్యంతో)

భారతీయ సాహిత్య నిర్మాతలు

# పింగళి - కాటూరి

రచన

గొల్లపూడి ప్రకాశరావు



సాహిత్య అకాదెమీ

**Pingali Katuri** - Monograph in Telugu by **Gollapudi Prakasa Rao**.
**Sahitya Akademi,** 1999. Rs. 25/-



First Published : 1999
ISBN-81-260-0649-8

సాహిత్య అకాదెమీ
రవీంద్రభవన్, 35 ఫిరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ - 110 001.

విక్రయ విభాగం

'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001.

109 జె.సి. రోడ్, బెంగుళూరు - 560 002.

గుణా బిల్డింగ్స్, 304 - 305, అన్నాశాలై, తేనాంపేట, చెన్నై - 600 018.

జీవనతార భవనము, డైమండ్ హార్బర్ రోడ్, కలకత్తా - 700 053.

172 ముంబయ్ మరాఠీ గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్,
ముంబాయి - 400 014.

వెల : రూ. 25/-

Printed By :
**Nagarjuna Printers, Chennai - 21.**

# విషయసూచిక

# కృతజ్ఞతలు

ఇరవై రెండు భాషలలో గ్రంధ ప్రచురణ చేపట్టిన ప్రపంచ ప్రఖ్యాత ప్రచురణ సంస్థ కేంద్ర సాహిత్య అకాదెమీ. భారతీయ సాహిత్య నిర్మాతలు శీర్షికతో అకాదెమీ వివిధ భాషలలో విఖ్యాతి గాంచిన రచయితల సంక్షిప్త సాహిత్య జీవితాలను గ్రంధ రూపంలో ప్రచురిస్తున్నది. ఆ పరంపరలో భాగంగా పింగళి కాటూరి మోనో గ్రాఫ్ ప్రచురించాలని అకాదెమీ నిర్ణయించడం సాహిత్యాభి మానులకు సంతోషం కలిగించే విషయం. ఆ జంటకవుల రచనా విశేషాలను వివరించే అవకాశం నాకు లభించడం నా అదృష్టం.

పింగళి కాటూరి కవులు మహాకవులు. మహా పండితులు. వారు పద్యరచనలో ప్రసిద్ధులు. గద్య రచనలో గరిష్ఠులు. విమర్శ రచనలో విశిష్టులు. అనువాద రచనలో అత్యంత సమర్థులు. వారు జంట కవులుగా పండించిన సాహిత్య పంటలు రెండు. తొలకరి, సౌందరనందం. ఎవరికి వారే విడిగా రచించిన గ్రంథాలు మరికొన్ని. అన్ని గ్రంథాలు ఆంధ్రులను అలరించిన గ్రంథాలే. ఒక్కొక్క గ్రంథం లోని విశేషాలను వివరించడానికి ఒక్కొక్క గ్రంథం వ్రాయాలి.

ఈ జంట కవులు వ్యష్టిగా, సమష్టిగా రచించిన గ్రంథాలలోని విశేషాల నన్నిటినీ వీలైనంత సంక్షిప్తంగా వివరించడానికి ప్రయత్నించాను. ఈ గ్రంథ రచనా సమయంలో నేను అనేక గ్రంథాలను పరిశీలించాను. వ్యాసాలను పఠించాను. వాటిలోని విశేషాలను అవసరమైనంత వరకు స్వీకరించాను. ఆ యా రచయితలకు, అరుదైన ఈ గ్రంథ రచనావకాశాన్ని నాకు కల్పించిన కేంద్ర సాహిత్య అకాదెమీ నిర్వాహకులకు నా కృతజ్ఞతలు.

గొల్లపూడి ప్రకాశరావు

# 1. జంటకవులు

''జంట కవులు తెలుగు సాహితీలక్ష్మికి
కంటసరులు వెలుగు పంటసిరులు''

ఆంధ్ర కవితా జగత్తులో జంటకవుల ఉనికిని ప్రశంసిస్తూ మహాకవి కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు చెప్పిన పద్యభాగమిది. ఇంతేకాదు –

''నడచు వెంట వెంట అడుగు జంట విధాన
కవుల జంట కౌతుకముల పంట''

అంటూ జంటకవుల అవినాభావ సంబంధాన్నీ, వారు శ్రోతలలో సృష్టించే ఔత్సుక్యాన్నీ కూడా వర్ణించారు.

ఇంతకూ జంటకవులంటే ఎవరు? కవితాలోకంలో ఈ జంటకవులు ఎప్పుడు వెలిశారు? వీరి ప్రత్యేకత ఏమిటి?

సాధారణంగా ఒక కవి ఒక పద్యం చెప్పటం గాని, కావ్యం వ్రాయటంగాని జరుగుతుంది. అలాకాక ఒక పద్యాన్నిగాని, కావ్యాన్నిగాని ఇద్దరు కలిసి చెప్పటం జంటకవిత్వం. అలా చెప్పే వ్యక్తులు జంటకవులు. ఇది ఎంతో విచిత్రమైన విషయం. ఒక భావాన్ని ఒక కవి ఒక పద్యంగా చెప్పటం కష్టం కాదు. కాని ఒక కవి ఒక పద్యపాదం చెప్పిన తర్వాత అతని అభిప్రాయాన్ని అవగతం చేసుకొని రెండవ కవి రెండవ పాదం చెప్పడం, దాని ననుసరించి మొదటికవి మూడవపాదం చెప్పటం, రెండవకవి మళ్లీ నాల్గవపాదం చెప్పడం మాత్రం కష్టం. ఆ నాలుగు పాదాల పద్యం నాణ్యంగా రూపొందటం మరీ కష్టం. కష్టతరమైన ఈ కార్యక్రమాన్ని ఇష్టపూర్తిగా నిర్వహించేవారు జంటకవులు.

జంటకవులు, జంటకవిత్వం ఆంధ్రసాహిత్యానికే పరిమితంకాదు. ఆధునిక కాలానికే పరిమితం కాదు. సంస్కృతాంగ్లాది భాషలలోగూడా జంటకవిత్వం ఉంది. కాని ఆంధ్రసాహిత్యంలోవలె వ్యాప్తి గాంచలేదు. ప్రాచీన కాలంలో గూడా

జంటకవు లున్నారు. కాని ఆధునిక కాలంలో వలె బహుళసంఖ్యలో లేరు సంస్కృతంలో నాల్గవ శతాబ్దికి చెందిన రామిల సౌమిల కవులు తొలి జంటకవులు. తరువాతి కాలంలో కూడా సంస్కృతంలో దాదాపు పది జంటకవుల జంట లున్నట్లు సంస్కృతంలో జంటకవులు అనే ఈయుణ్ణి వీరరాఘవాచార్యులు గారి వ్యాసాన్ని బట్టి తెలుస్తున్నది. ఆంగ్లదేశంలో ఎలిజబెత్ రాణి యుగానికి చెందిన జాన్‌ఫ్లెచర్ వివిధ సమయాలలో, వివిధ రచయితలతో కలిసి జంటగా రచనలు చేశారు సుప్రసిద్ధ నాటక రచయిత విలియమ్ షేక్స్‌పియర్ ఫ్లెచర్‌తో కలిసి జంటగా రచనలు చేసిన వారిలో నొకరు. వర్డ్స్‌వర్త్ కాల్‌రిడ్జ్ కవీంద్రునితో కలసి 'Lyrical Ballads' అనే గ్రంధాన్ని ప్రచురించారు. అయితే జంటకవులు ఆంధ్రభాషలో వలె తక్కిన ఏ దేశ భాషలలోను వ్యాప్తిగాంచలేదనటం నిర్వివాదాంశం.

ఆంధ్రభాషలో తొలి జంటకవులు కాచ విఠల కవులు. వారు 13వ శతాబ్ది ఉత్తరార్ధంలోగాని, 14వ శతాబ్ది పూర్వార్ధంలోగాని జంట కవిత చెప్పారని చారిత్రకుల అభిప్రాయము. ఈ సోదరకవులు రంగనాథ రామాయణంలో ఉత్తర కాండను వ్రాశారు. ఈ ఆరువందల సంవత్సరాలలో నలుగురైదుగురు జంటకవుల కంటె అధికంగా లేరు. వారిలో నంది ఘంటల జంటకవులు సుప్రసిద్ధులు. 19, 20 శతాబ్దులలో ఆంధ్రదేశం జంటకవుల వీరవిహారానికి రంగస్థలంగా మారింది. ఒకటిన్నర శతాబ్ది కాలంలో అరవై జంటలకు మించి తెలుగులో జంట కవులు వెలిశారు. ఈ జంటకవు లందరిలో శిఖరప్రాయులు తిరుపతి వేంకటకవులు ఆధునిక యుగంలోనే కాదు ఆంధ్ర సాహిత్యంలోనే తిరుపతి వేంకటకవులకు లభించినంతటి కీర్తిప్రతిష్ఠలు మరే జంటకవులకూ లభించలేదు.

ఆరు వందల సంవత్సరాల క్రితం ఆరంభమైన జంట కవితావాహిని నాలుగు పాయలై ప్రవహించి రసికాంధ్రుల కాహ్లాదకారకమైంది. అవి .

**1. ఆశుకవితా రచన 2. అవధాన నిర్వహణము**

**3. ఖండ కావ్య రచన 4. ప్రబంధ రచన**

**1. ఆశుకవితా రచన :**

వేగాతివేగంగా పద్యాలు చెప్పటం ఆశుకవిత. పూర్వం ఘటికా శతగ్రంథకల్పన ప్రక్రియ ప్రసిద్ధం అనగా గడియకు నూరు పద్యాలు రచించటం. ఆధునిక యుగంలో వేంకట రామకృష్ణ కవులు, కొప్పరపు సోదర కవులు

మున్నగువారు ఆశుకవితా కల్పన గావించిన జంట కవులు. వేంకట రామకృష్ణ కవులు ప్రహ్లాద చరిత్ర, రామాయణం అత్యాశుధారతో పలికినవే. కొప్పరపు సోదరకవులు కధాకవీశ్వరులని పేరొంది సీతాకళ్యాణం, భీష్మ జననం, అభిమన్యువధ, కంసవధ వంటి గ్రంధాలను ఆశువుగా పలికారు. గంటకు కొన్ని వందల పద్యాలు చెప్పడం, కొప్పరపు సోదరకవులకు నల్లేరు మీది బండి నడక. జంటకవులు ఆశుకవిత నల్లడంలో రెండు పద్ధతులు గోచరిస్తున్నాయి.

అ ఒక పద్యం ఒకరు, రెండవ పద్యం మరొకరు వరుసగా చెప్పడం.

ఆ. కొన్ని పద్యాలు ఒకరు, ఆ తర్వాత కొన్ని పద్యాలు ఒకరుగా చెబుతూ మొత్తం కావ్యాన్ని పూర్తిచేయటం.

**2. అవధాన నిర్వహణం :**

అవధాన ప్రక్రియ ఆంధ్రులకు సుపరిచిత ప్రక్రియ. అష్టావధాన శతావధానాలు తెలుగు సరస్వతి కీర్తికిరీటాలు. తిరుపతి వేంకట కవులకు ముందు అష్టావధాన, శతావధానులు ఉన్నా వీరి సంఖ్య తామర తంపరగా మారింది వారి తర్వాతనే. సమస్యాపూరణ, నిషిద్ధాక్షరి, వ్యస్తాక్షరి, దత్తపది వంటి ఎనిమిది విధాలైన అంశాలలో ప్రావీణ్యాన్ని ప్రదర్శించే సాహిత్య ప్రకియ అష్టావధానం. నూర్గురు పృచ్ఛకులకు వారడిగిన విషయాలను గూర్చి పద్యాలు చెప్పి, తిరిగి అన్ని పద్యాలు ధారణ చేయటం శతావధానం.

జంట కవులు అవధానం చేయటంలో రెండు పద్ధతులున్నాయి.

అ. ఒక పద్యంలో ఒకరు ఒక పాదం, రెండవవారు రెండవ పాదం, మొదటివారు మూడవ పాదం, రెండవవారు నాల్గవ పాదం చెప్పటం

ఆ. మొదటి కవి మొదటి పాదం చెప్పగానే రెండవ కవి తక్కిన మూడు పాదాలు చెప్పటం రెండవ పద్ధతి. తిరుపతి వేంకటకవులు, వేంకట రామృకష్ణ కవులు, కొప్పరపు సోదరకవులు మున్నగువారందరు అవధాన నిర్వహణ గావించిన జంటకవులే.

**3. ఖండకావ్య రచన :**

ఆధునిక కాలంలో వ్యాప్తిగాంచిన రచన ఖండకావ్య రచన. పరిమిత పద్యాలలో అపరిమితానందాన్ని చేకూర్చే రచనా ప్రక్రియ ఇది. నవీనకాలపు కవులలో ఖండకావ్యం వ్రాయని కవి లేడనటం అతిశయోక్తి కాదు ఈ ప్రక్రియా వ్యాప్తిక ప్రధాన కారణం పత్రికలు

కవితా ఖండికలను జంటగా రచించటంలో గూడ రెండు పద్ధతులున్నవి
అ. ఒక ప్రదేశంలో ఉన్న కవి తానొక ఖండికను వ్రాసి రెండవవాని కిస్తాడు రెండవకవి ఆ ఖండికను చదివి మార్పులు చేర్పులు చేసి ప్రచురణార్థం గావించి ఇరువురి పేరిట ప్రకటిస్తాడు.
ఆ. ఒక కవి ఒక విషయాన్ని ఎన్నుకొని కొన్ని పద్యాలు వ్రాసి రెండవవానికి పంపిస్తే రెండవ కవి మొదటి పద్యాల కనుగుణమైన రీతిలో రచన చేసి ఖండకావ్యం పూర్తి చేస్తాడు.

**4. కావ్యరచన :**

కావ్యరచనలో జంటకవిత్వం కాచ విఠల సోదరుల రంగనాథరామాయణ ఉత్తర కాండ రచనతో ప్రారంభమైంది. ఆనాటి నుండి ఈనాటి వరకు ఎందరో జంటకవులు ఎన్నో కావ్యాలను రచించి ఆంధ్రశారద నర్చించారు. ఆధునిక యుగంలో తిరుపతి వేంకటకవులు, వేంకట పార్వతీశ్వరకవులు మున్నగు జంటకవులు కావ్యరచన గావించి ప్రసిద్ధినొందారు.

కావ్యరచనలో జంటకవుల రచనా విధానం వివిధ విధాలుగా విలసిల్లింది.
అ. ఒకే కావ్యంలో ఒక ఆశ్వాసం ఒకరు, మరొక ఆశ్వాసం మరొకరు - ఇలా చివరివరకు వ్రాయటం.
ఆ. ఒక కావ్యంలో సగం ఒక కవి వ్రాస్తే మిగతా సగం మరో కవి వ్రాయటం.
ఇ. ఒక కావ్యం దాదాపు ఒకరే వ్రాసినా అక్కడక్కడా కొన్ని పద్యాలు రెండో కవి వ్రాయటం.

ఈ పద్ధతులలో జంటకవులు ఏ పద్ధతి ననుసరించారో పాఠకులకు వారో, వారితో గాఢ పరిచయం ఉన్న మరొకరో, చెబితే తప్ప తెలియదు.

జంట కవిత్వ పద్ధతికి సంబంధించిన సంక్షిప్త వివరణ ఇది. ఆధునికాంధ్ర సాహిత్యమూర్తిలో శరీర, ప్రాణములవలె శోభించిన జంటకవులు తిరుపతి వేంకటకవులు. వారికి ముందు జంటకవులు లేకపోలేదు. వారి తర్వాత జంటకవులు రాకపోలేదు. సమకాలపు జంట కవులలో వారికి మిత్రులున్నారు. శత్రువులున్నారు. శిష్యు లున్నారు. శిష్యప్రాయు లున్నారు. ఏది ఏమైనా ఇరవయ్యవ శతాబ్దం జంటకవులలో వారే ప్రఖ్యాతులు. ప్రసిద్ధులు వారి స్థానం ఈ విషయంలో తక్కిన వారందరి కంటె ఉన్నతం, ఉత్తమం.

తిరుపతి వేంకట కవు లని ప్రసిద్ధినందిన కవీంద్రు లిద్దరు. వారు దివాకర్ల తిరుపతి శాస్త్రి, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి చెళ్లపిళ్ల వేంకట శాస్త్రి బందరు హిందూ హైస్కూలులో తెలుగు పండితులు అయస్కాంత సంపర్కంతో ఇనుము అయస్కాంతంగా రూపొందినట్లు, వేంకట శాస్త్రిగారితో సంబంధం వలన సామాన్య శిష్యులు గూడా పద్యరచనలో అసామాన్యులయ్యారు. విశ్వనాథ, త్రిపురనేని, వేలూరి వంటి వారెందరో వారి శిష్యులై రాణించారు వారి శిష్యులలో వారి పద్ధతి ననుసరించి జంటకవులుగా మారినవారు గూడ కొంద రున్నారు. అట్టివారిలో పింగళి, కాటూరి కవులు ప్రసిద్ధులు. వారు పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వేంకటేశ్వరరావు

## 2. పింగళి లక్ష్మీకాంతం - జీవితరేఖలు

పింగళి కాటూరి కవుల జంటలో ప్రథముడు పింగళి లక్ష్మీకాంతం. పింగళి గృహనామం అనగానే ఆంధ్రసాహిత్యంతో పరిచయం ఉన్న వారెవరికైనా జ్ఞప్తికి వచ్చే వ్యక్తి పింగళి సూరన. రాయల యుగంలో వెలసి రాఘవపాండవీయం, కళాపూర్ణోదయం, ప్రభావతీ ప్రద్యుమ్నం వంటి విలక్షణ గ్రంథాలను రచించి మించిన మహాకవి యతడు.

**"వంగడ మంతకున్ దగిన పావనుడై జనియించి జాహ్నవీ**
**తుంగగభీర భంగచయ తుల్యపటుత్వకవిత్వ కర్తయై**
**బంగరు రంగు లీనెడు ప్రబంధములన్ రచియించినట్టి మా**
**పింగళి వంశ సూరసుకవిన్ వినుతింతు సభాంతరంబునన్"**

అని తమ వంశంలో ప్రసిద్ధి నందిన పింగళి సూరనను లక్ష్మీకాంతకవి ఒక అవధాన సభలో ప్రశంసించారు. పింగళి వంశంలో ప్రసిద్ధి నందిన మహానుభావు లెందరో! నిజాం నవాబునకు మంత్రిత్వం నెరపిన అక్కన్నమాదన్నలు పింగళి వంశీయులే. భారత జాతీయ పతాక సృష్టికర్త పింగళి వెంకయ్య పింగళి వంశస్థుడే. ప్రఖ్యాత సినీ రచయిత పింగళి నాగేంద్రరావు గూడా ఈ వంశస్థుడే.

సుప్రసిద్ధి గాంచిన పింగళి వంశంవారు కొందరు కృష్ణాజిల్లా దివిసీమలో స్థిరపడ్డారు. పింగళి లక్ష్మీకాంతంగారి తండ్రి పింగళి వేంకటరత్నంగారు దివిసీమ లోని చిట్టూర్పు గ్రామ పెత్తందారు. చల్లపల్లి సంస్థానోద్యోగి. వీరు ఆర్వేల నియోగులు. అద్వైతులు. గౌతమ గోత్రులు. ఆపస్తంబసూత్రులు. సూర్యోపాసకులు.

పింగళి వేంకటరత్నంగారి కుటుంబిని కుటుంబమ్మగారు. ఈ దంపతులకు నలుగురు సంతానం. ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె. ముగ్గురు పుత్రులలో మధ్యముడు లక్ష్మీకాంతం. తల్లిదండ్రుల పుణ్యఫలంగా లక్ష్మీకాంతంగారు 1894 సంవత్సరం జనవరి 10వ తేదీన ఆర్తమూరులో మాతామహుల ఇంట జనన మందారు.

పింగళివారి మొదటి గురువు వారి తండ్రిగారే. కొంతకాలం చిట్టూర్పు గ్రామంలో వీధిబడిలో బాలపింగళి విద్యాభ్యాసం చేశారు. చిట్టూర్పు గ్రామంలో ఆనాడు ప్రాథమిక విద్యా సౌకర్యాలు గూడా లేవు. అందువలన బందరు చెంత గల గూడూరులో కొంతకాలం, రేపల్లెలో కొంతకాలం, బందరులో మరి కొంతకాలం చదివారు. బందరు హిందూ హైస్కూలులో విద్యాభ్యాసం పింగళివారి జీవితంలో కలసివచ్చిన మొదటి అదృష్టం. ''చెల్లపిళ్ల వేంకన గురువంచు చెప్పుకొనగా నది గొప్ప తెలుంగునాడునన్'' అని ప్రశంస పొందిన చెళ్ళపిళ్ల వేంకట శాస్త్రి గురువుగా, ''ప్రాణము ప్రాణమైన గుణరమ్యుడు కాటురి వేంకటేశుడు'' మిత్రుడుగా లభించిన బంగారు కాల మది. అయితే ఈ అదృష్టం విద్యాకవితల విషయంలోనే. ఆర్థికంగా బందరు విద్యాభ్యాసపు రోజులు పింగళివారికి కష్టపురోజులు.

''గడిపితిని కొన్ని యేండ్లు చీకటిమయములు
గ్రుడ్డి వెన్నెల యైన నెరుంగకుండ''

అని వారు వగచిన దుర్దినాలు అవి. తినడానికి తిండిలేక మిఠాయి దుకాణంలో అణా పకోడీలు అప్పు తెచ్చుకొని, ఉచితంగా లభించే పంపునీళ్ళు త్రాగి, వీధి అరుగుల మీద పండుకొని నిద్రించిన రోజులు ఎన్నో! వేంపటి నరసింహం, వేమూరి నారాయణమూర్తి, కాటూరి వేంకటేశ్వరరావు, దుక్కిపాటి వేంకటరత్నం మున్నగువారి సహాయంతో డిగ్రీ పూర్తి చేశారు. హైస్కూలు చదువు పూర్తి అయిన తర్వాత రెండు సంవత్సరాలు విజయవాడ సబ్‌కోర్టులో కాపీయిస్టు ఉద్యోగం చేయవలసి రావటం దరిద్రదేవత దయ వలననే.

కష్టాలు ఎన్ని ఎదురైనా పింగళివారు చదువు నుండి దృష్టి మరల్చలేదు. అందువలననే ప్రతి క్లాసులో ఫస్టున పాసయ్యేవారు. బి.ఏ.లో యూనివర్శిటీ ఫస్టుగా ఉత్తీర్ణులయ్యారు. బంగారు పతకం బహుమానంగా పొందారు. నోబుల్ హైస్కూలులో తెలుగు పండితులుగా ఉద్యోగంలో చేరారు. మదరాసులో ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీలో పరిశోధక పదవిని నిర్వహించారు. ఎం.ఏ. చదివి ఆ పరీక్షలో గూడా ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై బంగారు పతకం పొందారు. పిమ్మట 1931లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలో ఉద్యోగంలో చేరారు. 18 సంవత్సరాలపాటు శాఖాధ్యక్ష భారాన్ని వహించారు. ఉద్యోగ విరమణానంతరం కొన్నేండ్లపాటు ఆకాశవాణిలో సాహిత్య సలహాదారుగా పనిచేశారు

1961వ సంవత్సరములో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఆచార్య పీఠాన్నధిష్ఠించారు. 1970వ సంవత్సరంలో వారికి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ నిచ్చి సత్కరించింది. ఎంతోమంది పిహెచ్.డి.లను తీర్చిదిద్దిన వారికి అంతవరకు డాక్టర్ డిగ్రీ లేదు. ఆర్థిక కారణాల వలన చదువు కొనసాగించలేక ఉద్యోగంలో చేరటం, పిహెచ్.డి.ల పట్ల మోజు ఆ కాలంలో అంతగా లేకపోవడం ఇందుకు కారణాలు. 1970లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పింగళి వారికి విశిష్ట సభ్యత్వం ఇచ్చి తనను తాను సత్కరించుకున్నది.

పింగళివారి వ్యక్తిగతేతర జీవితాన్ని మూడు భాగాలుగా విభజించవచ్చు.

**1. నటదశ**

**2. అధ్యాపక దశ**

**3. రచయిత దశ**

సౌకర్యం కోసం మూడు దశలని భావించినా నటుడుగా ఉన్న సమయం లోను, అధ్యాపకుడిగా ఖ్యాతి గాంచిన సమయంలోను రచన సాగింపకపోలేదు. లక్ష్మీకాంతంగారి గురువర్యులు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు తన అవధానం పూర్తి అయిన తర్వాత ఆ ప్రదేశంలో తన నాటకాలను శిష్యులచేత ప్రదర్శింపజేసేవారు. లక్ష్మీకాంతంగారి సోదరుడు నర్సయ్యగారు నటనాభిలాషి. సహజంగా నటనాసక్తిగల పింగళివారు గురుసోదరుల ప్రోత్సాహంతో నాటకరంగంలో రాణించారు. అనేక నాటకాలలో వివిధ పాత్రలను ధరంచి అనేకుల ప్రశంసలను పొందారు. రసపుత్ర విజయంలో రాజసింహ పాత్రకు బంగారు పతకం బహుమతిగా పొందారు. పాండవోద్యోగవిజయ నాటకాలలో ధర్మరాజు పాత్రను ధరించి అపరధర్మరాజుగా ప్రఖ్యాతి నందారు.

**''సాహితీ వైదగ్ధ్య సహిత నాటక కళా**
**శోభి పింగళి ధర్మసూను డొకడు''**

అని కవి పాదుషా పువ్వాడ శేషగిరారావు పింగళి వారి నటనా వైదగ్ధ్యాన్ని నుతించారు. పురాణం సూరిశాస్త్రి, వసురాయకవి వంటి సుప్రసిద్ధ పండితకవులు వారి పాత్రోచిత స్వరూపాభినయాలను ప్రశంసించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆంధ్ర శాఖాధ్యక్షుడిగా పదవీ విరమణ చేసిన తర్వాత పింగళివారు ఆకాశవాణిలో సాహిత్య సలహాదారు ఉద్యోగంలో చేరారు. ''రేడియోలో పదిమంది గాయనీ గాయకుల

చేత పాడించవచ్చు. నటీనటులచేత పలికించవచ్చు. ఆ వినోదానికీ క్లాసులో కూర్చొని పాఠాలు చెప్పడానికీ పోలికేమిటండీ'' అని తన శ్రేయోభిలాషి అయిన వరదాచార్యులుగారితో అన్న వాక్యాలను బట్టి వారికి నటనపై, నాటక కళపై ఎంత అభిమానమో వ్యక్తమౌతుంది.

పింగళివారు ఉత్తమ బోధకులు. బి.ఏ. చదువు పూర్తికాగానే నోబుల్ హైస్కూలులో తెలుగు పండిత పదవి లభించింది. తలనొప్పి కల్గించే వ్యాకరణ పాఠాలను సైతం ఆసక్తిదాయకంగా విద్యార్థులకు బోధించటంలో వారు మిక్కిలి నేర్పరి. వారి బోధనాపాటవాన్ని గమనించి అధికారులు వారికి నోబుల్ కాలేజీలో ట్యూటర్‌గా పదోన్నతి కల్పించారు. ఎం.ఏ. పూర్తయిన తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వారికి ఆంధ్రోపన్యాసక పదవి లభించింది. ''వత్సరత్రయంలో వాఙ్మయ విశ్వరూపాలను మా మనఃఫలకముపై సుస్థిరముగా చిత్రించిన శేముషీమంతులు మా గురుదేవు''లని వారి శిష్యులు వారిని ప్రశంసించారు. ''విద్యా వితరణ మొనరించుట నన్ను బ్రహ్మానందోల్బణ చిత్తుని గావించెడిన్'' అని వారు కూడా చెప్పుకున్నారు. పింగళివారి గురువైన చెళ్లపిళ్లవారు శిష్యుని పాఠప్రవచన శక్తిని తెలుసుకోవాలని లక్ష్మీకాంతంగారి క్లాసుకు వెళ్లి కూర్చొని విన్నారు. ''ఆ బోధనా పద్ధతికి, లక్ష్మీకాంతం పాండిత్య ప్రభావాలకు ముగ్ధుణ్ణైనాను... నా పేరు నిల్పగల సమర్థుడైనాడు...'' అని ప్రశంసించారు. తనంతటి వాళ్లుగా తన శిష్యులను తయారుచేయాలని లక్ష్మీకాంతంగారి తహతహ. లక్ష్మీకాంతంగారి శిష్యులు వారిని ''రస సిద్ధాంత రహస్యోపనిషదుపాధ్యాయుని''గా, ''సాహిత్య శిల్ప క్రియోజ్వల చతురాస్యుని''గా కొనియాడారు. విద్యార్థులకు పాఠంచెప్పి డిగ్రీ తెప్పించడమే కాక వారి వ్యక్తిత్వాలను కూడా తీర్చిదిద్దిన ఉత్తమాధ్యాపకులు పింగళివారు.

పింగళివారు గొప్ప రచయిత. వారు కాటూరివారితో కలిసి కొన్ని, వ్యక్తిగతంగా కొన్ని రచనలు చేశారు. ఆ రచనలలో వైవిధ్యం ఉంది. వారు అనువాదాలు చేశారు. స్వతంత్ర కావ్యాలు వ్రాశారు. విమర్శ గ్రంథాలు వ్రాశారు. వ్యాకరణ గ్రంథాలు వ్రాశారు. వారి గ్రంథాలు రాశిలో అధికం కాకపోయినా వాసిలో ఉత్తమాలు.

పేదరికం నుండి పెద్దరికం పొందిన లక్ష్మీకాంతంగారి వ్యక్తిత్వం ప్రత్యేకమైంది. పేదరికంలో ఉన్నా క్రుంగిపోలేదు పెద్దరికం పొందినా పొంగిపోలేదు.

ఎప్పుడూ ఆత్మాభిమానంతో జీవించారు. వారి ఆత్మాభిమానానికి ఒక ఉదాహరణ. ఒక రోజున శ్రీశ్రీ విక్రమదేవవర్మగారు పింగళివారితో ''మీరు కృష్ణాజిల్లావారా? విశాఖ జిల్లా వారనుకున్నాను'' అన్నారట! లక్ష్మీకాంతంగారు వెంటనే ''ఎప్పుడూ ఒక్కసారైనా మాట్లాడుతూ వంగుని దణ్ణం పెడుతూ సమాధానం చెప్పలేదు కదా! విశాఖవాణ్ణి ఎలా అవుతానని అనుకున్నారు?'' అని సమాధానం చెప్పారట! విశాఖవారు రాజాగారితో మాట్లాడేటప్పుడు వంగి నమస్కరిస్తూ 'చిత్తం' అంటూ సంభాషణ సాగించే ఆచారమట! పింగళి వారెప్పుడు అలా చేయలేదు. అవసరమైన సమయంలో తనకు ఆత్మీయులు, అధికారులునైన కట్టమంచి వారిని సైతం వ్యతిరేకించగల సాహసం వారిది. పాఠ్యగ్రంథ నిర్ణయ విషయంలో న్యాయం కోసం ఎదిరించవలసిన పరిస్థితులేర్పడేవి కూడా! అవమానాన్ని గూడా వారు సహించలేరు. కార్యార్థియై, తన చెంతకు ఒక సందర్భంలో వచ్చిన వ్యక్తి మరొక సందర్భంలో తన్ను గుర్తించకుండా ''వీరెవరు?'' అని ప్రశ్నించినప్పుడు తన దగ్గరకు వచ్చి మెమొరాండం సమర్పించిన సంగతి జ్ఞప్తిచేసి ''నా పేరు లక్ష్మీకాంతం'' అని చెప్పారు. అంతటి ఆత్మాభిమానంతో వారు జీవించారు. దాదాపు ఎనభై సంవత్సరాలపాటు ఎంతో కీర్తి ప్రతిష్ఠలతో జీవించిన పింగళి లక్ష్మీకాంతంగారు 1972వ సంవత్సరం జనవరి 10వ తేదీన స్వర్గస్థులయ్యారు. వారు జన్మించింది జనవరి 10. వారు మరణించింది జనవరి 10. ఇది యాదృచ్ఛికమే అయినా అరుదైన సంఘటన.

## 3. కాటూరి వేంకటేశ్వరరావు - జీవితరేఖలు

పింగళి కాటూరి కవుల జంటలో ద్వితీయుడు కాటూరి వేంకటేశ్వరరావు. పింగళి గృహనామం వినగానే పింగళి సూరన జ్ఞప్తికి వచ్చినట్లు, కాటూరి గృహనామం వినగానే ఏ మహాకవీ గుర్తుకు రాకపోయినా కాటూరువారిది కవి వంశమే. కాటూరివారు పూర్వం నుండి కాటూరివారు కారు. వీరి పూర్వీకులు చదలవాడ నివాసులు. అంతకు పూర్వం గూడ్లూరు నివాసులు. కవిత్రయంలో నొకడైన ఎఱ్ఱాప్రగడ జన్మస్థలం గుడ్లూరు. ఎఱ్ఱన తన వంశదీపకుడని కాటూరివారే తెలిపారు.

**''మా వంశదీపకుం డన**
**గా విందున్ శంభుదాసకవి, నెఱ్ఱన్నన్**
**శ్రీవత్స గోత్రజాతుని**
**పావన చరితుని ప్రబంధ పరమేశ్వరునిన్''**

చదలవాడ మల్లన కవీంద్రుని కాలం తర్వాత కొంతకాలానికి ఆ వంశస్థులు కృష్ణాజిల్లా చేరారు. వారిలో కొందరు నూజివీడు ప్రభువు వలన కాటూరు గ్రామణికత్వాన్ని పొందారు. వేంకటేశ్వరరావుగారు, ఆ వంశంలో, అనంతర కాలంలో యావదాంధ్ర ప్రసిద్ధిగాంచిన కవీంద్రుడు.

కాటూరి వేంకటేశ్వరరావుగారి తండ్రి వేంకట కృష్ణయ్యగారు. తల్లి రామాంబగారు. ఆ పుణ్యదంపతుల పుణ్యఫలంగా కాటూరివారు 1895 అక్టోబర్ 15న జన్మించారు వీరు ఆరువేల నియోగులు. శ్రీవత్స గోత్రులు. కాటూరి వారి తాత శంకరయ్య. అతని తమ్ముడు కొండయ్య. ఈ సోదరులలో కొండయ్య గారికి సంతాన భాగ్యం కలుగలేదు. అందుకని శంకరయ్యగారి మనుమలలో నొకడైన వేంకటేశ్వరరావుగారిని దత్తత తీసుకున్నాడు. కాబట్టి కాటూరి కవిగారి పినతాత కాటూరి వారికి దత్తుతండ్రి అయ్యారు వీరి భార్య లక్ష్మమ్మ

కాటూరి వారిది అవిభక్త కుటుంబం. కలిగిన కుటుంబం. వేంకటేశ్వరరావు గారికి అయిదు సంవత్సరాల వయస్సులో తండ్రి గతించాడు. తిరుపతి యాత్రకు వెళ్లిన తండ్రి అక్కడే దేహయాత్ర ఛాలించాడు. వేంకటకృష్ణయ్యగారి పెద్ద కుమారుడు రామకృష్ణయ్య అవిభక్త కుటుంబానికి పెద్దరికం వహించి సంసారాన్ని సాఫీగా నిర్వహించారు. కాటూరివారు ఇంటి విషయాలు పట్టించుకొనేవారు కారు.

ధనిక కుటుంబం గనుక వేంకటేశ్వరరావు గారికి పింగళివారికి వలె ఆర్థిక బాధలు లేవు. రెండవ ఫారం వరకు వారు గుడివాడలో చదివారు. మూడవ ఫారం చదువుకు గుడివాడనుండి బందరు చేరారు. హిందూ హైస్కూలులో విద్యాభ్యాసం గావించారు. అప్పుడే వారికి చెళ్లపిళ్ల వారి శిష్యరికం, పింగళివారి మైత్రి లభించాయి. 1921వ సంవత్సరంలో వేంకటేశ్వరరావు బి.ఏ. చదువుతున్న రోజులలో గాంధీగారు సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించారు. విద్యార్థులను ఆంగ్లేయ విద్యాభ్యాసం మానండని బోధించారు. ఆ పిలుపు కాటూరి వారి కర్ణపుటాలకు చేరింది. హృదయ పుటాన్ని తాకింది. అంతే. చదువుకు స్వస్తి చెప్పారు. స్వాతంత్ర్య సమరంలో దూకారు. దేశభక్తి గేయాలు వ్రాశారు. జైలు శిక్ష ననుభవించారు. స్వయంకృషితో సంస్కృతాంధ్రాంగ్లభాషలలో మంచి పాండిత్యం సంపాదించారు.

దేశభక్తి భావంతో స్థాపితమైన ఆంధ్ర జాతీయ కళాశాలలో 1933 మొదలు 1939 వరకు ఆంధ్రోపన్యాసకులుగా పనిచేశారు. 1939 నుండి 43 వరకు అదే కళాశాలకు వైస్ ప్రిన్సిపాల్‌గా ఉద్యోగ నిర్వహణ చేశారు. 1945 నుండి 1953 వరకు కృష్ణాపత్రికకు సంపాదకులుగా వ్యవహరించారు.

కృష్ణాపత్రిక ఒకప్పటి సుప్రసిద్ధ పత్రిక. కృష్ణా పత్రిక సంపాదకులు ముట్నూరి కృష్ణారావు ఎప్పటికీ గొప్ప సంపాదకులు. కాటూరి వారు ముట్నూరి వారి దర్బారు కవులు. కృష్ణారావు గారికి వేంకటేశ్వరరావు గారి మీద అమిత విశ్వాసం. అందుకే ముట్నూరి వారు తన మరణానంతరం కాటూరి వారిని కృష్ణా పత్రికకు సంపాదకులుగా నియమిస్తూ, విల్లు వ్రాశారు. కాటూరివారి రచనలలో అత్యధికం కృష్ణాపత్రికలోనే ప్రకటితాలు. కృష్ణా పత్రికకు వారు వ్రాసిన సంపాదకీయాలు వచన కావ్యాలు.

కాటూరి వారు స్నేహశీలి. సమకాలంలోని కవులలో అనేకులు వారికి ప్రాణమిత్రులు. అడవి బాపిరాజు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, మాధవపెద్ది బుచ్చి

సుందరరామశాస్త్రి, విశ్వనాథ, తుమ్మల మొదలైన కవులతో వీరికి స్నేహానుబంధం ఎక్కువ.

**''ఒండొరులు చేరినపుడు కాటూరి కులుడు**
**మిక్కిలిగ నన్నె నన్నె ప్రేమించు ననుచు**
**బెనగుదరు నీ ప్రసక్తిలో దెనుగువార**
**లెంత పండితుండవొ వేంకటేశ్వర కవి''**

తుమ్మల వారి ఈ పద్యం కంటె కాటూరి వారి స్నేహశీలతకు ఇంకే ఉదాహరణ కావాలి? 'కవితలల్లే విద్యార్థినైనా సాటికవినిగా గౌరవించగల సౌజన్యము' వారిది.

''అతన్ని మించిన మిత్రుడు నాకీ లోకంలో ఇంకొకడు లేడు. . ఉన్న బహు కొద్దిమంది మిత్రులలో వేంకటేశ్వరరావు ప్రథముడు''అని పింగళివారు అన్నారు. ఇలా అందరికీ స్నేహపాత్రుడుగా జీవించి ''లోప మెరుగని వర్తనము, లోటు లేని జీవనం'' గడపిన కాటూరి వారు పింగళివారితో కలసి కొన్ని, ప్రత్యేకంగా కొన్ని గ్రంథాలు వెలయించారు. వారు అనువాదాలు చేశారు. స్వతంత్ర కావ్యాలు వ్రాశారు. రేడియో నాటికలు వ్రాశారు. బాలసాహితిని వెలయించారు. వారి గ్రంథాలు గణంలో స్వల్పమే అయినా గుణంలో అనల్పాలు. ''ఆంధ్రభాషలో ఉన్నటువంటి ఒక విధమైన సౌకుమార్యం, ఒకానొక మెత్తదనం ఇదంతా వడబోసి అతని కవిత్వంలో ఉన్నదా అనిపిస్తుంది''అని విశ్వనాథ వారి పొగడ్త లందుకున్నారు. ''ఆయన కవిత సహజమైన చిరునవ్వు'' అని ప్రశంసించారు మల్లాది రామకృష్ణ శాస్త్రిగారు.

జీవితమే ఒక సుందర కావ్యంలా గడపిన కాటూరివారు షష్టిపూర్తి గడచిన కొన్ని సంవత్సరాలకు అస్వస్థులయ్యారు. గొంతు కేన్సర్ వ్యాధి సోకింది. వ్యాధి చికిత్సకు లొంగలేదు. మరణ మెరుగని రచనలు చేసిన మహాకవి మరణానికి లొంగిపోయారు. త్యాగమూర్తి క్రీస్తు జన్మించిన రోజునే వారి దేహత్యాగం. 1962వ సంవత్సరం డిసెంబరు 25న వారి మరణంతో పింగళి కాటూరి జంటకవుల జంట భౌతికంగా విడిపోయింది. పింగళి కాటూరి జంటలో వెనుక పూసిన పూవు ముందు రాలిపోయింది. మిగిలిన పువ్వు మరో దశాబ్దంపాటు చెన్నుదరిగి జీవించింది.

# 4. జంట కవుల తొలి కలయిక - అవధానాలు

గోదావరీ తీరవాసులైన తిరుపతి వేంకటకవు లటు గద్వా లిటు చెన్నపట్టణము దాక యావదాంధ్ర పర్యటన గావించారు. అవధానాల నద్భుతంగా నిర్వహించారు. ''ఏనుగు నెక్కినాము, ధరణీంద్రులు మ్రొక్కగ నిక్కినాము'' అని తమ దిగ్విజయ సన్మానాలను గూర్చి గర్వంగా వారు చెప్పుకొన్నారు. ఈ జంటకవులలో నొకరైన చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు కొంతకాలం పాటు బందరు హిందూ హైస్కూలులో తెలుగు పండితులుగా ఉద్యోగం చేశారు.

అప్పటికే బందరు పట్టణం సాహిత్య కేంద్రం. చెళ్లపిళ్ల వారి రాకతో బందరు కీర్తిప్రతిష్ఠలు ద్విగుణీకృతమయ్యాయి. చెళ్లపిళ్ల వారి శిష్యు లెందరో కవి పండితులుగా లబ్ధ ప్రతిష్ఠులయ్యారు. త్రిపురనేని రామస్వామి చౌదరి, వేలూరి శివరామ శాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావు మొదలైన సుప్రసిద్ధాంధ్ర పండిత కవులు చెళ్లపిళ్ల వారి హైస్కూలు శిష్యులే.

తిరుపతి వేంకటకవులు జంటకవులు. గురువుగారి అడుగుజాడలలో నడచి జంటకవులైనవారు పింగళి, కాటూరి కవులు. అనంతర కాలంలో సౌందరనందం వంటి అత్యుత్తమ కావ్యం ఆంధ్ర లోకానికి అందించవలసి ఉండడం వలన కాబోలు వీరిరువురికి గాఢమైన మైత్రి ఏర్పడింది. ఎంతటి గాఢమైత్రి అంటే ''నేనూ అతనూ ఒకటే. అతను ఆత్మ. నేను శరీరం; నేను ఆత్మ, అతను శరీరం'' అని అనుకొనేంత. ఈ జంటకవు లిరువురకూ బంధుత్వం గూడా ఉంది. బంధుత్వ బంధం కంటే స్నేహబంధమే వీరు జంటకవులు కావడానికి కారణమైనది.

ఈ జంటలో వయస్సులో పెద్దవారు పింగళివారు. వయస్సులోనే కాదు చొరవలో కూడా. ''చాలా చిన్నతనంలోనే రాటుతేలి గడుగ్గాయి అనిపించుకున్నవారు

కాంతయ్యగారు.'' నాటికీ ముగ్ధత్వం వీడక నునుసిగ్గుతో చాటుమాటున అతి బిడియంతో కాలం గడిపినవారు వేంకటేశ్వరరావుగారు.

వేంకటేశ్వరరావు గారికి లక్ష్మీకాంతం గారు కవితామర్మాలను, అవధాన పద్ధతులను వివరించి బోధించారు.

ఏ సభలో అయినా ముందు పింగళివారు ప్రారంభిస్తే కాటూరివారు తోడి పెండ్లి కొడుకు వలె కూర్చుని అవసరాన్ని బట్టి పద్యం చెప్పడమో, చెప్పే పద్యం పూర్తిచేయటమో చేస్తుండేవారు. అందుకే కాటూరి వారు

**''పింగళి కాంత సుకవితో**
**సంగాతము, చెళ్లపిళ్ల సద్గురుకృప న**
**న్నుం గవి మాత్రుని గావిం**
**చెం గొండొక పద్యరచన చేతు జపలతన్''**

అని గురువుగారి కృపతోపాటు పింగళివారి స్నేహం కూడా తాను కవిత్వం చెప్పి కవిగా కీర్తినందడానికి కారణం అని కృతజ్ఞత తెలిపారు.

## అవధానాలు

తిరుపతి వేంకట కవులు అవధాన విద్యాప్రచారం గావించిన వారిలో ప్రముఖులు. తాము ఆంధ్రదేశము నాలుగు చెరగులా అవధానాలు చేయడమే కాక శిష్యులను గూడా ప్రోత్సహించారు. పల్నాటిసీమలోని వేమవరం గ్రామంలో తిరుపతి వేంకటకవులు శతావధానం చేసినపుడు సదస్యులిచ్చిన ఒక సమస్యను వారు తమ శిష్యుడైన పింగళివారి చేత పూర్తి చేయించారు. పదహారేండ్ల వయస్సు గల పింగళివారు పూర్తిచేసిన సమస్య యిది.

**''కొప్రమ్మున దాగియుంట ప్రతిపక్షులకున్ సహజమ్ము కాదొకో!''**

**''రమ్మని పిల్వనంపిన యరాతుల యందలి భీతిచేసి ప్రా**
**ణమ్ములు దక్క వంచు నయనమ్ముల బాష్పము లుప్పతిల్ల శో**
**కమ్మున కొప్రమం దిరికి కానగరా రిది వింతకాదు కొ**
**ప్రమ్మున దాగియుంట ప్రతిపక్షులకున్ సహజమ్ము కాదొకో!''**

ఆనాడు తిరుపతి వేంకటకవులకు ప్రతిపక్షులైన కొప్పరపు సోదర కవులను గూర్చి వ్యంగ్య విమర్శతో పూర్తి చేసిన సమస్య యిది. అంతటితో నాగక వడ్లమన్నాటి

నరసింహశర్మగారితో కలిసి జంటగా పద్య, గద్య లేఖలతో కొప్పరపు వారి నెదిరించారు. అటు పిమ్మట, పింగళి కాటూరి కవులు జంటకవులైన పిమ్మట, వారిరువురు ఎన్నోచోట్ల అవధానాలు చేశారు. బందరు, అవంతవరం, తోట్లవల్లూరు, నెల్లూరు సీమలు వారి అవధాన రంగస్థలాలలో కొన్ని ప్రాంతాలు.

**''సుంతయు సంస్కృతాభ్యసన శోభ వహింపని కైత నెట్టులో**
**కొంత గ్రహించి తెంపుమెయి కోవిద సన్నిధి వేంకటేశ శ్రీ**
**కాంతులు మేలు సల్ప సమకట్టిన యీ యవధానమందు నా**
**వంతయు లోపముండక జయప్రదమౌ నటు జూడు మంబికా!''**

అని ముదునూరు శతావధాన ప్రారంభ స్తుతి పద్యంలో వినయం ప్రదర్శించినా నెల్లూరు శతావధాన సభలో ధిక్కారధోరణినే ప్రదర్శించారు. ''మా గురువులు చెరొక శబ్దం వేస్తూ, చెరొక పాదం చెప్తూ అవధానాలు చేశారు. మేమో చెరొక అక్షరం వేస్తూ అవధానం చేయగలం'' అని తమ సామర్థ్యాన్ని చాటి చెప్పారు. అప్పుడు ప్రేక్షకులలో నున్న కళాప్రపూర్ణ వేదం వేంకటరాయ శాస్త్రిగారు 'కాంతా రమ్మనియెన్ మునీంద్రుడు చమత్కారంబు దీపింపగన్'' అనే సమస్య నిచ్చారు. ఈ సమస్యను పింగళి కాటూరి కవులు చెరొక అక్షరంగా పూరించారట!

**''దంతుల్ ఘోటకముల్ పదాతులును చెంతన్ గొల్చిరాన్ వచ్చు దు**
**ష్యంతున్ గన్గొని కణ్వమౌని యిటు రాజా రమ్మనన్ మీకు మీ**
**యంతే వాసులకున్ సుఖమ్మెయన - నీ యండన్ సుఖంబుండె మా**
**కాంతార మ్మనియెన్ మునీంద్రుడు చమత్కారంబు దీపింపగన్''**

కాంతా - రమ్మ అను రెండు పద్యాలను కాంతారమ్మ అని అరణ్యం అనే అర్థంలో ఉపయోగించి చమత్కారం దీపించేటట్లు వీరు సమస్యాపూరణ గావించారు. ఇది పింగళి కాటూరి కవుల అవధాన విధానం.

పింగళి కాటూరి కవుల జంట అవధానాల పంట నెంతో కాలం పండించలేదు. ఆశు కవితా రచన నెంతో కాలం ఆదరించలేదు. కారణం ప్రత్యేకంగా వారు చెప్పకపోయినా సహృదయులకు తెలియక పోదు. గంటకు వందలకొద్దీ పద్యాలు చెప్తామని గంటలు కట్టుకోవడమే గాని ఆశుకవిత సుకవిత కావడాని కవకాశం లేదు. ''అవధానాలు గారడీల వంటివి. వాటి ప్రదర్శన వల్ల ప్రజల్ని ఆశ్చర్య చకితుల్ని కావించవచ్చు. ధనార్జనం చేయవచ్చు. కాని శాశ్వతకీర్తి

లభించాలంటే సత్కావ్యరచన కావించాలి. అవధానాలు చేస్తే కావ్యాలు కూడా రాయవచ్చని వాదించేవాళ్లు ఉంటారు. అప్పుడా కావ్యాలు ఆశుకావ్యాలుగానే ఉంటాయి. అందులోను గణాచారే గోచరిస్తాడు. గుణాచారి కన్పించడు. శిల్పం ఉండదు. ''నిలకడ వలయు కృతికి అంటాడు అప్పకవి. ఆ నిలకడ ఆశుకవికి, అవధాన కవికి ఉండదు'' అన్నారు డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తంగారు. ప్రాచీన కాలంలో చాటువులు చెప్పి మెప్పించిన కవులు లేకపోలేదు. తిరుపతి వేంకటకవుల అవధాన పద్యాలు కొన్ని కావ్య గౌరవం పొందక పోలేదు. ఇది సకృత్తుగా జరిగే విషయం.

కొన్నాళ్లు అవధానాలు చేసి, ఆ మార్గం సన్మార్గం కాదని భావించి, ఆ మార్గం వదలి, కావ్య నిర్మాణమార్గాన్ని చేపట్టి 'భావకవితా పితామహుడు'గా భాసిల్లిన రాయప్రోలువారు ఆశుకవితను గూర్చి చెప్పిన పద్యమిది.

> **''రసమో? భావమొ? జీవదర్థ సుకుమార వ్యంజనామంజు శ**
> **బ్దసమాసారచనంబొ? సాధు హృదయస్పంద ప్రతిష్ఠా కథా**
> **విసరంబో? సకలార్థ శూన్యమగు నీ వేగాతివేగోక్తి దు**
> **ర్వ్యసనం బేటికి? త్రిప్పు మింక జననీ! రమ్యాక్షరక్షోణికిన్''**

వేగాతివేగోక్తి దుర్వ్యసనాన్ని మానుకోవాలనీ, రమ్యాక్షర క్షోణికి మారాలని భావించి పింగళి కాటూరి కవులు అవధాన సరస్వతికి మంగళం పాడి కావ్య సరస్వతి కన్నులకు కాటుక దిద్దారు.

# 5. నవ్య కవితావనంలో - తొలకరి

జంట కవులుగా వీరు రచించిన తొలి కావ్యం 'తొలకరి'. పింగళి కాటూరి కవులని ఈ జంటకవుల నందరూ పిలుస్తున్నా వీరు మాత్రం రెండు పేర్లు విడివిడిగానే ప్రకటించుకున్నారు. తొలకరి అనే భావగర్భితమైన శీర్షికను బట్టి ఈ జంటకవులు వయస్సులో చిన్నవారని, ఇది వారి తొలి కృతి కావచ్చునని కట్టమంచి వారు భావించారు. ''వీరి కలయిక నవ్య కవితా లోకమునకు తొలకరి. అదే హేతువుగా వీరి తొలి కృతికి తొలకరి యని పేరు వచ్చి యుండవచ్చు'' నని మధునాపంతులవారు తలంచారు. ఈ జంటకవులు ''1923లో రచించిన తొలకరి అనే ఖండ కావ్య సంపుటి భావకవిత్వంలో నిజంగా తొలకరి'' అని ప్రశంసించారు ఆరుద్ర.

ఈ శతాబ్ది ప్రథమ పాదమంతా భావకవితా సామ్రాజ్యం. ఆ యుగంలో భావకవితాప్రభావానికి లోనుగాని యువకవి లేడు. ఆంగ్ల భాషాభ్యసనం వలన ఆంధ్రకవితలో వెలసిన నూతన కవితావిధానం భావకవిత్వం. భావకవిత్వం అంటే ప్రణయ కవిత్వం అని కొందరు భావిస్తారు. అది పొరపాటు. ప్రణయ కవిత భావ కవితలో ముఖ్య భాగం మాత్రమే. భావకవితలో ప్రణయం, ప్రకృతి, దేశభక్తి, సంఘ సంస్కరణ, స్మృతి వంటి ఎన్నో విభాగా లున్నాయి. ఈ విభాగాలలో ప్రకృతివర్ణన, దేశభక్తి అనే భావాలకు పట్టుగొమ్మ తొలకరి.

తొలకరి ఖండ కావ్య సంపుటి. ఇందులోని ఖండికలు పన్నెండు. తొలకరిలోని ఖండికలలో పల్లీ జీవన ప్రదర్శకాలైన ప్రకృతి వర్ణన ఖండికలు అధికం. సంక్రాంతి, జొన్నచేను, ఎడబాటు, అజ్ఞానకృతము, రసాలము, తొలిపూత ఇట్టివి. కోకిల, బోనులోని సింగము దేశభక్త్యను ప్రాణితమైన ఖండికలు. కవితా సామాగ్రి, కవిశిశువు కవిత్వతత్త్వ నిరూపక ఖండికలు. ఎవరు నీవు? ప్రణయ కవిత. రక్తతిలకము చారిత్రక ఖండిక. తొలకరిలోని పెక్కు ఖండికలు సంభాష

ణాత్మకాలు. ఏకపాత్ర ప్రవర్తితాలు. ప్రాచీనాంధ్ర కవిత నంతటిని పరించి, ఆంగ్ల సాహితి నంతటిని పరిశీలించి రెంటి యందలి మేలేర్చి వీరు తొలకరిని రచించారు. ఛందోబద్ధమైన నూతన ప్రయోగ విషయంలోను, వస్తుస్వీకరణ విషయంలోను వీరు నవీనత ననుసరించారు.

'కవితా సామగ్రి' ఖండిక కథాత్మక ఖండిక. బందరు వీధిలో కవితా సామాగ్రి అమ్మడానికి వచ్చిన బేహారికి పనికిమాలిన కొనుగోలుదారులు తారసిల్లారు. తాను పొరపాటుపడి ఈ బజారుకు వచ్చానని, సుకవి భోగ్యాలైన వస్తువులు మీకు తగవని వారిని దూషించి బేహారి మరో వీధికి వెళ్లటం కథ. కవితలో నూతనత్వాన్ని కాదని ప్రాచీనత కోసమే ప్రాకులాడే వార్పై ఇది విమర్శ.

**''చూతురా? దీనిని జూతపల్లవ ఖాది**
**ని పికాంగనా గాన నిస్వనంబు**
**కొందురా? దీనిని గ్రొమ్మెఱుంగుల జిల్గు**
**పనికిఁగాఁదగిన కుందనపుఁదళ్కు**
**కావలెనా? యిద్ది, కలువ పూరేకు పా**
**త్తముల జిప్పిలెడు మెత్తందనమ్ము**
**వలయునా? మలయ పర్వత సానువుల నుండి**
**దిగుమతియగు కమ్మ తెమ్మెర లివి**
**తీయుదుర? దీని వెన్నెల తేట నిగ్గు**
**ఒఱయుదుర? దీనిఁబచ్చకప్పురపుఁదావి**
**కోరికొందుర? దీనిఁబటీర జలము**
**త్రావిచూతుర? తీయని పూవుఁదేనె.''**

వంటి ఈ ఖండికలోని పద్యాలు ఒకనాడు యువకవుల నోట మార్మోగిన పద్యాలు.

ఎత్తిన తల వంచకుండా ఆకాశం వైపు దృష్టి నిలిపి ఆనంద రసాయత్త చిత్తంతో ప్రకృతి సౌందర్యారాధన గావిస్తున్న బాలుణ్ణి కవివై యశస్సు గడించమని ఆశీర్వదిస్తూ చెప్పిన మనోహర ఖండిక 'కవిశిశువు'. జక్కవ పక్షి ఈకల సౌందర్యానికి ఆకర్షితుడై ఊరి వెలుపలికి వచ్చిన, చుక్కలతో ఎకసెక్కాలాడుతూ ఆరుబయట నిలిచిన, ఆకాశంలో చందమామ అందచందాలను గాంచి పట్టనెంచిన బాలునిలో భవిష్యత్కవీంద్రుని దర్శించారీ జంట కవీంద్రులు.

''ఓడింతున్ నిను. నన్ను దాటగలవేమో? చూతు రమ్మన్న నీ
నీడన్ దాటెడు నాస వెంటబడి యెంతే యత్నమున్ సల్పియున్
గూడంజాలక యీసునన్ గనలు నిన్నున్ నవ్వుచున్. జెట్ల క్రీ
నీడన్ మాయము గాగ దాని నిట నన్వేషించుచున్ నిల్చితో?''

అనే పద్యములో పింగళి కాటూరి కవుల ఊహారామణీయకం స్తుతియోగ్యం. నన్ను జయింపగలవా? అని బాలుని నీడ బాలుణ్ణి సవాలు చేసిందట! బాలుడు ప్రయత్నించి, ప్రయత్నించి ఓటమిపాలై అసూయతో బాధపడుతున్నాడట! ఆ సమయంలో బాలుడి నీడ చెట్ల నీడలలో కలిసిపోయిందట! ప్రకృతి పరిశీలన చేస్తున్న బాలుణ్ణి నీ నీడను వెదుకుతున్నావా? అని ఈ కవిద్వయం కుశల ప్రశ్నలు వేసింది.

తనపై బాణం గురిపెట్టి సంహరించడానికి సిద్ధపడిన కిరాతుణ్ణి గమనించకుండా ''వెన్న కన్నను మృదువగు క్రొన్ననలను మెక్కి క్రొమ్మావి గున్నపై నెక్కి పంచమ స్వరంబున నవ్యక్త మధుర గానం'' చేస్తున్న కోకిల దుస్థితికి వగచి చెప్పిన ఖండిక 'కోకిల'. ఆ కోకిలను మట్టుపెట్టదలచిన కిరాతుణ్ణి పరుషవాక్యాలతో ఈ రచయితలు దూషించారు. అంతటితో సంతృప్తి చెందక అంత భుజబలం గలవాడి వైతే, నిరపరాధియైన కోకిలను విడచి

''కత్తి చేబూని యుద్ధ రంగమున కుతికి
స్వామి భక్తి పరాయణత్వమునఁ గంఠ
రక్త ధారల బశ్చిమ రాష్ట్రములను
దడుపుచున్నట్టి వీరహైందవుల జేరి
నీదు శక్తిఁ బ్రదర్శింపరాదె?....''

అని హితవు చెప్పారు. అప్పుడు పద్యకుసుమాలతో పూజ చేస్తామని కిరాతునితో పలికి తమ దేశభక్తిని ప్రదర్శించుకున్నారు.

పల్లెటూళ్లలోని ఒకనాటి సంక్రాంతి సౌందర్యాన్ని నోరార నుతించిన పల్లీ జీవన వర్ణన ఖండిక 'సంక్రాంతి'. ''సంక్రాంతి'' అను శీర్షికతో పింగళి కాటూరివారు చేసిన పల్లీయ ప్రకృతి చిత్రణము స్వభావరమ్యమైనది'' అని సి.నా.రె. ప్రశంస.

...... పచ్చపూల
జనుప చేలకు ముత్యాల సరులు గూర్చి
మిరపపండ్లకుఁ గుంకుమ మెరుపు దార్చి

**బంతిపూవుల మొగము లల్లంత విచ్చి**
**మన గృహమ్ముల ధాన్యసంపదల నిల్పి**
**సరసమధురమ్ము పుష్యమాసమ్ము వచ్చు''**

పుష్యమాసములోని ప్రకృతి వర్ణనతో పాటు సంక్రాంతి సమయంలో పల్లెపట్టులలో కన్పించే ఎన్నో దృశ్యాలను వీరు రమణీయంగా వర్ణించారు. రైతుల చెంతకు భిక్షాటనకు వచ్చే సాతాని జియ్యరు, గంగెద్దుదాసుడు, ఇంటి బ్రాహ్మణుడు, అత్తగారింటికి వస్తున్న క్రొత్త పెండ్లి కొడుకు, సెలవులకు సొంత యింటికి వస్తున్న విద్యార్థి – వీరందరూ ఈ కవుల వర్ణనలలో పాఠకుల మనోనేత్రాలముందు సజీవ రూపాలుగా సాక్షాత్కరిస్తారు.

సెనగ పూరెక దొడిగిన చిన్నదానికి, పిట్టలదోలు చిన్నవాడికి జరిగిన సహజ సంభాషణ ఖండిక 'జొన్నచేను'. సంభాషణశైలిలో **సాగిన ఈ ఖండికలో** ఎన్నో శబ్ద చిత్రాలు. రంగులూ, చలనమూ కల రూపవర్ణన యిది.

**''కంకి వెడలిన యీ లేతకారు జొన్న**
**చేనిపై బిట్టలం దోలు చిన్నవాడ!**
**దారి బోయెడు వారల బార జూచి**
**విసురుమా! సుంత వడిసెల, వెనుక నదిగొ**
**కంకి తినుచున్నయది గొరువంక - ఇంత**
**యాలసించిన నిలుచునా? చాల దూర**
**మెగిరిపోయిన దప్పడే - దిగకు మంచె**
**బెడ్డలను నీకు నేదెచ్చి పెట్టుచుంటి''**

పల్లెటూళ్లలో చేను గట్టుల చెంత నిత్యమూ కన్పట్టు దృశ్యాలనే సహజ సుందరంగా వర్ణించిన ఖండిక యిది.

చక్రవాక పక్షుల వియోగం సాహిత్య ప్రసిద్ధమైన విషయమే. జంటను గానక ఒంటరిగా మిగిలిన చక్రవాకాన్ని సంబోధిస్తూ ప్రకటించిన రమణీయ భావ మాలిక 'ఎడబాటు' కవితా ఖండిక. పశు పక్ష్యాది శృంగార వర్ణన రసాభాసమని పలికిన పండితులు ఈ రసవత్ఖండికను పరిస్తే తమ అభిప్రాయాన్ని తప్పక మార్చుకుంటారు.

జంటపూవులలో నొక పూవును తెంపిన పుత్రుని మందలిస్తూన్న తల్లి భావాలను వివరించే ఖండిక 'అజ్ఞానకృతము .

శిశిరంలో శోభ కోల్పోయి వసంతంలో వికసిస్తున్న రసాలాన్ని సంబోధిస్తూ కవి చెప్పిన ఖండిక 'రసాలము' మానవ జీవితంలోని సుఖదుఃఖాలతో ఈ స్థితిని పోల్చడం ఇందులోని ప్రత్యేకత.

**''కలిమి దొలంగి యత్నములు గాలికి పోయి విచార మేఘముల్**
**దలముగ జుట్టుకొన్న బరితాపము చెందుటె కాని, యెన్నడున్**
**దలపగనైతి జీవమున దేజ మొకండు నశింపకున్న నీ**
**వలె మధుమాస సంజనిత భాగ్యము లందెద నన్న ధర్మమున్''**

ధనం లేక బాధ లనుభవించే సమయంలో విచారించినా గాని ధైర్య సంపద కొరవడకుండా వుంటే మళ్లీ సంపదలు లభించవచ్చనే మానవ భావన ఆ పద్యంలో గోచరిస్తుంది.

చెట్టులోని సొగసుదనం మనిషిలో ఉంటే మేలని సూచించే పద్యం ఇది.

**''తలిరాకు జొంపమ్ము తళుకు నిగ్గులు నాదు**
**నేత్రయుగ్మమ్మున నిండనిమ్ము**
**పూదేనియల చొక్కపుం దీపు రచులు వా**
**గ్విలసనంబునకు లభింపనిమ్ము**
**తళుకు బంగరు చాయ గల పండ్లమిసిమి శ**
**రీరమ్మునకు నావరింపనిమ్ము**
**పూవుగుత్తుల కమ్మతావులు నా యూర్పు**
**గాలితో నైక్యమ్ము గాంచనిమ్ము**
**ప్రకృతి సౌభాగ్య మంతయు రాశియైన**
**విధమునన్ దోచుచుంటివి. వెదకి. వెదకి**
**ఈ సరికి లభ్యమయ్యె నుపాసనాధి**
**దేవత యటంచు నిన్ను నర్థించుచుంటి''**

వసంత ఋతు శోభను నోరార నుతించిన ఖండిక తొలిపూత.

ఊహా ప్రేయసిని గూర్చి సరసంగా సంభావించిన భావకవితా గీతిక 'ఎవరు నీవు?'

ఘోర కాంతారంలో స్వేచ్ఛావిహారం చేసే సింహం బోనులో పడగా చూసి జాలిపడి సింహం దుస్థితిని భావస్ఫోరకంగా వర్ణించిన ఖండిక 'బోనులోని సింగము'

''ఆరిపోయెను నీలోని యగ్నికణము
కట్టువడిపోయె నీ మేఘ గర్జనములు
చల్లవడె నన్యదుస్సహ సాహసమ్ము
బండవారెను నీ గోళ్ల వాడిరేక''

వంటి పద్యపాదాలు దాస్య భారతంలో జీవిస్తున్న భారతీయులను హెచ్చరిస్తున్న పద్యపాదాలుగా భావించవచ్చు. వ్యంగ్యంగా దేశభక్తి ప్రబోధం గావించే ఖండిక ఇది.

ఈ జంటకవుల పద్యాలను తన 'వైతాళికులు' సంకలనంలో ప్రచురిస్తూ ముద్దుకృష్ణ ''తన నూతనాలంకారాల చేతను పాత పద్ధతుల వారు పరిహసిస్తున్నారని నవ్యసాహిత్యం నలుగురిలోకి రావడానికి జంకి బిడియపడుతున్న రోజులలో, ఆమె నూతనకైసేతను ప్రశంసిస్తూ ప్రచారం చేసిన కవులు వీరు. తెలుగునాటను కనులపండువుగా కనబడే సంక్రాంతి దృశ్యాలకు ఒక శాశ్వతత్వం కల్పించటంలో వీరు మాటల్ని రంగులు గాను, కలాల్ని కుంచెలుగాను వాడిన విచిత్ర చిత్రకారులు. కృషీవలుడికి తొలకరి చినుకుల విలువ వలె వీరి తొలకరి గూడ భావికృషికి ప్రయోజనకారి అయినది'' అని ప్రస్తుతించారు.

బంధుభావ మిత్ర భావములను మేళగించి సృష్టి చేసిన వీరి కావ్య శిల్ప మూర్తిలో పింగళివారి సాహిత్య శిల్ప దర్శనమూ, కాటూరివారి హృదయవాద నైశిత్యమూ కలగలిపి పాతదనంలో కొత్తదనాలు గోచరిస్తాయి. అంతేకాదు. వీరి జంట కవిత్వంలో పికాంగనా కషాయ కంఠంలోని కాకలీధ్వనీ, క్రొమ్మెఱుంగులోని తళుకు బెళుకులూ, కలువ పూరేకు మొత్తమ్ముల మెత్తదనమూ, మలయమారుతపు కమ్మదనమూ, వెన్నెలతేటలోని నిగ్గూ, పచ్చ కర్పూరపు గుబాళింపూ, స్ఫటిక జలంలోని స్వచ్ఛతా, మకరందంలోని మాధుర్యమూ సంతరించబడ్డాయి. అందుకే–

''సుకవి భోగ్యము లిచటి వస్తువులు వీని
నలిపివేయకుఁడటు నిటుఁగలచివైచి''

అని అరసికులను హెచ్చరించారు వీరు. సుకవి భోగ్యాలైన వివిధ కవితా వస్తువులను గ్రహించి, రసవత్తరమైన ఖండకావ్య సంపుటి తొలకరిని రచించి పింగళి కాటూరి కవులు ఆంధ్ర పాఠకుల నలరించారు. ఆంధ్ర సరస్వతి నలంకరించారు.

## 6. ప్రేమోపనిషత్తు-సౌందరనందం

పింగళి కాటూరి కవులు ఉమ్మడిగా సాగించిన కవితావ్యవసాయంలో తొలి పంట తొలకరి. మలి పంట సౌందరనందం. ఉమ్మడి కృషిలో ఈ జంటకవులకు ఇమ్మడి ముమ్మడిగా కీర్తిపంట నందించిన కావ్యం సౌందరనందం. సౌందరనందం వంటి కావ్యం వేయి సంవత్సరాల వెనుక పుట్టలేదు. వేయి సంవత్సరాల ముందు పుట్టబోదని ఉన్నవ లక్ష్మీనారాయణ గారి తీర్మానం. సౌందరనందం ప్రేమోపనిషత్తని వారి ప్రశంస.

ఆధునికాంధ్ర సాహిత్యంలో అత్యధిక కీర్తి నార్జించిన మహాకావ్యం సౌందరనందం. ఉదాత్త కథా వస్తువుతో, ఉన్నత కవితా సంపదతో విలసిల్లిన ఉత్తమ కావ్యం సౌందరనందం. భావకవిత్వ సౌకుమార్య లక్షణంతో, ప్రబంధ కవిత్వ ప్రౌఢ లక్షణంతో పరిఢవిల్లిన సుందర కావ్యం సౌందరనందం. ప్రణయ తత్త్వాన్నీ, ప్రణవతత్త్వాన్నీ తనలో నిముడ్చుకొన్న మధురోదాత్త కావ్యం సౌందరనందం. ఎన్నిమార్లు చదివినా మళ్లీ మళ్లీ చదవాలనిపించే మధుర కావ్యం సౌందరనందం. ఏ భాషలోకి అనువదించినా చెక్కుచెదరని భావనాబలం, చెన్ను దరగని కథాబలం గల మనోహరకావ్యం సౌందరనందం. కావ్యసరస్వతి కంఠహారమైన ఈ మహాకావ్యాన్ని పింగళి కాటూరి కవులు గురు భక్తితో చెళ్లపిళ్లవారికి షష్టిపూర్తి కానుకగా సమర్పించారు.

సౌందరనందం అశ్వఘోష మహాకవి రచించిన సంస్కృత బౌద్ధ కావ్యం. ఆంధ్ర సౌందరనందం అశ్వఘోషుని సంస్కృత కావ్యానికి అనువాదం కాదు. కొంత కథ, కొన్ని శ్లోకాలు మాత్రమే ఆంధ్ర గ్రంథానికి ఆధారం. తక్కిన కావ్యమంతా జంట కవుల కల్పనాఫలమే. సౌందరనందం సుందరీనందుల ప్రణయగాథ. ఈ కథ అవదాన వాఙ్మయంలో కూడా వున్నది. అవదాన వాఙ్మయం లోని సుందరీ నందుల కథకు, అశ్వఘోషుని సౌందరనందంలోని సుందరీనందుల కథకు,

పింగళి కాటూరి కవుల సౌందరనందంలోని సుందరీనందుల కథకు ఎంతో భేదం వుంది. పింగళి కాటూరి కవులు పూర్వగ్రంథాలలోని కథను తాము ఉచితమని భావించిన రీతిలో మార్పులు చేర్పులు చేసి ముగ్ధమనోహర కావ్యంగా రూపొందించారు. కథా విషయంలో, కవితారచన విషయంలో స్వాతంత్ర్యాన్ని ప్రదర్శించిన ఈ జంటకవులు కావ్యనామాన్ని మాత్రం యథాతథంగా స్వీకరించారు. ''గ్రంథ నామ మింపుగా నుండుటచే నది గైకొంటిమి'' అని వారే చెప్పుకున్నారు. ఈ గ్రంథ నామ సాధుత్వవిషయంపై చర్చలు సాగాయి. సుందరీవశంగతుడైన నందుని చరిత్ర అనే అర్థంలో అశ్వఘోషుడు చేసిన ప్రౌఢ ప్రయోగం సౌందరనందం నామధేయం. ఈ జంటకవులు చేసిన మార్పులను గూర్చి, అందలి ఔచిత్యాలను గూర్చి గూడా విమర్శలు చెలరేగాయి.

సంస్కృత సౌందరనందం పద్దెనిమిది సర్గల కావ్యం. ఆంధ్ర సౌందరనందం తొమ్మిది సర్గల కావ్యం. ప్రతి సర్గకు కథోచిత నామకరణం చేయటం రెండు గ్రంథాలలోను గోచరిస్తున్నది. ఆంధ్ర సౌందరనందంలోని కథా సంగ్రహాన్ని గమనిద్దాం. మొదటి సర్గ పునరాగమనం. నిర్వాణ మార్గాన్ని దర్శించి బుద్ధుడైన సిద్ధార్థుడు కపిలవస్తు నగరానికి విచ్చేసి ప్రజలకు ధర్మబోధ చేయటం ఇందలి కథ. రెండవ సర్గ భిక్షాగమనం. సుందరీనందులు లలితోపభోగకలనా పారీణులై ఉండగా బుద్ధ భగవానుడు భిక్షార్థియై వచ్చాడు. ప్రణయ జలధి నోలలాడుచున్న సుందరీనందులు బుద్ధుని రాకను గమనించలేదు. బుద్ధుడు వచ్చి వెళ్లటను పర్యాయసేవకు వస్తున్న ఒక పరిచారిక చూచి నందునకు తెలియజేసింది. మకరికా పత్రం తడి ఆరక ముందే తిరిగి వస్తానని వాగ్దానం చేసి నందుడు అన్న నాహ్వానించడానికి వెళ్లాడు. మూడవ సర్గ పరివ్రాజనం. నందుడు బుద్ధుని కలిసి తన తప్పు మన్నించి భిక్షార్థమై రమ్మని ప్రార్థించాడు. బుద్ధు డంగీకరించలేదు. ఇంటికి తిరిగి వెళ్లనున్న నందుని బుద్ధుడు నిలునిలుమన్న చూపుతో వారించి, తన భిక్షాపాత్రను నందుని చేతిలో పెట్టి విహారం వైపు సాగాడు. తప్పని సరియై నందుడు బుద్ధు ణ్ణనుసరించి విహారం చేరాడు. అక్కడ బుద్ధుడు తమ్మునికి ధర్మబోధ చేశాడు. ఒక శిష్యుని పిలిచి నందునికి ధర్మదీక్ష నిమ్మని ఆజ్ఞాపించాడు. నందుడు ఎంత వేడుకున్నా పెడచెవిని బెట్టి బౌద్ధభిక్షులు నందునికి దీక్ష నిచ్చారు. నాల్గవ సర్గ నిరీక్షణం. బుద్ధుని తీసికొని వస్తానని వెళ్లిన నందుడు ఎంతకూ

తిరిగిరాలేదు. అతనికోసం నిరీక్షిస్తూ సుందరి పొందిన అనుతాప వర్ణన ఈ సర్గలో ప్రధానం. బలవంతంగా భిక్షువుగా మారిన నందుడు సుందరిని తలచుకొని పొందిన అనుతాపం అనుతాపం అనే అయిదవ సర్గలో వర్ణింపబడింది. నందుని దుఃఖాన్ని తెలుసుకొని బుద్ధు డాతని చెంతకు వచ్చి 'రెండవసారి ధర్మబోధ చేయటం ఆరవ సర్గ యైన ఉపదేశంలోని విషయం. బుద్ధుని ఉపదేశం విన్న నందుడు ప్రణయతత్వాన్ని గూర్చి చేసిన ఉపన్యాసం, నందుని వాదన విన్న బుద్ధుడు వ్యక్తి ప్రేమను విశ్వ ప్రేమగా మార్చుకొమ్మని బోధించడం, నందుని విన్నపం విని బుద్ధుడు స్త్రీలు కూడా ప్రవ్రజన స్వీకారానికి అర్హులని అంగీకరించటం సప్తమ సర్గ యైన ధర్మసంవాదంలోని సారాంశం. నందుడు ధర్మదీక్ష నందిన విషయం విన్న సుందరి తాను గూడ బౌద్ధ ధర్మం స్వీకరించాలని భావించటం, ఒక బౌద్ధ భిక్షువు వచ్చి బుద్ధుని అంగీకారాన్ని తెలిపి ఆమెకు బౌద్ధ దీక్ష నీయడం అనుజ్ఞ అనే అష్టమ సర్గ లోని అంశం. వెలివాడలోని ఒక గుడిసెలో మరణాసన్నయైన ఒక స్త్రీ మరణశయ్యా దగ్గర, అనుకోని రీతిలో సుందరీ నందులు కలుసుకుంటారు. బుద్ధు డక్కడకు వచ్చి దీనజన సేవకే వారి జీవితాల నంకితం గావించమని సుందరీనందులకు బోధించాడు. వారిరువురు దేశికస్వామికి మంగళవాక్యాలు పలుకుతారు. ఈ విషయమంతా సహధర్మచర్యం అనే నవమ సర్గలో నాణ్యమైన రీతిలో వర్ణింపబడింది.

సంస్కృత సౌందరనందం18 సర్గల కావ్యం కాగా తెలుగు సౌందరనందం లోని సర్గలు 9 మాత్రమే. కావ్యం సంగ్రహింపబడినట్లు స్పష్టం. అశ్వఘోషుని ప్రధానోద్దేశం బౌద్ధ ధర్మ ప్రచారం. ఆనందం అనుషంగికం. పింగళి కాటూరుల ప్రధానోద్దేశం ఆనంద దాయకత్వం. ఉపదేశం అనుషంగికం. అందువలన బుద్ధుని జన్మ వృత్తాంతం, మహాభినిష్క్రమణం మొదలైన విషయాలతో నిండిన మొదటి నాలుగు సర్గలలోని విషయాన్ని పింగళి కాటూరి కవులు ఒకటి, రెండు పద్యాలలో సంక్షిప్తీకరించారు. మూలంలో బుద్ధుడు నందుణ్ణి హిమాలయాలకు, స్వర్గానికి తీసికొని వెళ్లినట్లు వర్ణించబడింది. తెలుగులో ఆ భాగాన్ని వదలివేశారు. ఔచిత్య దృష్టితో జంటకవులు కొన్ని మార్పులు చేశారు. మూలంలో కపిలవస్తు నగరానికి విచ్చేసిన బుద్ధుని దర్శించిన వారిలో యశోధర లేదు. భర్తను దర్శించడానికి పుత్రునితో పాటు యశోధర వచ్చినట్లు పింగళి కాటూరి కవులు చేసిన మార్పు

సముచితం. నందుడు బుద్ధుని ఆహ్వానించడానికి వినీత వేషంలో వెళ్లినట్లు మూలంలో వర్ణింపబడింది. ఉన్నవా డున్నట్లే వెళ్లినట్లు తెలుగు సౌందరనందంలోని మార్పు. భిక్షనందకుండా వెళ్లిన బుద్ధుని తీసుకొని రావడానికి వెళ్లే నందుడు వేషం మార్చుకోవడానికి కాలయాపన చేస్తాడా? సుందరి నందుని శీలాన్ని శంకించినట్లు మూలంలో వున్నది. తెలుగులో సుందరి శంకించినట్లున్నా వెన్వెంటనే తన శంక నిజం కాదని, నందుడు నమ్మకద్రోహం చేసి మరొక స్త్రీ పట్ల వ్యామోహితుడు కాడని సుందరి చేతనే చెప్పించడం ఉచితంగా వుంది. జన బాధావిముక్తికై పాటుపడమని బుద్ధుడు బోధించిన తర్వాత నందుడు సుందరి చెంతకు వెళ్లినట్లు, బంధువులను దర్శించినట్లు మూలంలో ఉన్నది. సుందరీ నందులు వెలివాడలో కలుసుకున్నట్లు తెలుగు సౌందరనందంలో వర్ణింపబడింది. తెలుగు సౌందరనందంలోని రమణీయ ఘట్టాలలో ఇది ముఖ్య ఘట్టం.

నందునకు బుద్ధుడు దీక్ష నిప్పించిన ఘట్టము మూలంలో కొంతకు కొంత ఉచితంగా వుంది. దీక్ష స్వీకరించడానికి నందు డంగీకరించనప్పుడు బుద్ధుడు నందుని ప్రబోధించినట్లు, గతిలేక నందుడు ప్రవ్రజ్య కంగీకరించినట్లు మూలం. సుందరీనందావదానంలో నందుడు అంగీకరించకపోయినా బుద్ధుని వాక్యం వలన ప్రవ్రజన దీక్ష తనంతట తానే నందుని దేహా న్నలంకరించినట్లున్నది. తెలుగు సౌందరనందంలో బౌద్ధ భిక్షువులు నందు డెంత పెనుగులాడుతున్నా వినకుండా నందునకు బలవంతంగా దీక్ష ఇచ్చినట్లున్నది. ఈ బలవంతపు దీక్ష ఉచితంగా లేదని విమర్శ. ఈ విమర్శను ఊహించే కాబోలు పరివ్రాజనం సర్గ ప్రారంభంలో

**''హితము నహితమ్ము, నుచితా నుచితము లాది**
**యైన సీమలు దాటి ఫలానుమేయ**
**ములగు నార్యశుభారంభములకు స్వస్తి**
**యగుత, విశ్వమ్మునకు శ్రేయమగును గాక!''**

అని ఆర్య శుభారంభాలు ఉచితానుచితా లను హద్దుల నతిక్రమించి విశ్వశ్రేయోదాయకా లౌతాయని ఈ జంటకవులు పేర్కొన్నారు.

**''అంకమున బుట్టు రత్నము నవధరించి**
**మరియు బంగారములు వేఱుపఱచి, పుటము**
**వెట్టి, తన్మణి సానపైఁబెట్టి, యట్టు**
**లొరయుచుంటి వే భూష చేయుదువొ కాని!''**

అని 'నిరీక్షణం' ప్రారంభంలో గూడా సుందరీ నందులను వేరుచేయడాన్ని సూచించారు.

సౌందరనందం శృంగారానుప్రాణిత శాంతరసప్రధాన కావ్యం. ఈ గ్రంథంలో అంచులు ముంచు శృంగార మున్నది. అంతకు మించి శాంత మున్నది. గ్రంథ ప్రారంభోపసంహారాలు- శాంతభావపూరితాలు.

**''యన్మహోత్యాగ మహిమమ్ము నాలకించి**
**మూఁడు కాలముల్ రోమాంచమును వహించు**
**నేడు దీవులకున్ బ్రాఁకి యెవని ధర్మ**
**లతలు ననలెత్తె నా శాక్యపతి సుతుండు''**

అని త్యాగ మహిమతో గ్రంథం ప్రారంభమైంది. ఆర్తసంరక్షకుడు, సత్యవ్రతుడు, దీనజన బాంధవుడు, విశ్వకల్యాణకరగురుడు అయిన బుద్ధభగవానునికి సుందరీనందులు 'నమోస్త'నుటతో గ్రంథం సంపూర్ణమైంది. సౌందరనందంలో కొన్ని సర్గలకు ముందు ఆ సర్గలలోని సారాంశమా యన్నట్లు జంటకవులు కొన్ని పద్యాలు వ్రాశారు. ఆ పద్యాలు కొన్ని శృంగార భావమయాలు, కొన్ని వైరాగ్య భావ సమంచితాలు. ప్రాధాన్యతను దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే ధర్మప్రాధాన్యమే పాఠకులకు గోచరిస్తుంది. శృంగార ధర్మ భావాలకు జరిగిన సంఘర్షణలో ధర్మ విజయాన్నే ఈ కవీంద్రులు వర్ణించారు. కనుక సౌందరనందం శృంగారానుప్రాణిత శాంతరస ప్రధాన కావ్యమే.

సుందరీనందుల ప్రణయ మీ కావ్యంలో మనోహరంగా వర్ణింపబడింది. భిక్షాగమనం, నిరీక్షణం, అనుతాపం అనే మూడు సర్గలలో ఈ ప్రణయమూర్తుల ప్రేమ భావమే మధురమైన రీతిలో రచింపబడింది. కచకుచాది శరీర సౌందర్య వర్ణనలు గావింపలే దీ కవీంద్రులు. అయినా మానవలోక నాయక కుమార వతంసమైన నందసుందరుడు నందోద్యాన విహారిదైవత లతాంగియౌ. నా జను సార్థకాఖ్యయైన సుందరీకాంతల విలాస క్రీడల నీ కవీంద్రులు మనోహరమైన రీతిలో వర్ణింపగలిగారు.

**''మేలేర్చి నందుండు పూలు గోసి యొసంగ**
**సరము లందముగ సుందరి రచించు**
**మెలత వర్ణమ్ములు మేళవించి యిడంగ**
**హరువుమై నతఁడు చిత్తరువు వ్రాయుఁ**

**బతి సుకుమార భావము వచించిన నను**
**రూప పద్యమునఁగూర్చును లతాంగి**
**అతివ చక్కని రాగ మాలపించిన వీణ**
**పలికించు నతఁడు మై పులకరింప**
**నెఱ్ఱసెరల నందుని చూపు లింతి యాన**
**నేందునకుఁగెంపుల నివాళు లెత్త, నతివ**
**కజ్జలపుఁ జూడ్కి ప్రియుని వక్షః కవాటిఁ**
**గట్టుఁ దోరణములు నల్ల కల్వపూల''**

సుందరీ నందుల అనురాగాన్ని ఎన్నో పద్యాలలో, ఎంతో మనోహరంగా వర్ణించటం వలన శృంగారం అధికమై ధర్మప్రాధాన్యత తగ్గిందని కొందరి విమర్శ. అది వాస్తవం కాదు ఇంతటి అనురాగంలో ఓలలాడే ఈ దంపతులకు భవిష్యత్తులో కలుగబోయే అనురోధం పాఠకుల మనస్సులకు హత్తుకోవడానికే ఇంతటి ప్రణయ వర్ణన. అంతేకాదు, వ్యక్తిగత ప్రేమను విశ్వ ప్రేమగా మార్చడానికి తగినంత బలమైన ధర్మబోధ గూడా ఈ గ్రంథంలో ఉంది. పునరాగమనం, పరివ్రాజనం, ఉపదేశం, ధర్మసంవాదం, అనుజ్ఞ, సహధర్మచర్యం అనే సర్గలలో భవవారిరాశిలో మునిగి పోనున్నవారిని సముద్ధరించగల రీతిలో ధర్మబోధ ఉన్నది.

**''యతి విటుడు గాకపోవునే అస్మదీయ**
**కావ్య శృంగార వర్ణనాకర్ణనమున**
**విటుడు యతి గాకపోవునే వెసమదీయ**
**కావ్య వైరాగ్య వర్ణనా కర్ణనమున''**

అని సంకుసాల నృసింహకవి తన కవికర్ణరసాయన కావ్యాన్ని గూర్చి పలికాడు. సౌందరనంద కావ్యం లోని శృంగార వైరాగ్య వర్ణనలు కూడా అంతటి ప్రభావం గలవే.

కావ్య నిర్మాణంలోని ప్రధానాంశాలలో పాత్ర నిర్మాణం ప్రధానం. పాత్ర చిత్రణ కవి ప్రతిభకు నికషోపలం. పాత్ర నిర్మాణ కౌశలం కవికి కీర్తిదాయకం. వివిధ చిత్త వృత్తులుగల పాత్రలను సృష్టించడంలో పింగళి కాటూరి కవులు విశేష ప్రజ్ఞను ప్రదర్శించారు. సౌందరనందంలోని ప్రధాన పాత్రలు మూడు. గౌతముడు, నందుడు, సుందరి. నివాతదీపకళికవలె నిశ్చల కాంతిరాశియై వెలుగు గౌతమ

మునీంద్రుని పాత్ర చిత్రణంలోను, సుందరి భృకుటి చలనా న్ననుసరించి సంచరించే రాగమూర్తియై, బుద్ధబోధచే విరాగమూర్తియైన నందుని పాత్ర చిత్రణంలోను, ఛాయవలె నందభాస్కరుని వీడియుండలేనిదైనా తప్పనిసరియై మనసు మార్చుకొని బౌద్ధసన్యాసినియైన సుందరి పాత్ర చిత్రణలోనూ ఈ జంట కవులు మిక్కిలి శ్రద్ధ గైకొన్నారు. మూలానికి కొన్ని మార్పులు చేసి ఈ పాత్రలను సహజంగా, సజీవంగా రూపొందించారు. ఈ ప్రధాన పాత్రల విషయంలోనే కాదు. అప్రధాన పాత్రల విషయంలో గూడా వీరు ప్రత్యేక శ్రద్ధ కనబరిచారు. బుద్ధుని పునరాగమన సందర్భంలో కుమారుని దర్శించడానికి వచ్చిన శుద్ధోదన మహారాజును, భర్తను దర్శించడానికి వచ్చిన యశోధరను సహజసుందరంగా వర్ణించారీ కవీంద్రులు.

**''తడియాఱని కన్గవయున్**
**బొడియాఱిన నోరు నౌచు...''**

పుత్రుని చెంతకు వృద్ధ భూపతి తనయా! అంటూ తడబడుతూ వచ్చాడట. తడియాఱని కన్గవ అనటం వలన పుత్రునికై శాక్యభూపతి నిరంతరం శోకిస్తున్నాడని సూచన. ఇక యశోధరాదేవి వర్ణన కరుణరస పూరితం.

**''కజ్జల హీనమై కాంతిబాసిన కనుం**
**గొనలందు బాష్పాంబుకణము లురల**
**విగత సంస్కారమై వ్రేలు పెన్నెఱికురుల్**
**సెదరి వెన్నునఁజిక్కు జీరువడఁగ**
**పసివాళ్లు వాడిన పసిఁడి మైతీవ సం**
**భ్రమయానవశతఁగంపము వహింపఁ**
**బాలిన చెక్కిళ్ల పయిపయిన్ జాలువా**
**ఱిన కంటి నీరు చారికలు గట్ట**
**నంతిపురి వీడివచ్చి శూన్యావలోక**
**నములఁగాంతుని గనుచు, రూపము వహించు**
**శోకమన దౌల నిల్చె యశోధరయును**
**కొడుకు కూఁకటి నొక కేలఁబుడికి కొనుచు'**

ఆకారం ధరించిన శోకభావంలా నిల్చిన యశోధర రూపచిత్రణ సహృదయుల గుండెలు పిండివేసే శక్తిగల వర్ణన. శూన్యావలోకనాలతో భర్తను

యశోధర దర్శించటం, మమతా విరహితంగా గౌతము డుందరినీ సమదృష్టితో దర్శించటం ఆ యా పాత్రానుగుణ ధర్మాలు. పాత్ర చిత్రణంలో స్వరూప స్వభావ చిత్రణాలు రెండూ ముఖ్యాలే. పై ఉదాహరణ స్వరూప చిత్రణం. ప్రధాన పాత్రత్రయం స్వభావ చిత్రణానికి గ్రంథంలోని ఎన్నో పద్యాల నుదాహరించవలసి ఉంటుంది

అలంకారాలు కావ్యలక్ష్మి కలంకారాలు. సహృదయ హృదయానందా న్నాకాంక్షించిన కవులు కావ్యసుందరిని అలంకారాలతో తప్పక అలంకరిస్తారు పింగళి కాటూరి కవులు ఉపమారూపకాద్యలంకారాలతో సౌందరనందాన్ని సౌందర్యవంతం చేశారు. బోధలను వినడానికి బుద్ధుని చెంత జేరిన ప్రజలు తినుబండము చేతనున్న తల్లిని చేరిన పిల్లలవలె నున్నారట! బంగారు రథమెక్కి పట్టణంలో సంచరించే సిద్ధార్థుడు సరోజబాంధవునిలా శోభించాడట!

**''నలుదెసలఁబొంచిన వృకాళి వలన భీతి**
**మాన్పి గొల్లఁడు గొతియల మనుచు రీతి**
**జనన మరణ రుజా భీతి జనులకెల్లఁ**
**బాపి సుగతుం డశోకమౌ పదముఁజేర్చు''**

తోడేళ్ల బారి నుండి కాపరి గొఱ్ఱెలను రక్షిస్తున్నట్లు జననమరణముల బారి నుండి ప్రజలను బుద్ధదేవుడు రక్షిస్తున్నాడని భావం.

**''బుద్ధగతమైన పెనుభక్తి ముందులాగ**
**వెలదిపై రక్తిలాగె వెన్వెనుక కతని**
**నూర్మికల మధ్య హంసనా నొప్పె నపుడ**
**నిశ్చయమ్మునఁగదలక నిలువ కతడు''**

ముందుకు వెళ్లలేక, అక్కడే ఆగలేక నున్న నందుని అలల మధ్యనున్న హంసతో పోల్చారు.

**''ఊబిలోఁగాళ్లు దిగఁబడి యోరమెడను**
**మలఁచి బయలాలకించు గోమాతవోలె''**

విశ్వధాత్రి తల్లడిల్లుతున్నదని ఈ కవీంద్రులు ధరణి దేవతను ధేనువుతో పోల్చారు.

ఉత్తమాలైన ఉపమాలంకారాల తోపాటు, రంజింపజేసే రూపకాలంకారా లను గూడా ఈ జంటకవులు ప్రయోగించారు.

"వలపు తెప్ప నెక్కి భవ వారి రాశిలో
మునుఁగనున్న మిమ్ము మనుచు పొంటె
వేఱుసేసె గురుఁడు విశ్వదయాహార
తరళయుగముఁజేయఁదలఁచి తల్లి!"

భవమనే వారిరాశిలో వలపనే తెప్ప నెక్కి సుందరీనందులు సంచరిస్తున్నారని రూపకాలంకార ప్రయోగం గావించారు ఈ అలంకార ప్రయోగం వలన కావ్య సౌందర్యం ఇనుమడించింది.

ఈ అలంకార ప్రయోగ క్రమంలో క్రమాలంకారాదులను గూడా ఈ కవీంద్రులు సమయోచితంగా ఉపయోగించారు. తమ్ముడైన నందునికి ధర్మబోధ గావించే సందర్భంలో బుద్ధుడు పలికిన ఈ పద్యం క్రమాలంకారాని కుదాహరణ.

"తన తోడిదే లోకమని నమ్ముకొని వేఱె
గతిలేని యొక తల్లి సుతుఁడితండు
స్వయము కోరి వరించి కయికొన్న యొక నవ్య
లావణ్యలహరి వల్లభుఁడితండు
అభిషేక పరిపూతుఁడై మొన్ననే సింహ
పీఠ మెక్కిన రాచబిడ్డ యితఁడు
పట్టిన కత్తి దింపక సంగరాంగణ
విహరణం బొనరించు వీరుఁడితఁడు
మమతలం ద్రెంచి, కాముని మాయ గెలిచి,
రాజ్యలోభమ్ముఁద్రోసి, క్రూరత నణంచి
శాంతులై చేరి నిల్చి రంజలి ఘటించి
ధర్మదేవత పాదపద్మముల చెంత"

తల్లిమీది మమతను త్రెంచి, లావణ్యవతిపై కామాన్ని గెలిచి, సింహాసనంపై వాంఛను వదలి, క్రూరత్వాన్ని తొలగించుకొని సుతుడు, వల్లభుడు, రాజకుమారుడు, యుద్ధవీరుడు ధర్మదేవత పాదాల నాశ్రయించారని చెప్పిన పద్యంలో క్రమాలంకారమేకాక బుద్ధుని బోధనా ప్రభావం గూడా వ్యక్తమౌతున్నది.

అష్టాదశ వర్ణనలతో కావ్యం విలసిల్లాలని పూర్వుల నియమం. ప్రబంధ కవులు ఈ నియమాన్ని పట్టుబట్టి పాటించారు. ఆధునిక కావ్యాలలో మాత్రం సందర్భోచిత వర్ణనలకే ప్రాధాన్యం. సౌందరనందంలో ప్రబంధోచిత ప్రకృతి వర్ణనలకు

ప్రాధాన్యం లేదు. అయినా పాత్రల కనుగుణమైన రీతిలో గావించిన వర్ణనలు లేకపోలేదు.

**''అంతట భానుమంతుఁడపరాంబుధి గ్రుంకఁగ, నత్తలోదరీ**
**స్వాంతమునందుఁబోలె గలయన్ దెసలెల్లఁదమంబు ప్రాఁకె, నా**
**కాంతను బుజ్జగించు చెలికత్తెలు విత్తెడు నాస పోల్కి నొ**
**క్కింత వెలుంగు దోఁప నుదయించెను దారకలక్కడక్కడన్''**

చక్కని ఉపమాలంకారంలో, ప్రకృతిని పాత్రల భావాల కనుగుణంగా ప్రవర్తింపజేసిన వర్ణన యిది. పరిసరాలు రెండు రకాలు. సుందరాలు, అసుందరాలు. కవి సుందర దృశ్యాలలాగానే, సుందరంగాని దృశ్యాలను గూడా వర్ణిస్తాడు. అసుందరాలైన ఆ దృశ్యాలు గూడా కవి ప్రతిభవలన సుందరాలుగా రూపొందుతాయి. ఈ జంటకవులు గావించిన వెలివాడ వర్ణన సహజ సుందరమైన వర్ణన.

**''చితచితలాడు నీరమునఁ, జేఁపల కంపునఁ, బంది ముట్టియల్**
**కతికెడు చప్పరింపులను, గైకుయిలాడెడు కుక్క కూఁతలన్**
**బ్రతినినదించు దుర్ధరరవమ్ముల, నీఁదరమ్రోఁతలన్, దరి**
**ద్రత తల పేలు గ్రుక్కికొను తావులలో వెలివాడ చక్కటిన్''**

దరిద్రత తలపేలు గ్రుక్కుకుంటూ స్థిరనివాస మేర్పాటు చేసుకున్న ప్రదేశం వెలివాడ అని వర్ణించడం కవిద్వయ ప్రతిభకు చిహ్నం.

నందునికి బుద్ధుడు విశ్వదైన్యాన్ని వివరించే సమయంలో ఒక అద్భుతమైన చలచ్చిత్రరూపాన్ని వర్ణించారీ కవీంద్రులు.

**''ఆఁకలి సెకకుఁ గాయమున మాంసాదులు**
**హరియించిపోవ శల్యములు మిగిలి**
**పొలుసెత్తి, పాలి, కన్నుల గుంట లేర్పడి**
**బోరయెండఁగ, బొజ్జ బూరటిల్లఁ**
**బుడక కాళులతోడ నడయాడు చల్లనఁ**
**బెరటిలోనికి నేగి బిడ్డఁడచట**
**మంటి పెళ్లలు దినుచుండ గన్గొనియును**
**వలదని వారింప వాకు రాక**

**కుత్తుకన్ నల్లపూసయు ౘుండలోన**
**వడ్లగింజయుఁ గనుల బాష్పములు లేక**
**కడుపు చుమ్మలు చుట్టఁగా నడలుచున్న**
**తల్లులం గాంచవో నీవు తమ్ముఁ గుఱ్ఱ''**

రాతిగుండె కైనా గుండె లవిసిపోయే వర్ణన యిది. కన్నీరు కార్చడానికి వేయి కనులైనా చాలని వర్ణన యిది. ''మాట్లాడని కవిత చిత్రలేఖనం, మాటలు నేర్చిన చిత్రలేఖనం కవిత'' అన్న ఒక ఆంగ్ల సాహిత్యకారుని వాక్యాలకు ఉదాహరణ పై వర్ణన. మా మిత్రుడు డా. పులిచెర్ల సాంబశివరావు మా కాలేజీ వార్షిక పత్రికలో ఈ దృశ్యాన్ని చిత్రీకరించారు కూడా. భిక్షుకుడై వచ్చిన బుద్ధుని దర్శించడానికి వచ్చిన యశోధర రూపాన్ని గూడా అజంతా చిత్రంలా పింగళి కాటూరి శబ్ద చిత్రకారులు తీర్చిదిద్దారు.

పింగళి కాటూరి కవులు గాంధీయుగంలో జన్మించారు. ప్రాచీన యుగంలో బుద్ధుడూ, ఆధునిక యుగంలో గాంధీజీ విశ్వ ప్రేమను బోధించిన మహనీయులు. 'నా కీ లోకముతో పనేమి వినుమన్నా' అంటూ పాలమున్నీటిలో, ప్రవాళాలతో విలసిల్లే ద్వీపంలో, ఆకుల్ రాలని పూలు వాడని వసంతారామమధ్యంలో, పున్నమిచంద్రుడు వెలిగే హర్మ్యాగ్రంపై ప్రాణానికి ప్రాణమైన ప్రేయసితో ఆనందంగా జీవించాలని కోరుకుంటాడు నందసుందరుడు. వ్యక్తిగత ప్రేమ కోసం పరితపిస్తున్న నందుని హృదయాన్ని విశ్వప్రేమవైపు మరలించడానికి గౌతమ బుద్ధుడు విశ్వప్రయత్నం చేస్తాడు.

**''కొడుకులు లేని వారలకుఁగూరిమి బిడ్డవు, మాతృహీనులౌ**
**బుడుతల కెల్లఁ దల్లివయి పోషణ సేయుము 'నా' యనంగ లే**
**కడలెడు దీనులన్ మనుపు, మార్తుల కాదరువై భజింపు మీ**
**పుడమి దివమ్ము సల్పు, మిదె పో పరమార్థము బౌద్ధజాతికిన్''**

'జీవ కారుణ్యమే మాకు జీవగఱ్ఱ' అని బుద్ధుడు చేసిన బోధ సర్వోదయాన్ని కాంక్షించే బోధ. సర్వోదయాన్ని కాంక్షించే గాంధీవాణినే ఈ జంట కవులు గౌతమవాణిగా సౌందరనందంలో విన్పింపజేశారు.

సౌందరనందంలో సాభిప్రాయ విశేషణా లున్నాయి. చమత్కార పద్యా లున్నాయి. పద్య పునరావృత్తు లున్నాయి. తమ జంటను విడదీసినందుకు

సుందరికి బుద్ధదేవునిపై కోపం ఉన్నా మెత్తని కినుకతో గౌరవ మెసగెడి వాక్యాలతో దూషణ కాని దూషణ గావించింది. ఈ సమయంలో ఆమె చేసిన వ్యంగ్య సంబోధనలివి. సకలాగమార్థ నిపుణా! పరిపూర్ణ దయాపయోనిధీ! బోధ పుష్కలా!

**"శోక రూపిణియైన యశోధరాంబ**
**కీతతిన్ దోడికోడలి నైతి నిజము**
**శాక్యకులమును మెట్టిన సతుల కెల్ల**
**భర్తృవిరహమె నోముల ఫలమ? దేవ!"**

ఈ పద్యము సహృదయుల హృదయాలలో సహానుభూతిని కలిగిస్తుంది.

**"నీ నయనమ్ము లాన, గురునిన్ గని మ్రొక్కెడి యింతలో నినా**
**శ్వాన విశేషకమ్ము భవదానన లక్ష్మి భజింప వత్తుగా**
**దా నను నమ్ము మంచు శపథమ్ములు పల్కిన ధర్మవృత్తికిన్**
**హాని యొనర్పలేక సరియంటిని దత్పల మిట్టు లయ్యెబో"**

అనే పద్యము సుందరీ నందులిర్వుర విలాపంలో చెప్పబడింది. 'సరియంటిని' అని సుందరి విలపించగా, 'సరియంటివి' అని నందుడు విలపించాడు. ఇది తిక్కనాదు లవలంబించిన పద్ధతే అయినా చమత్కారదాయకమైనదే.

సౌందరనందంలో బుద్ధుని ధర్మబోధ ఘట్టాలు విశ్వప్రేమతో వీనుల విందు గావించే ఘట్టాలే. మూడు పర్యాయాలు బుద్ధుడు గావించిన ధర్మబోధలో మొదటి బోధ కపిలవస్తు పుర ప్రజలందరకు. రెండవ, మూడవ బోధలు వ్యక్తి ప్రేమలో కొట్టుమిట్టాడుతున్న నందుని విశ్వప్రేమ భవన సోపానము లెక్కించుటకు చేసిన ప్రయత్నాలు. ఈ ఉపదేశాలలో ఒక క్రమం ఉన్నదని, అశ్వఘోషుని గ్రంథంలోలాగా ఇది కవితా కళకు బరువైన సందేశం కాదని సుప్రసిద్ధ విమర్శకులు నాగళ్ల గురుప్రసాదరావుగారి భావం. కాని ఈ బుద్ధ బోధలలో హిందూ ధర్మ వాసన యున్నదని వారి విమర్శ. యమునకు బొమ్మ పెట్టుట, భవాసురు నౌదల మెట్టుట, మోక్షకాంత మెడను తాళిగట్టుట బౌద్ధధర్మానుకూల భావాలు కావు. బుద్ధుడు వర్ణాశ్రమ ధర్మాలను సమర్థించినట్లు కొన్ని పద్యాల వలన నర్థమౌతుంది. వర్ణధర్మా న్నంగీకరించటం బౌద్ధ ధర్మ వ్యతిరేకం.

బుద్ధుడు తన శిష్యులచే నందునికి బలవంతంగా బౌద్ధదీక్ష నిప్పించినట్లు సౌందరనంద కథ. మూలకథలో ఇలా లేదని తెలుసుకున్నాం. మూలంలో అనౌచిత్యం ఉన్నా, తమది స్వతంత్రానువాదంగాబట్టి, మార్చి ఔచిత్య శోభితంగా

తీర్చిదిద్దవలసిన పింగళి కాటూరి కవులు బలవంతపు బౌద్ధ దీక్షను రకరకాల ఉపమానాలతో వర్ణించడటం లోప మనక తప్పదు.

''సుడివెట్టి లోఁగొను నడిసంద్రపు దుపాను
గడువ నీదెడి యీఁతగాని వోలెఁ
గలయ నల్దెసఁబన్ను వలఁజిక్కి బయటికి
నుఱికి పొఱఁదలంచు నుడుత వోలె
అసమయాగతులైన యమకింకరుల బారిఁ
బడక దాఁగఁగఁ జూచు ప్రాణము వలె
భయద వృత్తాంత దుస్స్వప్నంబు నుండి మే
ల్కొనలేక కలఁగెడి మనసు వోలె
భిక్షుమండలిచేఁజిక్కి పెనఁగులాడి
వేఁడుకొని, బిట్టుగా విలపించి, కసరి,
విసివి, చేష్టలు దక్కి, సొమ్మసిలి వ్రాలి
సుందరీ ప్రాణధనము భిక్షులకు దక్కె''

శైలి చక్కగా ఉంది. ఉపమానాలు బాగున్నాయి. నందుని దుస్థితి వర్ణన సహజంగా ఉంది. వీటన్నిటితో గూడిన పద్యం పసందుగా ఉంది. అయితే ఔచిత్యం లోపించింది. ఈ విమర్శ వేరెవరో కాదు, పింగళి వారిని దైవతుల్యుడుగా భావించే వారి శిష్యులు డా. కె.వి.ఆర్. నరసింహంగారే చేశారు.

లోపములు లేని వారు లోకంలో లేరు. గుణాలు అధికంగా వున్న వ్యక్తిని సద్గుణు డంటాము. గుణాలు అధికంగా వున్న కావ్యాన్ని సత్కావ్యం అంటాము. సత్కావ్య రచయితలను సత్కవులు అంటాము. అలాకాక లోపాలనే ప్రధానంగా ఎంచి గుణాలను దర్శించకపోవడం, లోపాలు కాని వాటిని గూడా లోపాలుగా చెప్పడం సమంజసం కాదు. అట్టివారు సద్విమర్శకు లనిపించుకోరు. వ్యక్తిగత వైరాలు కవితాశక్తి నిర్ణయంలో చోటు చేసుకోగూడదు. పింగళి కాటూరి కవుల సౌందరనందంపై కఠిన విమర్శలు ఎన్నో వచ్చాయి. సౌందరనంద రజతోత్సవ సభలో అట్టి విమర్శలను పింగళి కాటూరి కవులు ప్రస్తావించారు. అవి ఈర్ష్యతో వ్రాసిన వ్రాతలని ఒకరు భావించగా, విమర్శలకు తట్టుకొని కావ్యం బ్రతికితే బ్రతుకుతుంది, నశిస్తే నశిస్తుందని మరొకరు సమాధానం చెప్పారు.

**''నా యెడ నించుక పొరపా**
**టేయున్నది యనుము, దాని కింతటి శిక్షన్**
**జేయుట, నాయమ?.........................''**

యని సుందరి బుద్ధుని చేష్టకు బాధపడ్డది. అల్పదోషాలను తీవ్రదృష్టితో విమర్శించి శిక్షించాలనుకున్నారు కొందరు విమర్శకులు. ఇది న్యాయమా?

బుద్ధకార్యం వలన సుందరీనందుల జీవితం లోకోపకారకమై రాణించింది. విమర్శ కార్యం వలన పింగళి కాటూరుల సౌందరనందం మరింత వ్యాప్తిగాంచి శోభించింది. ఆ తీవ్ర విమర్శ ఆంధ్ర సాహిత్య లోకాన్ని కొంత సంచలింపచేసిందిగాని సహృదయ హృదయంలో పింగళి కాటూరి కవుల స్థానాన్ని సంచలింప జేయలేక పోయింది. సౌందరనందంలోని 350 పై చిలుకు పద్యాలలోని విశేషాలను వివరించాలంటే కనీసం అన్ని పుటల వ్యాఖ్యాగ్రంధం వ్రాయాలి. సౌందరనందంలోని మంచి పద్యాల నుదాహరించాలంటే గ్రంధమంతా ఉదాహరించాలి.

''నా కంటె నా శిష్యులు రసవత్తరంగా కవిత చెప్పగలవారనడానికి సౌందర నందం ఒక గీటురాయి'' అని బుద్ధ చరిత్ర వ్రాసిన వారి గురుదేవులు చెళ్లపిళ్ల వారి ప్రశంస లందుకొన్న బౌద్ధ కావ్యం సౌందరనందం. బౌద్ధ కావ్యాలలోనే కాదు ఆంధ్ర సాహిత్య నందనోద్యానంలోనే సుందర సుగంధ ప్రసూనం సౌందరనందం. నవ్యాంధ్ర పంచకావ్యాలలో ప్రథమ తాంబూల మందుకున్న ప్రఖ్యాత గ్రంథం సౌందరనందం.

## 7. కర్తృత్వ సమస్య

పింగళి కాటూరి జంటకవులు జంటగా వ్రాసిన గ్రంథాలు రెండు. తొలకరి, సౌందరనందం. జంట కవులలో ఎవరు ఏ ఖండిక వ్రాశారు? ఎవరు ఏ పద్యం వ్రాశారు? అనే ప్రశ్న అనవసరం. ఇద్దరు కవులు తమ రచనల నొకటిగా ప్రచురించదలచుకున్నప్పుడు - వారిలో వారికి భేదం లేనప్పుడు పాఠకులకు ఆ ప్రసక్తి ఎందుకు? అయినా ఇది లోకం. ఎవరు ఏది వ్రాశారు? ఎవరి పాలు ఎంత? అనే విషయం తెలుసుకోవాలనే కుతూహలం ఉంటుంది. ముఖ్యంగా సమకాలిక జంటకవులను గురించి. ప్రాచీన జంటకవుల విషయంలో పాఠకులకు ఈ కుతూహలం ఉన్నా వారి కోరిక తీరే అవకాశం లేదు. సమకాలికుల విషయంలో మాత్రం ఎలా తెలుస్తుంది? వారు చెబితే తెలుస్తుంది. తిరుపతి వేంకటకవుల విషయంలో ఆ జంటలో నొకరైన చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు చెప్పగా తెలిసింది. ఆ యా కవీంద్రులతో సన్నిహిత సంబంధం ఉన్నవారు చెబితే తెలుస్తుంది. జంటకవులు జంటగా వ్రాసిన గ్రంథాలు కాక ప్రత్యేకంగా తమ పేర్లతో మరికొన్ని గ్రంథాలు వ్రాసి ఉంటే శైలీ భేదాన్ని బట్టి గ్రహించే అవకాశం ఉంటుంది. పింగళి కాటూరి కవులతో సన్నిహిత సంబంధంగల గూడూరి నమశ్శివాయ గారు తొలకరి ఖండికల విషయంలో కొంత చర్చ చేశారు. తొలకరిలో కొన్ని శీర్షికలు లక్ష్మీకాంతంగారివని, కొన్ని శీర్షికలు వేంకటేశ్వరరావుగారివని వారు తెలిపారు. కవితా సామాగ్రి, కవిశిశువు, రసాలము, ఎడబాటు ఖండికలు లక్ష్మీకాంతంగారివని, జొన్నచేను ఖండిక కాటూరి వారిదని కొన్ని ఆధారాల వలన వారు చెప్పిన విశేషాలు. కాని వారే ''కొన్ని యిద్దరూ కలిసి చెరి సగముగా వ్రాసినవి. చెరొక పాదముగా వ్రాసినవి కూడ కొన్ని పద్యాలున్నవి'' అని పింగళి వారి జీవిత చరిత్రలో చెప్పారు. ఎవరు ఏ ఖండిక వ్రాసినా వారిరువురి పేర్లున్నప్పుడు ఆ విధంగా చలామణి కావడమే న్యాయం.

అయినా, ఆ విధంగా చలామణి కావడమే న్యాయం అయినా, గూడూరి వారు చెరొక పాదంగా గూడా కొన్ని పద్యాలున్నవని చెప్పినా, సౌందరనంద కావ్య విషయంలో ఈ కర్తృత్వ సమస్య సాహిత్యలోకంలో చర్చనీయాంశమైంది. సౌందరనంద రచనలో లక్ష్మీకాంతం గారి పాలు అసలు లేదని, ఉన్నా చాల కొద్దిదనే భావం లోకంలో వ్యాప్తి గాంచింది. బందరు సభలో లక్ష్మీకాంతంగారు తమ ఉభయుల రచనా కర్తృత్వాన్ని విడదీయడానికి వీలులేదని, ఒకే పద్యంలో ఒక పదం ఒకరిదైతే మరొక పదం మరొకరిదిగా మేళనమైనవనీ స్పష్టంగా చెప్పారు. వీరు సౌందరనందం సృష్టించిన విధానాన్ని గూడూరి నమశ్శివాయ గారే వివరించారు. కథా విధానాన్ని ఇద్దరూ కూర్చుని చర్చించుకున్నారని, గ్రంథాన్ని చెరిసగం పంచి తీసుకొన్నారని, ఒకరు వ్రాసిన పద్యాలను రెండవ వారికి పంపేవారని, తరువాత మరొక రోజు ఉభయులు కూర్చొని సంప్రదించుకుంటూ మెరుగులు దిద్ది తుది రూపమిచ్చేవారని వారి వివరణ. కాటూరి వారి రచన కుందనపు ముద్ద అయితే దానిని నగగా రూపొందించటం నా బాధ్యత అని పింగళి వారు అన్న మాటలను గూడూరివారు ఉట్టంకించారు గూడా.

సౌందరనంద కర్తృత్వ విషయంలో తనపై వచ్చిన విమర్శకు పింగళివారు ఎంతో బాధపడ్డారు. సౌందరనందం అనంతర ముద్రణలలో కావ్యాంతంలో ప్రకటించడానికి లక్ష్మీకాంతంగారు రెండు పద్యాలను వ్రాశారు.

**బంధువు లేక మానసులు బాల్యసఖుల్ సహపాఠులున్ సమ**
**స్కంధులు పింగళాన్వయుఁడు కాంతుఁడు కాటురి వేంకటేశుఁడున్**
**సుందర నంద రాగరసశోభిత వృత్తము, రమ్యతత్త్వ మీ**
**సౌందర నంద సత్కృతిని సల్పిరి దేశికుఁడిచ్చ మెచ్చఁగన్''**

**భావమొక్కఁడు గాఁగ భావన యొక్కఁడై**
**రసభావ పరిణతి యెసఁగఁజేసి**
**సరసార్థమొకఁడుగా శబ్ద మింకొకఁడయి**
**శబ్దార్థ సామరస్యము ఘటించి**
**సూత్ర మొక్కఁడు గాఁగ చిత్రణ మొక్కఁడై**
**ప్రాణవత్పాత్రముల్ పాదుకొల్పి**
**తెరయెత్తు టొకఁడుగాఁదెరదించుటొక్కఁడై**
**రంగ నిర్వహణమ్ము రక్తి నిల్పి**

**సుందరీనంద జీవితానందమట్లు**
**పరమమగు కోటికెక్కిన బంధుభావ**
**మిత్రభావము లిమ్మేయి మేళగించి**
**సృష్టి జేసితి మీ కావ్య శిల్పమూర్తి''**

పింగళివారి ఈ పద్యాలవలన సౌందరనంద కావ్యరచనలో నీ యిర్వురు కవులకు గల అవినాభావ సంబంధం వ్యక్తమౌతున్నది. కావ్యాంతంలోని ఈ పద్యాలను బట్టే కాకుండా, కావ్యమధ్యంలోని సుందరీనందుల ప్రణయ ఘట్టంలోని 'మేలేర్చి నందుండు పూలుగోసి యొసంగ సరము లందముగ సుందరి రచించు' అనే పద్యాన్ని బట్టి గూడా విడదీయరాని సుందరీనందుల సంబంధం వంటిదే, పింగళి కాటూరి కవుల సంబంధం అని భావించవచ్చు.

ఇంతగా తమ రచనా సంబంధాన్ని గూర్చి తెలిపినా పింగళివారిపై వచ్చిన అపఖ్యాతి తొలగలేదు. భారతి నిర్వాహకులు శంభుప్రసాద్‌గారు ''మీరు స్వయంగా రచించిన కవిత్వమేదైనా ఉంటే పంపితే భారతిలో ప్రచురించగలను. కాబట్టి పంపగలరు'' అని వ్రాయడానికి కారణం ఆంధ్రపత్రిక ఆఫీసులో పింగళివారి కర్తృత్వాన్ని గూర్చి చర్చ ప్రారంభం కావడమే. అప్పుడు పింగళివారు గంగాలహరి అనువదించి పంపారు. తర్వాత మధురపండితరాజం వ్రాశారు. ఈ అపప్రథ లోకంలో వ్యాప్తికావడం వారిరువురూ తమ రచనలను విడివిడిగా ప్రచురించుకోవడానికి ఒక కారణం. సౌందరనందం విషయంలో తనకు వచ్చిన అపఖ్యాతికి పింగళివారు ఎంతో కలత చెందారు. సౌందరనందంలో చివరి పద్యాలే కాకుండా తన కవితా శక్తికి సాక్షులిద్దరని ఒక అద్భుతమైన పద్యం వ్రాశారు.

**''ప్రీణిత సద్రసజ్ఞుడగు పింగళి కాంతుని కావ్యశిల్పని**
**ర్మాణ ధురీణ బుద్ధి గరిమంబున కిర్వురె సాక్షు లిమ్మహిన్**
**వాణికి వాణియైన గురువర్యుడు చెళ్ళపిళ వేంకటేశుడున్**
**ప్రాణము ప్రాణమైన గుణరమ్యుడు కాటురి వేంకటేశుడున్''**

అసలు వారిరువురు ప్రత్యేకంగా సాక్ష్యం చెప్పవలసిన అవసరం లేదు. సహృదయంతో ఆలోచిస్తే, వారి వారి ప్రత్యేక కృతులను గమనిస్తే సహపాఠులు, సమస్కంధులునైన వారి రచనలను, వారు జంట రచయితలుగా ప్రకటించుకొన్న రచనలను వారి జంటకవితగానే భావించటం సమంజసం. ఆ జంట గ్రంథాల రచనా కీర్తి జంటకవు లిరువురికీ సమానంగా చెందటం సమంజసం.

# 8. పింగళి వారి ప్రత్యేక కృతులు

పింగళి కాటూరి కవులు జంటకవులుగా వ్రాసిన గ్రంథాలు రెండే! 1. తొలకరి 2. సౌందరనందం. ఈ జంట కావ్యాలను రచించడానికి ముందూ, వెనుక గూడా వీరిరువురూ వేర్వేరు గ్రంథాలు వ్రాశారు. ఎవరి గ్రంథాలు వారి పేరనే ప్రకటించుకున్నారు. పింగళివారు ప్రత్యేకంగా వ్రాసిన గ్రంథాలను గూర్చి ఈ పరిచ్ఛేదంలో తెలుసుకుందాం.

పింగళివారు బందరు హిందూ హైస్కూలులో ఎనిమిదవ తరగతిలో విద్యార్థిగా చేరారు. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు ఆ పాఠశాలలో తెలుగు పండితులు. వారి ఉనికి వలన బందరు పట్టణం సుందర కవితా బృందావనమైంది. లక్ష్మీకాంతంగారు చెళ్లపిళ్ల వారి చెంతకు వెళ్లి తనను శిష్యునిగా స్వీకరించండని కోరినప్పుడు వారు ''నీ అభిలాష ఏమిటి'' అని అడిగారుట! కవిని కావాలని కుతూహలం అని వీరి సమాధానం. ఆ సమాధానం శాస్త్రిగారికి సంతోషకరమైనదట! ఎందుకంటే వారి చెంతకు శిష్యులుగా చేరేవారంతా పండితుణ్ణి కావాలని కోరుకున్న వారేనట. శాస్త్రిగారి శుశ్రూష వలన లక్ష్మీకాంతంగారు కవితాలక్ష్మీకాంతు లయ్యారు.

పింగళి లక్ష్మీకాంతం గారు బి.ఏ. చదువుతున్నప్పుడు దుక్కిపాటి వేంకటరత్నం గారు ఆర్థికంగా సహకరించారు. వారికి పింగళివారి చేత తమ వంశ చరిత్ర రసబంధురంగా వ్రాయించుకోవాలనే కోరిక కలిగింది. తమ వంశ చరిత్రకు సంబంధించిన వివరాలన్నీ ఇచ్చి గ్రంథం వ్రాయమని కోరారు. నాలుగు వందల యాభై పద్యాలతో వంశచరిత్రకు కావ్యరూపాన్ని కల్పించారు. గ్రంథాన్ని పరిశీలించిన కృతి ప్రోత్సాహకులు గ్రంథంలోని ఒక ఘట్టాన్ని మార్చమని కోరారు. చారిత్రక సత్యాన్ని మార్చటం చరిత్ర గ్రంథ రచనకే కళంకం అని భావించిన పింగళివా రందు కంగీకరించలేదు. పూర్తి అయిన ఆ గ్రంథాన్ని చింపి పారవేశారట! శ్రమ వ్యర్థం అయినా సహించారు గాని సత్యాన్ని మరుగు పరచడాన్ని వారు సహించలేకపోయారు.

1921లో పింగళివారి జ్యేష్ఠపుత్రుడు వేంకటరత్నానికి మశూచి వ్యాధి వచ్చింది. ప్రాణాలు దక్కవనే పరిస్థితి ఏర్పడింది. అప్పుడు దేవుడే దిక్కని పింగళివారు తిరుపతి వేంకటేశ్వరుని స్తుతింప నారంభించారు. అర్వై పద్యాలు పూర్తయ్యేసరికి వేంకటరత్నం వేంకటేశ్వరుని కరుణ వలన ఆరోగ్యవంతుడయ్యాడు. అంతటితో శతక రచన ఆగిపోయింది. ఆగిన శతకాన్ని పూర్తి చేయాలని గాని, వ్రాసినంత వరకు ప్రచురించాలని గాని పింగళివారు భావింపలేదు. చివరకు ఆ శతకం కాల గర్భంలో కలసిపోయింది. ఆ శతకంలో పింగళివారి స్వరూప స్వభావాలు చక్కగా ఆవిష్కరింపబడ్డాయని ఆ పద్యాలను పింగళివారు చదువుతుండగా విన్న నమశ్శివాయ గారి అభిప్రాయం.

పింగళివారు ప్రత్యేకంగా వ్రాసిన పద్యకావ్యం ''ఆత్మలహరి'' పింగళి వారి మరణానంతరం ప్రచురితమైన గ్రంథ మిది. పింగళివారికి ఆత్మీయులైన గూడూరి నమశ్శివాయగారు సేకరించి యిచ్చిన పద్యాలను పింగళి వారి కుమారులు ''ఆత్మలహరి''పేరుతో ప్రచురించారు. ఈ గ్రంథంలోని పన్నెండు ఖండికలలో ఆత్మలహరి, లక్ష్మీ నిర్గమనం పెద్ద ఖండికలు. ఈ రెండు ఖండికలు పింగళి వారు తనను గూర్చి, తన అర్ధాంగిని గూర్చి వ్రాసుకొన్న ఖండికలు. 'నేను' అనే నామాంతరం గల ఆత్మలహరిలోని పద్యాలు పింగళి వారి గుణగణాలను వివరించే పద్యాలు. లక్ష్మీనిర్గమనంలోని పద్యాలు వారి భార్య మరణించినప్పుడు ఆవేదనతో చెప్పిన పద్యాలు. తక్కిన పది ఖండికలు పలు విషయాలను గూర్చి చెప్పిన ఖండికలు.

ఆత్మలహరిలో కొన్ని దైవస్తుతి ఖండికలు. పింగళివారు ఆస్తికులు. ఏడుకొండలవాని భక్తులు. తిరుపతి విశ్వవిద్యాలయంలో వారు ఆచార్య పీఠా న్నంగీకరించడానికి స్వామివారి చేరువలో ఉండాలనే కోరిక ఒక కారణం. అందువల్లనే వారు పదవీ విరమణానంతరం గూడా శ్రీనివాస నివాసాన్నే తన నివాసస్థలంగా చేసుకున్నారు. 1934లో వారు తిరుపతి యాత్ర గావించిన సందర్భాన్ని పురస్కరించుకొని 'పర్వతారోహణము' పేరుతో ఆరు పద్యాలు వ్రాశారు.

**''అలజడుల వేళ 'కో'యని పిలిచినంత**
**'ఆ' యనుచు బల్కి వెంకన్న యాదుకొనును''**

అని వేంకటేశ్వరస్వామి ఆపద మ్రొక్కుల వాడని యభివర్ణించారు. అటువంటి స్వామి గనుకనే భక్తులు దిక్కులు ప్రతిధ్వనించేటట్లు భజనలు చేస్తూ ఏడుకొండల

పైకి గడియలలో నెగబ్రాకుచున్నారని భావించారు. ఈ ఖండికలో నొక చమత్కార పద్య మిది.

**''సచ్చిదానందు నిలయమ్ము సత్యలోక**
**మాఱులోకాలపై నున్న దనిరి బుధులు**
**వేంకటేశ్వరు భూతల విష్ణులోక**
**మాఱు కొండల పైని ప్రత్యక్షమగును''**

సత్యలోకం ఆరులోకాలపై నున్నదని బుధులు చెప్పగా, భూతల విష్ణులోకం ఆరు కొండలపైన ప్రత్యక్షమౌతున్నదని భావం. ఆరులోకాలపై నున్న సత్యలోకం ప్రత్యక్షం గాదు. భూతల విష్ణులోకం ప్రతివారికి ప్రత్యక్షమౌతున్నదని భక్తి భరితమైన చమత్కారము.

'దైవస్తుతి' ఖండిక గూడా వేంకటేశ్వర స్తుతిపరమైన ఖండికయే. ఈ ఖండికలోని పద్యా లైదూ పంచరత్నాలు. పింగళి వారి జీవిత చరమాంకంలో వ్రాసిన పద్యా లివి. అందువలననే తనను సంసార సముద్రం నుండి రక్షించమని ప్రార్థించారు.

**''గాటంబైన భుజాబల మ్ముడిగె, జంఘాశక్తి క్షీణించె, ము**
**న్నీటన్ మున్గుచు దేలుచున్ సొలసి శ్రాంతిం బొందితిన్ నీ తులా**
**కోటి ద్వంద్వ విభూషితమ్ములగు నంఘ్రుల్ తెప్పగా నిచ్చి నన్**
**దాటింపంగదవయ్య సంసృతి సముద్రంబున్ మహానావికా!''**

గజేంద్ర మోక్షంలోని గజేంద్రుని ప్రార్థనను జ్ఞప్తికి తెస్తున్న పద్యమిది. అయితే మకరి బాధ నుండి రక్షించమని కోరిన కరిరాజు ప్రార్థన కంటె సంసార సాగరాన్ని దాటించమని కోరిన పింగళివారి ప్రార్థన ఉదాత్తం. 'దైవస్తుతి' లోని తక్కిన నాలుగు పద్యాలు గూడా భక్తి భావ బంధురాలే. ఇహలోకంలో వలెనే, పరలోకంలో గూడా తనను రక్షించే భారం పరమేశ్వరునిదేనని, తిరుపతి వేంకటేశ్వరు డుండగా భయపడవలసిన యవసరమే లేదని, కోరిన కోరికలు తీరినంత మాత్రంచేత మనః ప్రశాంతి చేకూరదని వారు భావించారు. చివరి పద్యంలో తిరుపతి వేంకటేశ్వరుడు రామకృష్ణాది దేవతలలో నెవరో నిర్ణయించగల జ్ఞాని లేడని తేల్చి చెప్పారు.

**''ఈవే రాముడ, వీవె కృష్ణుడవు, నీవే వాసుదేవుండవున్**
**ఈవే శంభుడ, వీవె పార్వతివి, నీవే కార్తికేయుండవున్**

**నీ వెవ్వండవో నిర్ణయింపగల జ్ఞానిన్ జూడగా బోమయా**
**దేవా! తిర్పతి వేంకటేశ్వర! నమస్తే! సర్వదేవాత్మకా!''**

తిరుపతి వేంకటేశ్వరుని సర్వదేవాత్మకునిగా భావించి తీవ్రభావావేశంతో పద్యం చెప్పారు. ఆ భావ తీవ్రతలో కృష్ణుడవు, వాసుదేవుడవని నామ పునరావృత్తి చేస్తున్న విషయాన్ని గూడా మరచిపోయారు.

పింగళి వంశస్థులు సూర్యోపాసకులు. పింగళివారి వంశానికి మూల పురుషుడైన గొంకన సంతానం కోసం సూర్యోపాసన గావించారు. గొంకనామాత్యుని ధర్మపత్నికి సూర్యదేవుడు స్వప్నంలో సాక్షాత్కరించి దొండతీగె నొకదాని నిచ్చి పెంచమని, వంశం దొండతీగెలా వృద్ధి లోనికి వస్తుందని ఆశీర్వదించాడని పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలో చెప్పారు. తన వంశాభివృద్ధికి కారకుడైన సూర్యదేవుని 'సవిత' ఖండికలో ముచ్చటైన మూడు పద్యాలలో పింగళివారు నుతించారు. సూర్య కిరణాలు జీవశక్తికి నిలయాలని, ముకుళితమైన భువనాలను వికసింపజేయగలవని వినుతించారు. త్రిమూర్తుల కర్పించిన నమస్కృతులను తానే స్వీకరించి భక్తులకు వరాల నొసగే దాత ప్రభాత సూర్యనారాయణుడని ప్రస్తుతించారు.

**''ఆయువు తేజమన్ వరము లర్థుల కిచ్చెడి దాత, వాసుదే**
**వాయ శివాయ పంకజభవాయ యటన్న నమస్త్రయమ్ము తా**
**నే యయి స్వీకరించు భువనైక గురుండు, ప్రభాత సూర్యనా**
**రాయణు డే మొసంగెడి జలాంజలి ప్రీతి గ్రహించు గావుతన్''**

పింగళివారికి గూడూరి కుటుంబం వారికి మైత్రీబంధం అధికం. పింగళివారు విజయవాడ ఆకాశవాణిలో ఉద్యోగం చేసేటప్పుడు చాలా కాలం గూడూరి వారి ఇంట్లోనే ఉన్నారు. గూడూరి వియ్యన్నగారు గొప్ప ఆయుర్వేద వైద్యులు. వారు మృత్యుంజయ ఔషధాలయాన్ని ప్రారంభించినప్పుడు పింగళివారు వియ్యన్నగారిని, వారి ఔషధాలయాన్ని ఏడు పద్యాలతో ప్రశంసించారు. మృత్యుంజయ ఫార్మసీ మృత్యుంజయం కావాలనీ, వియ్యన్న సఖుడు అమృత హస్తుడు కావాలని వా రాశించారు. 'ఆది వైద్యుడు' అను ఈ ఖండిక శీర్షిక పాలసముద్రంలో ప్రభవించిన ఆది వైద్యుడు ధన్వంతరిని సూచిస్తుంది.

భారత గ్రంథాన్ని పలు పర్యాయాలు పఠించారు పింగళివారు. కవిత్రయం వా రందరిపైనా వీరికి గౌరవం ఉన్నా తిక్కనపై ప్రత్యేకాభిమానం. కావుననే 'తిక్కనా

మాత్య', అనే ఖండికలో నాలుగు పద్యాలతో తిక్కన మహాకవిని ప్రశంసించారు. శివకేశవాభేదాన్ని పాటించి హరిహరనాథు నర్చించిన తిక్కన కవీంద్రుని పింగళి కవీంద్రుడు శివకేశవులిద్దరితోనూ పోల్చారు. ''ఎవరయా సాటి తిక్క శౌరికిన్ యాదవుండగు శౌరి గాక'' అనీ

**''అన్యులకు జూడ దుస్సహమైన నెత్రు**
**టేర్లు ప్రవహించు సమరమహీస్థలమున**
**నిండుమనమున జొక్కుచు తాండవింప**
**రుద్రునికె చెల్లు నీకు చెల్లును కవీంద్ర''**

అని వర్ణించారు.

'స్వాతంత్ర్యం నా జన్మ హక్కు'అని గర్జించి భారత స్వాతంత్ర్య సాధన కోసం అహర్నిశలు శ్రమించిన దేశభక్తుడు బాలగంగాధర తిలక్. జాతిపిత గాంధీకి స్ఫూర్తిదాయకుడైన 'ముందుతరము' యోధుడు తిలక్. అట్టి తిలక్ మహాశయుడు మరణించినప్పుడు (1920 ఆగష్టు) పింగళివారు తిలక్ నిర్యాణము అనే పేరుతో ఒక ఖండిక వ్రాశారు. దివంగత నాయకునికి పద్యహారతి నిచ్చారు. 'శివశివా! యెట్టి దుర్వార్త చెవులసోకె'నని విచారిస్తూనే వారిని బహుభంగుల ప్రస్తుతించారు. మాతృదాస్య మోక్షణకై సుధకోసం అలనాడు స్వర్గానికి బయలుదేరిన పక్షిరాజుతో, దివికేగిన తిలక్ మహాశయుని పోల్చారు. ఒక పద్యంలో వారి రూపురేఖలను, గుణగణాలను సన్నుతించారు. పురాణ పురుషులైన త్రిమూర్తులు, చారిత్రక పురుషుడైన శివాజీ తిలక్‌కు ఆహ్వానం పలుకగలరని అభివర్ణించారు.

**''తన రాష్ట్రపున్ యశోఘనత నిల్పిన వీర**
**సింహ మంచును శివాజీ ప్రభుండు**
**తన వంశపుం బవిత్రతను గాపాడిన**
**కులదీపకుం డని నలినభవుడు**
**తన పేరు దాల్చి రుద్రతకు సత్యము నూత**
**గా జేసి తంచు గంగాధరుండు**
**తనదు గీతాంతర్గతంబైన పరమార్థ**
**మెతిగితి వంచు శ్రీకృష్ణయోగి**

**కూడికొని వచ్చి నీ కెదుర్కోలు నెఱపి**
**సేమవుం బ్రశ్నలడుగుచు జెవుల పండు**
**వౌ నటుల విం్రదు నీ యుపన్యాసములను**
**ఇచట నీ వెల్తి సవరింప నెవ్వ డోపు?''**

కాల వ్యత్యయం అనే వెలితిని సవరించి పురాణ పురుషులైన త్రిమూర్తుల తర్వాత శివాజీ విషయం వర్ణించినట్లైతే ఈ పద్యం ఇంకా మనోహరంగా ఉండేది.

వేదశాస్త్ర పారంగతుడై, శిష్యులకు జ్ఞాన సంపదను పంచిపెట్టి, సహస్ర మాసములు జీవించి లింగైక్యం చెందిన కాశీనాథుని బ్రహ్మయలింగం గారి వర్ధంతి సందర్భంలో చెప్పిన పద్యాష్టకం 'శివబ్రహ్మైక్యం'. వర్ధంతి సభలో పద్యాలెందరో చదివారు. అందరి పద్యాలలో పింగళివారి పద్యాలు ప్రశంసకు పాత్రమయ్యాయి: బ్రహ్మయలింగం రాక కోసం కైలాసంలో పార్వతీ పరమేశ్వరు లెదురు చూస్తున్నట్లు వర్ణించిన ఈ పద్యం కాశీనాథుని వారి కీర్తికే కాక పింగళి కవి నాథుని కీర్తికి గూడా నిదర్శనమైన పద్యం.

**'అదెవచ్చె' నని గౌరి పదనూపురధ్వనుల్**
**చెలగ నంకము డిగ్గి తొలగి నిలువ**
**'వచ్చెనా' యని తోలు పచ్చడమ్మును గేల**
**సవరించుకొనుచు నీశ్వరుడు లేవ**
**మందారమాలికా బృందమ్ములను దాల్చి**
**ప్రమథకన్యకలు సిద్ధముగ నుండ**
**చెంత కూరుకు జెందు చిన్నారి హరిణమ్ము**
**చెంగు చెంగున లేచి చిందులాడ**
**ఇభవదను డంత నిలిచి బృంహితము సల్ప**
**అంకెవైచి యాబోతు వార్వమ్ము నిలువ**
**తత్తరమ్మున బ్రమథులు దారి నొసగ**
**వడి విమానమ్ము మొగసాల కడకు వచ్చె''**

1950వ సంవత్సరం శివరాత్రి పర్వదినాన పింగళివారి గురుదేవులు చెళ్లపిళ్ల వారు శివైక్యం చెందారు. ఆ సందర్భంలో 'గురుకీర్తనం' పేరుతో వారు ముచ్చటైన మూడు పద్యాలు వ్రాశారు. పింగళివారికి గురువుగారిపై అమితమైన

భక్తి గౌరవాలు. తన గురువు తనను తీర్చిదిద్దిన విధానాన్ని వారు ఒకానొక అవధానంలో ఇలా వివరించారు

**"అంకిలి మాన్చి, భావగతమౌ పలుకున్ వెలయించి పల్కులో**
**వంకలు తీర్చిదిద్ది రసవంతముగా నొనరించె నెవ్వ డా**
**కింకవి రాజ మత్తగజకేసరి సద్గురుదాంచితుండు మా**
**వేంకట శాస్త్రి సద్గురు కవిప్రభువున్ మది నిల్పి కొల్చెదన్"**

ఇటువంటి గురుదేవు డస్తమించాడు. శిష్యసంతతులన్ విడచి ఆంధ్రకవితా జగద్గురు డమరపురికి తరలిపోయాడని ప్రథమ పద్యం. ప్రథమ భాగంలో పింగళివారు గురుమరణాన్ని గూర్చి తెలిపారు. తమ గురువు స్వర్గానికి వెళ్లటం వలన

**"సహజ గీర్వాణ వాణీ ప్రసక్తులైన**
**దేవతలు చెప్పగల రింక దెల్గు కవిత"**

అని శోకంలోనే చమత్కారాన్ని మిళితం చేసి పద్యాన్ని ముగించారు. ఆ తరువాతి పద్యంలోనే మరో చమత్కార వర్ణన గావించారు పింగళివారు.

**"మరల దిరుపతి వేంకటేశ్వరుల జంట**
**కలిసె ముప్పది యేండ్ల పై కాలమునకు**
**సాగగల దింక దిక్పాల సభల యందు**
**అద్భుతావహ శతవధానాంధ్ర కవిత"**

ముప్పై సంవత్సరాల క్రితం స్వర్గం చేరిన తిరుపతి శాస్త్రిని వేంకటశాస్త్రి యిప్పుడు కలుసుకున్నాడని, స్వర్గంలో శతావధానాలు ప్రారంభం కాగలవని కవి భావం.

1954వ సంవత్సరంలో అడవి బాపిరాజుగా రస్తమించి నప్పుడు 'విశ్వశిల్పి' అనే శీర్షికతో పింగళివారు ఏకైక పద్యంతో బాపిరాజు గారికి నివాళి నర్పించారు. వికార విద్వేషాల కాలవాలమ్మైన మర్త్యభూమి నసహ్యించుకొని విశ్వశిల్పి యమర్త్యభూమికి పయనమై వెళ్లాడని పింగళివారి యూహ. చక్కని యూహ.

పింగళివారు నిండు యౌవనంలో వ్రాసిన మధుర ఖండిక 'ప్రణయలేఖలు ఆంధ్రదేశ మంతా భావకవితా పవనాలు వ్యాపించిన సమయంలో పింగళివారు పాడిన ప్రణయ గీతాలు ఈ 'ప్రణయ లేఖలు'. విరహ వేదన ననుభవిస్తున్న నాయిక నాయకుని సంబోధిస్తూ వ్రాసిన ప్రణయ లేఖ లివి. ఈ ఖండికలోని

పద్యాలన్నీ హృద్యాలు. ప్రణయ ప్రవాహంలో యీదుతూ దరిగానక ప్రియుని గొంతెత్తి పిలుస్తున్న ప్రేయసి ఆర్తితో ఈ ఖండిక ప్రారంభం.

**"తలచిన భావ వీచికల తాకులచే దలమున్క లౌచు నెం**
**దుల గనుగొన్న దానయయితోచెడు నీ ప్రణయ ప్రవాహమం**
**దలయిక లేక యీది, దరియన్నది గానక, యార్తి చెంది నిన్**
**బిలిచెద చేతులెత్తి, వినిపించని యట్లు నటింతువా సఖా!"**

తన ప్రియుడు ఇలా ప్రవర్తించడానికి జాలి లేని క్రూరుడా? కాదు. తల్లి నెడబాసి బాధపడుతున్న లేడిపిల్లను లాలించి, లేత చిగుళ్లు తినిపించే రసికశేఖరు డతడు. తన పట్ల మాత్రమే యింతటి కాఠిన్యం. ప్రియుని గూర్చి కొన్ని పాటలు పాడుకోవచ్చునని ప్రేయసి వీణ చేతబట్టగా కంఠానికే కాక హస్తానికి కూడా గాద్గద్యం కలిగిందట! ఒకప్పుడు ప్రియుడు తన చెవిలో నూదిన ప్రణయ మంత్రం తన నెట్లా ఆడిస్తున్నదో చెప్పింది ప్రేయసి. ఆ పద్యం రూపకాలంకారంతో శోభలీనుతున్నది.

**"హృదయ మను పుట్టలోన నిద్రించుచున్న**
**వల పనెడి నాగకన్యను వెలికి దార్చి**
**ఇచ్చవచ్చిన యట్టు లాడించుచుండె**
**నాటి యుపదేశ మనియెడి నాగసరము"**

ప్రేయసీ హృదయగత ప్రణయ భావాలను వివరించే సందర్భంలో, భావం నాలుగు పద్య పాదాలను మించి పోయిన సందర్భాలు గూడా ఉన్నాయి. ఈ ఖండికలోని ఇరవయ్యొక్క పద్యాలు వేయిన్నొక్క రీతులలో సహృదయులకు సంబరం చేకూర్చగలిగేవే. ప్రియుని గళోదిత ప్రణయ గీతం తన కే రీతిలో విన్పించి యుద్బోధిస్తున్నదో ఆ ప్రేయసి మాటలలోనే విందాం.

**"గిరిముఖమ్ముల సాగి దొరలాడు సెలయేటి**
**తరగల మర్మర ధ్వనుల యందు**
**కొనగోట దమ్మిరేకుల నొత్తిగించి తే**
**నియ ద్రావు మధుప ఝుంకృతుల యందు**
**ఎలదీవకన్నె సిగ్గులు కొల్లగొను మంద**
**పవమాన బాలు నిశ్వాసమందు**

**తాపార్తయౌ వసుంధరను జల్లున సమా**
**శ్వాసించు జలదగర్జనము లందు**
**మసకవేళను గూండ్లకై మరలి బారు**
**లొలసి పఱతెంచు పులుగుల యులివు లందు**
**త్వద్గళోదిత ప్రణయ గీతమ్ము మధుర**
**కళలు వినవచ్చి యుద్బోధకమ్ము లగును''**

ఈ భావాలు భావకవితా యుగంలో వ్యాప్తి గాంచిన సుందర సుకుమార భావాలు. ''అనుభవాల పేటిక నుండి, ఎదలోపలి ఎద నుండి వెలికి వచ్చిన మధుర ప్రణయ భావా లివి'' అని ప్రణయ లేఖలు ఖండికను ఆచార్య మలయవాసినిగా రెంతగానో ప్రశంసించార్లు. అంతేకాదు. ఆత్మాశ్రయ కవితా భావనలతోపాటు మధురభక్తి భావనలకు ప్రణయలేఖలు నిలయాలని వారు సోదాహరణంగా నిరూపించారు. శారీరకమైన శృంగారం కాక పరమాత్మలో శాశ్వతంగా పొందే ఐక్యతను సూచించి ప్రణయలేఖలు ఖండికను పింగళివారు అద్భుతంగా ముగించారని 'ప్రణయ లేఖల భావ సరళి' అనే వ్యాసంలో వారు భావించారు.

సౌందరనంద కావ్యంలో బుద్ధదేవుడు సుందరీనందులను విడదీశాడు. పింగళి వారి జీవిత కావ్యంలో దేవుడు పింగళివారికి భార్యావియోగం కల్పించాడు. అరవై సంవత్సరాల పాటు తన కష్ట సుఖాలలో అర్ధభాగం భరించిన అర్ధాంగి వియోగాన్ని భరించడం పింగళివారికి భార మైంది. ఆ భారం తగ్గించుకోవడానికి వ్రాసిన స్మృతి కావ్యం 'లక్ష్మీ నిర్గమనము'. లక్ష్మీ నిర్గమనము మొదట ప్రత్యేక కావ్యంగా ప్రచురణ నందినా తిరిగి ఆత్మలహరిలో స్థానం సంపాదించుకున్నది. లక్ష్మీ నిర్గమనము అనే శీర్షికలోనే తన సతీమణి లక్ష్మీనరసమ్మ మరణం వలన తానెంత నిరుపేదగా మిగిలిపోయాడో చెప్పినట్లయింది.

**''నీ వలన సార్థకం బయి నెగడె లక్ష్మీ**
**కాంతుడను నామ మితనికి నింతదనుక**
**దేహమున బోలె నా నామధేయమునను**
**సగమె మిగిలెను నా లక్ష్మి యెగిరిపోయె''**

ఈ పద్యంలో తన దేహార్ధమే కాక తన పేరులోని లక్ష్మి గూడా తొలగిపోయినదని విచారించారు.

బాల్యం నుండి వృద్ధాప్యం వరకు తా మిద్దరూ అన్యోన్యంగా జీవించిన విధానాన్ని వివరించి, ఇంతవరకు తనకు తోడునీడగా మెలగి యిప్పు డిలా దోబూచి చేసి పోవటం న్యాయమా? అని తన్ను వీడి వెళ్లిన భార్యను ప్రశ్నించారు పింగళివారు.

**''బాల్యంబునన్ మేనబావగా మేలమ్ము**
**లాడుచు నీతోడ నాడుకొంటి**
**జవ్వనంబున గావ్య సరసాభిరుచులను**
**గరపి నీ నెయ్యంపు గురువు నైతి**
**గార్హస్థ్యమున నీవు కర్ణధారిణివిగా**
**సంసారనావలో సాగిపోతి**
**వార్ధకంబున నీదు వాంఛ దీరగ శ్రీని**
**వాసు సన్నిధి నున్కి చేసికొంటి**
**అకట! యరువది వత్సరా లహరహంబు**
**తోడునీడగ మెలిగి యీనాడు కన్ను**
**మూసి మరపించి దోబూచి చేసి పోతి**
**వెచట వెదకిన గానరా వింక నాకు''**

పింగళివారు ఉద్యోగ వ్యవహారాలు ఎంతో చక్కగా నిర్వహించేవారు. కాని గృహవ్యవహారాలు తెలియనే తెలియవు. గృహకార్యాలు మొత్తం లక్ష్మీనరసమ్మ గారే నిర్వహించేవారు. పింగళివారి సంసారనౌకకు కర్ణధారిణి వారి గృహలక్ష్మియే. ఆ విషయాన్నే వారు ఒక పద్యంలో ప్రస్తావించారు.

**''నేను నిమిత్తమాత్రముగ నీవు కుటుంబభరమ్ము సర్వమున్**
**బూనికతో వహించితివి, పొచ్చెములున్ వెడవేటుపాటులున్**
**న్యూనతలున్ బ్రలోభములునున్ బొడసూపక యుండు నట్లు దే**
**వీ! నయశాలినీ! గుణఖనీ! గృహిణీ జనతా శిరోమణీ!''**

చివరి పాదంలోని సంబోధనలను బట్టే పింగళివారికి తన దేవేరిపై గల ప్రేమాదరా లెంతటివో గ్రహింపవచ్చు. అంతటి అభిమానం ఉన్నది గాబట్టే

'గురునకు దేవునకుంగా కొరులకు గ్రంథప్రదానమొప్పని' పింగళివారు తన సాహిత్య శిల్ప సమీక్ష నీ 'యుత్తమ యిల్లాలి' కంకితమిచ్చారు.

యాభై పైచిలుకు పద్యాల ఈ స్మృతి కావ్యంలో లక్ష్మీ నరసమ్మ గారి సద్గుణాలు ప్రశంసింపబడ్డాయి. పర్వదినమైన శ్రీరామనవమినాడు పరమపదించడం వలన ఆమెకు స్వర్గనివాసం లభిస్తుందనే భావం వ్యక్తీకరింపబడింది. ఆమెలోని ఉత్తమ గుణాలను, తనలోని తక్కువదనాన్ని తలచుకొని బాధపడ్డారు. తన సతిని సీతాదేవితో పోల్చారుగాని తనను శ్రీరామునితో పోల్చుకోలేదు.

**''పాతివ్రత్య మహత్త్వము**
**సీతమకున్ నీకు సమము శ్రీరాముని లో**
**కాతీత ధర్మవర్తన**
**మీతనికే కాదు లేద యే దేవునకున్''**

మృత్యువు తన భార్య ప్రాణాలను బలవంతంగా లాక్కొని వెడుతుంటే

**''కన్ను లప్పగించి కాంచుచుండుటె గాని**
**అడ్డుపడగ లేని యనద నైతి''**

ననుచు దుఃఖించారు. నిజానికి ప్రాణి పుట్టగానే మృత్యువు పగబట్టిన త్రాచువలె వెంటనంటుతుందని, మృత్యువును తప్పించుకోవడం సకల లోకాలలో ఎవరికీ సాధ్యంకాదని తెలిపారు. మరి దుఃఖించడం ఎందుకు?

**''ప్రేమను గూర్చి తెల్పితిని, మృత్యువు శక్తి నెరుంగ బల్కితిన్**
**క్షేమపథమ్ము లిట్టివని చెప్పితి గ్రంథములందు దొల్లి, యా**
**యా మహితోపదేశముల యర్థము బుద్ధికి బట్టకున్న దో**
**స్వామి! పరోపదేశములు స్వానుభవమ్మున నర్థశూన్యముల్''**

అని తన కావ్యోపదేశాలన్నీ పరులకే పరిమితమై పోయాయని విచారించారు. భార్యా వియోగం వలన తా నెంతటి శక్తి హీనుడయ్యాడో ఈ క్రింది పద్యంలో వివరించారు.

**''ప్రేయసి నిర్గమించెను, శరీరము సత్త్వవిహీన మయ్యె, నా**
**ప్రాయము జారుచుండె, గనుపాపల తేజము మందగించె, సౌ**
**ఖ్యాయతి లేమి దోచె, బ్రతుకాశ యథాతథమై చెలంగె, నీ**
**కాయము మీద నింత మమకారము 'దేహి కిదేల కేశవా!''**

పింగళివారు రచించిన 'లక్ష్మీ నిర్గమనము' ఆంధ్ర సాహిత్యంలోని ఉత్తమ స్మృతి ఖండికలలో నొకటి.

'ఆత్మలహరి' ఈ ఖండికా సంపుటి నామధేయం. ఆత్మలహరి ద్వాదశ ఖండికా సముచ్చయం. ఈ ఖండికలలో ఒక ఖండిక పేరు గూడా ఆత్మలహరి. ఈ పేరునే గ్రంథానికి కూడా పెట్టారు. ఇది పలువురు రచయితలు పాటించే పద్ధతే. ఆత్మలహరి ఖండికకు నామాంతరము 'నేను'. నిజానికి ఈ పేర్లు పింగళివారు పెట్టినవి గూడా కాదు. వారు అప్పుడప్పుడు డైరీలో వ్రాసుకున్న పద్యాలు. వారు గతించిన తర్వాత ప్రచురింపబడ్డ పద్యాలు గదా ఇవి! ఇది పింగళివారి జీవిత చరిత్ర కాదు. గుణగణ చరిత్ర మాత్రమే. వారు చెప్పుకున్న పద్యాలను బట్టే వారి గుణాలను గ్రహించవచ్చు.

**''గర్వపు మాట లేల గురుకారుణికత్వ మొకండు గాక, మా**
**పూర్వులు సూరనాదుల తపోబల సంపద కల్మి, సాహితీ**
**ధూర్వహుఁడన్న పేరునకు తోడు మహాకవి యన్న కీర్తి యాం**
**ధ్రోర్వి లభించె నిక్క మిది, యోగ్యతలేని యశమ్ము మోసితిన్''**

ఆత్మలహరి లోని ఈ ప్రారంభ పద్యం వినయపూరితం. పూర్వుల తపోబలం వలన, గురువుగారి కరుణబలం వలన తనకు సాహితీధూర్వహుడని, మహాకవి యని కీర్తి లభించిందని, తనకు లభించింది యోగ్యతలేని యశస్సని ఎంతో వినయాన్ని ప్రదర్శించారు. ఏదో కొంచెం చదివి, ఏదో కొంచెం వ్రాశాననీ, తన పుణ్యం వలన ఆ కొంచెమే లోకంలో రాణించిందని చెప్పిన రెండవ పద్యంలో గూడా వినయ భావమే వెల్లివిరుస్తున్నది. ఆ తర్వాత చెప్పిన నలభైకి పైగా పద్యాలలో వారి వ్యక్తిత్వాన్ని వ్యక్తీకరించుకున్నారు. ఆ విశేషాలన్నీ సత్యసమ్మతాలే.

**''ధర్మములు రెండు నాకు నీ తనువు నందు**
**ఋతము పల్కుట కృతము స్మరించుకొనుట**
**సత్యదూరులతో చెల్మి సల్పలేను**
**మేలు మరచినవాని క్షమించలేను''**

మేలు మరచిన వానిని క్షమించలేక పోయినా, వారికి హాని చేయడానికి ఇష్టపడరు. తనపై నిందలు మోపినవారిని శపించడానికి నాలుక కదిపినా, మళ్లీ నిగ్రహంతో శాంతి మంత్రాన్నే పఠిస్తారు వీరు. నిజం పలకడం వలన ఒక్కొక్కసారి

మైత్రీహాని కలిగించుకుంటానని పలికారు. 'అన్యుల మనమున్ తా నొప్పించెడి సత్యము మానంగా వలయు నన్న మర్మమెరిగి' కూడా సత్యం పలుకకుండా ఉండలేరు వారు. తనకు పత్రికా ప్రచారం పట్ల ఆసక్తి లేదని, తన రచన నచ్చొత్తించి చూసుకోవాలనే ముచ్చట లేదని తెలిపారు. వారు తొందరపడి వాగ్దానాలు చేస్తారు. వాగ్దానం నెరవేర్చిందాకా విశ్రాంతి నెరుగకుండా శ్రమిస్తారు. ఒకరికి ఇవ్వడమే గాని పుచ్చుకోవాలనే పేదతలపు తనకు పుట్టదని, వ్యయం విషయంలో జాగ్రత్త లేదని తెలిపారు. నచ్చిన పనిని ఇష్టంతో చేస్తారు. నచ్చని పనిని చేపట్టనే చేపట్టరు. తన సంతోష విషాదాలను హృదయంలో ఏ మాత్రం దాచుకోలేరు. పాత్రతాపాత్రత నెరుగకుండా దగ్గర చేర్చుకొని వారు శత్రుత్వం వహించినప్పుడు బాధపడతారు.

**''అధికారము మన్నించెద**
**నధికారిని గుణము బట్టి యారాధింతున్**
**అధము డగునేని యాతని**
**పథమునకున్ దొలగి నిలుతు పామునకు బలెన్''**

సద్గుణులైన అధికారులను వారు మన్నించారు. అవసరం వస్తే అధికారినైనా ధిక్కరించారు. ఒక ఉదాహరణ. లక్ష్మీకాంతంగారు రేడియో స్టేషనులో సంస్కృత కార్యక్రమాలను నిర్వహించేవారు. కొత్తగా బదిలీయై వచ్చిన స్టేషన్ డైరెక్టరుకు పింగళివారిని పరిచయం చేస్తూ బదిలీపై వెళుతున్న స్టేషన్ డైరెక్టరు వీరు నిర్వహించే సంస్కృత కార్యక్రమాలను గూర్చి చెప్పారట! అప్పుడా డైరెక్టరు "I am enemy number one of Sanskrit" అన్నారట! సంస్కృత భాషకు జరిగిన అవమానాన్ని పింగళివారు సహించలేకపోయారు. అవతలి వ్యక్తి తన పై అధికారి అనే విషయాన్ని పట్టించుకోకుండా "Sanskrit loses nothing on that account" అని ఘాటుగా సమాధానము చెప్పారు.

పింగళివారు గంభీరుడని, దుర్లభుడని కొందరి భావం. లోకు లిలా తనను గూర్చి భావిస్తున్నారని పింగళివారికి తెలుసు. అందువలననే

**''దూరస్థులు నను గని, గం**
**భీరుడు దుర్లభు డటంచు బెగ్గిల, చెంతన్**
**జేరిన వా రనుకొందురు**
**కూరిమి చవి జూచి గంగిగోవు నటంచున్''**

అని వారు చెప్పుకున్నారు. ఇది వాస్తవమని నిరూపించడానికి మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి 'నా కవిమిత్రులు' అనే వ్యాసంలోని ఈ క్రింది వాక్యాలు సాక్ష్యాలు. ''ఆ కాలంలో ఆయన సర్వులకు అతి సులభుడు. ఆయనతో చెలిమిచేసినవారు ఏమండీ! అంటూ ప్రారంభించి చివరకు వారంలోనే ఏమిరా! అంటూ మార్పు చెందేవారు. లక్ష్మీకాంతంగారు అతి గంభీరులు. సింహం వంటివారు. ఆయన దగ్గరకు వెళ్లుటకు భీతి చెందెడివారు. ధైర్యంతో దగ్గరకు చేరినవారు మరల తిరిగి అవతలకు పోవటమనేది ఉండేది కాదు.'' పింగళి వారు పై అధికారియై వుండి కూడా తమ యింటికి రోజూ వచ్చి, ఎంతో స్నేహంగా, ఎన్నో విషయాలు మాట్లాడుతుండేవారని దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు తన జీవిత చరిత్రలో గూడా చెప్పారు.

''నా తనయులతో పాటు శిష్యతతి ప్రేమింతున్'' అని వారు తన శిష్యవాత్సల్యాన్ని గూర్చి ఆత్మలహరిలో చెప్పుకున్నారు. వారి శిష్యులకు వారంటే ఎంతో గౌరవం. కేవలం అధ్యాపకుడుగానే కాకుండా వారి జీవితాలకు మార్గదర్శకులుగా వ్యవహరించేవారు పింగళివారు. ఆర్థికంగా బాధ లనుభవిస్తూ, చదువు కొనసాగించలేని వారి పట్ల వారి కెంతో జాలి. పై చదువుల కోసం తాను పడ్డ శ్రమంతా గుర్తుకు తెచ్చుకొనేవారు. కమలాకర వేంకటరావు వారి శిష్యులలో నొకడు. పేదరికం వలన చదువు మానివేశారు. పింగళి వారికి ఆ విషయం తెలిసి పాండవోద్యోగాలు నాటకం ప్రదర్శించి వచ్చిన డబ్బంతా అతనికిచ్చి చదువుకు సాయపడ్డారు. ముట్నూరి కృష్ణారావుగారితో చెప్పి అతనికి ఉద్యోగం కూడా ఇప్పించారు. ఇలా పింగళివారి వలన సహాయం పొందిన శిష్యులెందరో!

**''ఇచ్చుటయె గాని యొరుచే**
**పుచ్చుకొనెడి పేదతలపు పుట్టదు నాకున్''**

అని వారి వాక్యం. విద్యార్థిగా నున్నప్పుడు, ఆర్థిక బాధ లధికమైనప్పుడు విద్యాభిలాషతో ఇతరుల సాయం వారు స్వీకరించకపోలేదు. అయితే తానొక స్థితికి చేరుకున్న తరువాత ఇవ్వడమే గాని, పుచ్చుకోవటం తగదని భావించారు. అది వారి సహజ స్వభావం. అందుకే

**''కామగవి చెంత కల్పవృక్షమ్ము నీడ**
**స్వేచ్ఛగా సంచరించు నోప్డేని యొక్క**
**పండు కోరను, పుడిసెడు పాలు వేడ**
**ఆకలియు దప్పియును గల్గి నప్పడైన''**

తన కాకలి, దప్పిక కలిగినపుడైనా, కల్పవృక్షము, కామధేనువు తన చెంత నున్నా తాను వేడుకోనని పద్య భావం.

తన ఒక్కడి· రచన కాకపోయినా, ఉమ్మడి రచనయైనా సౌందరనంద కావ్యంపై వీరి కెంతో ప్రీతి. తన భార్య లక్ష్మీనరసమ్మను గూర్చి వ్రాస్తూ

**''సౌందరనందము నాయిక**
**సుందరి నీ యొద్ద మాట సొంపులు నేర్చెన్''**

అని ప్రస్తుతించారు. తనను గూర్చి చెప్పుకుంటూ నాగరికత నెరుగని వాక్ప్రయోగం తనకు నచ్చదని పలుకుచు మళ్లీ సౌందరనంద ప్రసక్తి తెచ్చారు.

**''తూగును సౌందరనందం**
**బీ గరువపు బ్రతిన కెందు దృష్టాంతంబై''**

యని సౌందరనందంలోని వాగర్థ ప్రయోగ వైఖరిని ప్రశంసించారు. సౌందరనందానికి సోదరకృతి యొకటి రచించాలని తన కోరిక యని భావిస్తూ 'తరమా యీ వయసునందు తాదృశ రచనల్' అని తన అశక్తతను తలచి బాధపడ్డారు.

ఉత్తమ పురుషలో సాగిన ఈ ఉత్తమ పురుషుని 'ఆత్మలహరి' అనేకుల ప్రశంసలకు నోచుకున్నది.''పరిపూర్ణమైన వర్ణచిత్రానికీ, రేఖా చిత్రానికీ భేదం వున్నట్లే వీరి ఆత్మలహరి పరిపూర్ణమైన జీవిత చరిత్ర కాదు గాని, రేఖా చిత్రం వలె వీరి వ్యక్తిత్వాన్ని చక్కగా ప్రదర్శించే కావ్యం'' అని తన తెలుగు కవితా వికాసం గ్రంథంలో రామమోహనరాయ్‌గారు ప్రశంసించారు.

ఈ విధంగా 'ఆత్మలహరి'లో పింగళివారు తన స్వభావాన్ని గూర్చి, జీవిత గమనాన్ని గూర్చి వివరించారు. పద్యరూపంలో వారే తమ సంపూర్ణ జీవిత చరిత్ర వ్రాసి ఉంటే తదనంతర తరాలవారికి ఒక గొప్పకవి జీవిత చరిత్రగా కీర్తిగాంచి ఉండేది.

# మధుర పండిత రాజము

పండితరాయలు సంస్కృత భాషలో కీర్తి గాంచిన కవీంద్రుడు. ప్రసిద్ధి గాంచిన పండితశ్రేష్ఠుడు. కోనసీమలో జన్మించి భారతదేశపు కొట్టకొనసీమ దాకా తన కీర్తిలతలను ప్రాకించిన పండితకవి యతడు. పండిత రాయ లను బిరుదు గడించిన జగన్నాథుడు కవితా జగన్నాథుడు. రసగంగాధర రచన గావించిన పండితరాయలు పాండితీమండితుడు. లక్షణ గ్రంథ రచన చేయగలిగిన పండితుడు మాత్రమే కాదు. తన లక్షణములకు తానే లక్ష్యములు వ్రాయగలిగిన కవీంద్రుడు. పండితరాయల లహరీ పంచకం, భామినీ విలాసం కవితా విలాసినీ విహార నిలయాలు. మధుర మనోహరాలైన ఆ కావ్యగత భావాలకు మురిసిపోయి ఎందరో కవీంద్రు లా గ్రంథాల ననువదించారు. వారిలో పింగళి లక్ష్మీకాంతంగారు పేరెన్నిక గన్నవారు.

అనువాదం చేయటం అనుకున్నంత సులభం కాదు. ఒక భాషలోని భావాలను మరొక భాషలోకి మార్చటమే కదా అని అనుకోవటం అజ్ఞానం. స్వతంత్ర రచన కన్న అనువాద రచన కష్టకార్యం. స్వతంత్ర రచయితకు ఏకభాషా ప్రావీణ్యం చాలును. అనువాదకునకు ఉభయ భాషా ప్రావీణ్యం కావాలి.

**''పలుకుబడి వేఱు, పదపరిపాటి వేఱు**
**రీతులును వేఱు, యన్వయరీతి వేఱు**
**భాష భాషకు నను మాట భావమందుఁ**
**జేర్చి సంస్కృతమును దెన్గు సేయవలయు''**

నని జయంతి రామయ్య పంతులుగారి భావం. మూలం దాటకుండా, రసభావాలు వీడకుండా తేటగా అనువాదం చేస్తే తప్ప ''మాటకు మాటబెట్టి యొక మాడ్కిని మాటిన'' బుధులు మెచ్చరని వారు చెప్పిన న్యాయం. ఒక సంస్కృతానువాదంలోనే కాదు. ఏ భాషానువాదాని కైనా ఇదే పద్ధతి.

అనువాద విషయంలో పింగళివారి పద్ధతి ప్రశంసనీయం. వారు సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో చక్కని పాండిత్యం సంపాదించారు. వారు ఆంగ్ల గ్రంథాల నాంధ్రీకరించారు. సంస్కృత గ్రంథాలకు సరసానువాదం గావించారు. ఎడింబరో విశ్వవిద్యాలయం నుండి ఎం.ఏ. డిగ్రీ పొందిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు జిల్లా జడ్జీ కాంగ్లంలో వ్రాసి యిచ్చిన ప్రకటనను కృష్ణా

పత్రికలో ప్రచురణ కోసం పింగళి లక్ష్మీకాంతంగారు కొద్దిసేపటిలోనే అనువదించి ఇవ్వగలిగారు. అప్పటికి పింగళివారు కేవలం బి.ఏ. విద్యార్థి మాత్రమే. ముట్నూరి కృష్ణారావు వంటి ప్రసిద్ధ సంపాదకులు పింగళివారి అనువాదాన్ని మెచ్చుకున్నారు. లక్ష్మీకాంతంగారు తన కవితా ఖండికలను ఆంగ్లంలోని కనువదించి వినిపించి తోట్లవల్లూరు రాజా వారిచే ఘన సన్మానా న్నందుకున్నారు. పింగళివారు అవసరార్థం చేసిన అనువాదాలు కూడా ఉన్నాయి. మద్రాసులో ఉన్నప్పుడు ఆర్థిక సమస్యల నధిగమించటానికి వారు కొన్ని అనువాదాలు చేశారు. విక్టర్ హ్యూగో బగ్జార్గల్ నవల నాంధ్రీకరించారు. అది పాఠశాల విద్యార్థులకు ఉపవాచకంగా నిర్ణయించ బడింది. ఇండియన్ పబ్లిషింగ్ కంపెనీ వారికి బ్రిటీష్ చరిత్ర ననువదించి యిచ్చారు. కేంద్ర సాహిత్య అకాడమీ వారి కోరిక మేరకు పింగళి లక్ష్మీకాంతంగారు మహాత్మా గాంధీ ప్రవచనాలను ''మానవులందరు సోదరులు'' పేరుతో ఆంధ్రీకరించారు. గాంధీగారి ఆంగ్లశైలి నిరాడంబరం. అయినా బింకం గలది. పొంకం గలది. అనువాదంలో పింగళివారు ఆ గుణాలనన్నిటినీ వదలకుండా సొగసైన రీతిలో రచించారు. తెలుగుభాషలో వచ్చిన అనువాద సాహిత్యంలో అత్యుత్తమ శ్రేణికి చెందిన రచన ఇది అని గూడూరి నమశ్శివాయ గారి ప్రశంస.

పింగళివారు పండితరాయల సంస్కృత గ్రంథాలను అద్భుతంగా ఆంధ్రీకరించారు. పండితరాయల శ్లోకానువాదాలకు వీరు పెట్టిన పేరు 'మధుర పండితరాజము'. మధురపండితరాజంలో మూడు విభాగాలున్నాయి. 1.గంగాలహరి 2. తేజోలహరి 3. అన్యాపదేశలహరి. భారతి సంపాదకులు శంభుప్రసాద్ గారి ప్రోత్సాహం ఈ అనువాదాలకు కారణం.

**''పాలిత శబ్ద ధర్ముఁడగు పండితరాయల భక్తి భావనో**
**ద్వేల సురాపగాస్తుతికిఁ బింగళికాంతుని యాంధ్రమిద్ది గం**
**గాలహరీ భవ ప్రణవ నాద సుధారస పాన మాధురీ**
**లోలుపచిత్తులైన కవులున్ బుధులున్ సుఖియింత్రు గావుతన్''**

అని గంగాలహరి చివరి పద్యం. శబ్దధర్మం తెలిసిన పండితరాయల భక్తి పూరిత గ్రంథమైన గంగాస్తుతికి తన యనువాద మిది యని తెలుపుటయే గాక కవులకు, పండితులకు శుభాశంసన కూడా గావించారీ పద్యంలో.

"నేను ఎన్నడూ గంగాస్నానం చేయలేదు. కాశీకి వెళ్లలేదు. ఈ గంగా లహరిని అనువదించి ఆ లోపాన్ని పోగొట్టుకున్నాను. ఇప్పుడు గంగాస్నానం చేయలేదనే దిగులు పోయింది'' అని లక్ష్మీకాంతంగారు గంగాలహరి అనువాదా నంతరం భావించారు.

గంగాలహరి ననువదించిన వారిలో పింగళివారు మొటివారు కారు. చివరివారు కూడా కాబోరు. కాని తన యనువాద ప్రత్యేకతతో ప్రత్యేక స్థానం మాత్రం పొంది తీరుతారు. పింగళివారి గంగాలహరి ప్రతి శ్లోకానువాదమే గాని ప్రతిపదానువాదం కాదు. ఒక్కోసారి మూలశ్లోకాన్ని సంక్షిప్తీకరిస్తారు. మరొకసారి మూలశ్లోకాన్ని విపులీకరిస్తారు. వేరొకసారి యధామూలకానువాదం గావిస్తారు. మూలంలో అయిదు శ్లోకాలు తప్ప తక్కిన వన్నీ శిఖరిణీ వృత్తాలు. పింగళివారి ఆంధ్రీకరణంలో వృత్త నియమం లేదు. వివిధ ఛందాల నుపయోగిస్తూ అనువాదాన్ని అందంగా తీర్చిదిద్దుతారు పింగళివారు. తన అనువాదం మూల విధేయం కాదని, తనది స్వేచ్ఛానువాదమని వారే చెప్పుకున్నారు. ఇది పూర్వ కవుల పద్ధతియని తన పద్ధతిని సమర్థించుకున్నారు.

**''అపిఘ్నంతో విప్రా నవిరత ముశంతో గురుసతీః**
**పిబంతో మైరేయం పున రపి హరంతశ్చ కనకమ్,**
**విహాయ త్వ య్యంతే తను మతనుదానాధ్వరజుషా**
**ముప ర్యంబ! క్రీడం త్యఖిలసురసంభావిత పదాః''**

ఈ శ్లోకాన్ని పింగళివా రనువదించిన విధ మిది.

**''వేద షడంగ పారగుని విప్రునిఁద్రుంచియు, బుత్రనిర్విశే**
**షాధృతిఁజూపు దేశికు గృహమ్మున కెగ్గు దలంచియున్, దుదిన్**
**నీ దరి దేహమూడ్చి జననీ! చను నమ్మ నరుండు యజ్ఞసం**
**పాదిత పుణ్యులైన యజమానులు పోవు మహాపథమ్మునన్''**

ఈ అనువాదం స్వతంత్రానువాదం. శ్లోకంలో రెండవ పాదానికి అనువాదమే లేదు. విప్రహంతకుడు, గురుద్రోహి, సురాపానమత్తుడు, పసిడి దొంగ అనే నాలుగు రకాల పాపాత్ములలో రెండు వర్గాల వారిని మాత్రమే పేర్కొన్నారు. అయితే విప్రులని మాత్రమే మూలంలో ఉంటే వేద షడంగ పారగుడైన విప్రుడని, గురువునకు విశేషణంగా పుత్ర నిర్విశేషాధృతి జూపిన వాడని విశేషణాల నదనంగా

ఉపయోగించారు. సురసంభావిత పదాన్ని యజ్ఞ సంపాదిత పుణ్యులైన యజమానులు పోవు మహాపథమని విపులీకరించారు.

అంతేకాదు, మూలంలోని పద్యభావాన్ని కుదించి గీతాలలో, మూల భావాన్ని పెంచి సీసాలలో వ్రాసిన సందర్భాలు కూడా ఉన్నాయి. స్వేచ్ఛానువాదం గావించాలని కదా పింగళివారి ప్రయత్నం!

**''బధానద్రాగేవ ద్రఢిమ రమణీయం పరికరం**
**కిరీటే బాలేందుం నియమయ పునః పన్నగగణైః**
**నకుర్యా స్త్వం హేలా మితరజన సాధారణతయా**
**జగన్నాథ స్యాయం సురధుని! సముద్ధారసమయః!''**

ఈ శిఖరిణీ వృత్తాన్ని పింగళివారు తేటయైన తేటగీతిలో ననువదించారు గంగాలహరి ననువదించిన బూర్గుల రామకృష్ణారావు గారు, మోచెర్ల రామకృష్ణయ్య గారు ఇదే శ్లోకాన్ని మత్తేభంగా ఆంధ్రీకరించారు.

**''చంద్రమకుటము నురగభూషలును దాల్చి**
**యాలసింపక లేవఁగదమ్మ తల్లి?**
**అన్యులుం బోలె నీవును నపహసింపఁ**
**జనకు మమ్మరో యుద్ధార సమయ మిద్ది''**

మూలంలో జగన్నాథుడు తన పేరు చెప్పి, తన నలతివానిగా భావింపవద్దని చెప్పిన భాగాన్ని తొలగించి కేవలం ఆపన్నుడైన భక్తుని ప్రార్థన వలెనే స్ఫురింపజేశారు. అల్పాక్షరాలలో ననల్పార్థరచన గావించాలని వీరి తలంపు. అందుకే గంగాలహరిలోని ఏభైమూడు పద్యాలలో మూడవవంతు కంటె మించి చిన్న పద్యాలు వ్రాశారు. ఆ చిన్న పద్యాలన్నీ తేటగీతులే! పండిత రాయల శ్లోకాలను తేట తెలుగులో ఆంధ్రుల కందించాలనే ఉద్దేశం వీరిది.

అవసరమని భావించినప్పుడు వీరు మూలభావాన్ని పెంచి సీస పద్యాలను వ్రాశారు. మూల శ్లోక భావం సీస పద్యంలోని మూడు పాదాలే సరిపోతే వారు స్వతంత్రించి మిగిలిన పద్య భాగాన్ని పూర్తి చేయడానికి వెనుకాడరు. గమనించండి.

**''సముత్పత్తిః పద్మారమణ పదపద్మామలనఖాత్**
**నివాసః కందర్ప ప్రతిభటజటాజూటభవనే,**
**అథాఽయం వ్యాసంగో హతపతితనిస్తారణవిధౌ**
**న కస్మా దుత్కర్ష స్తవ జనని! జాగర్తు జగతః?**

ఈ శ్లోకానికి పింగళివారి యనువాద మిది.

**''జననమా? విశ్వవిశ్వంభరాభరణుఁడౌ**
**నారాయణుని పాదనలిన మందు**
**ఆవాసమా? భూధరాత్మజాక్రాంత వా**
**మాంగుఁడౌ భవు నుత్తమాంగమందు**
**వర్తనంబా? మాదృశార్త మానవ సము**
**ద్ధరణ దీక్షాపుణ్యతంత్రమందు**
**మహిమమా? సంస్పర్శమాత్ర సర్వప్రాణి**
**జాడ్యాపనోదకౌశలమునందు**
**శాపపరిదగ్ధ సగరరాజర్షి సుతులఁ**
**బుణ్యభువనమ్ముఁ జేర్చుట ముఖ్యలీల**
**గంగ యను నక్షరములె యుత్కర్షనిధులు**
**అన్య వర్ణన లెల్ల నిరర్థకములు''**

సీస పద్యం మూడవ పాదంలో మూలభావం ముగిసింది. ఆ తర్వాత చెప్పిన సీస పద్యపాదం, తేటగీతి పద్యంలోని భావం పింగళివారు మూలాతిశాయిగా ముచ్చటించిందే. మాతృకను పఠించిన పిదప జనించిన భావుకత ఈ పెంపుదలకు కారణమని భావించవచ్చు

ఆంధ్రీకర్త లెవ్వరైనా మూలభావానికి కేవలానువాదం గావించాలని కోరుకోరు. అందమైన అనువాదా న్నందించాలనీ, పాఠక హృదయాల నలరించాలనీ కోరుకుంటారు. శబ్దాలంకారయుత శైలీసంపదతో శోభించిన అనువాదమే ఆకర్షణీయంగా ఉంటుంది.

**''మోహ తమము హరించు క్రొంబ్రొద్దు పొడుపు**
**బ్రహ్మ వ్రాసిన దుర్వర్ణపంక్తి తుడుపు**
**కాలునకుఁజుక్క యెదురు, దుష్కర్మ బెదరు**
**గాంగమృత్తిలకమ్ము మోక్షప్రదమ్ము''**

మూలంలో లేని అంత్యానుప్రాస పద్యానికి అందచందాలను సంతరించింది. గంగాలహరిలో చివరి శ్లోకం అందమైన అంత్యానుప్రాసాలంకృతం. మూలంలో నున్న అంత్యానుప్రాస ననువాదంలో ప్రవేశపెట్టటం కవికి కష్టం కాదు. మూలంలో

లేకపోయినా శబ్దాలంకారాలను ప్రవేశపెట్టి పద్యానికి సొగసు చేకూర్చటం సహజ కవుల లక్షణం. పింగళివారు అట్టి సహజ కవులు. అందువలననే మూలంలో లేకపోయినా ముక్తపదగ్రస్త ప్రాయమైన శబ్దాలంకారాన్ని ప్రయోగించా రీ పద్యంలో.

**''తన నేర్పు తన సంపద యెఱింగి నీతోడ**
**నాది భిక్షువు జూదమాడు టేల?**
**ఆడెఁబో! పై బట్టతోడ సర్వస్వమ్ము**
**నోడియుఁబ్రమథుల నోడుటేల?**
**ఓడెఁబో! యంతతో నూరకుండగ లేక**
**తన్నుఁదా నొడ్డఁగా దలఁపనేల?**
**తలఁచెఁబో! భూధరాత్మజ యెంతొ చకితయై**
**క్రీగంట నిన్ను వీక్షించుటేల?''**

పై బట్టతో గూడా సర్వస్వాన్ని పందెంలో పోగొట్టుకున్నాడని చెప్పిన సందర్భంలో పై బట్టతో అనే పదం తెలుగుదనంతో నిండిన పదం. ఈ అనువాద గ్రంథంలో పింగళివారు జాతీయాలను, లోకోక్తులను ఉపయోగించారు. నడుము కట్టు, చెవులు చల్లగ, ఇల్లువాకిలి, అల్లరిజట్టు, మాటతడిబడిపోవు, కన్నులప్పగించు వంటివి వీ రుపయోగించిన చక్కని పదబంధాలు. కాగా, తల్లికి బిడ్డ భార మగునా? నైజ మెవ్వరి కేని మానంగ రాదు వంటివి లోకోక్తుల వంటి వాక్యాలు.

ఇంత అందంగా, ఆకర్షణీయంగా అనువాదం గావించటం వలననే కాటూరి వారు ''లక్ష్మీకాంతం ఎఱ్ఱన అయిపోతున్నాడు. ఎంత బాగుంటుంది అనువాదం? ఎవరన్నా ఇలా అనువదించగలరా?'' అని ప్రశంసించారు. పండితరాయల స్తుతిలహరీపంచకంలో సుధాలహరి యొకటి. ముప్ఫై స్రగ్ధరా వృత్తాలలో గావించిన సూర్యస్తుతి యిది. సూర్యస్తుతి గ్రంథాలలో మయూరుని సూర్యశతకం ప్రసిద్ధం. పింగళివారు ఈ రెండు గ్రంథాలలో తనకు నచ్చిన శ్లోకాలను 'తేజోలహరి' పేరుతో ఆంధ్రీకరించారు. కవితాసుధాధారలను సీసాలతో అందిస్తున్నట్లు పింగళివారు తేజోలహరిలో పది సీస పద్యాలను వ్రాశారు. అన్ని పద్యాలు ఉదాహరణ యోగ్యాలే అయినా ఈ ఒక్క పద్యాన్ని పరిశీలించండి.

**''బిభ్రాణా వామనత్వం ప్రథమ మథత థైవాంశవః ప్రాంశవో౽పః**
**క్రాంతాకాశాంతారాళాస్తదను దశదిశః పూరయన్తస్తతో౽పి**

**ధ్వాంతా ద్దాచ్ఛిద్యదేవద్విష ఇవబలితో విశ్వమాశ్వశ్నువానాః**
**కృచ్ఛ్రాణ్యుచ్ఛ్రాయ హేలాపహసిత హరయోహారి దశ్వాహరంతు''**
**''మందార కింజల్కమాత్రాకృతిన్ దొల్తఁ,**
**బొడుపుగుబ్బలి మీఁదఁబొటమరించి**
**యంతలోఁబెను తీఁగె లంతలై మాహేంద్ర**
**దిక్ప్రాంగణమ్ము నతిక్రమించి**
**యంతంత దుర్నిరీక్ష్య ప్రోన్నతంబులై**
**గగనాంతరాళలంఘన మొనర్చి**
**వాగతీతప్రభావమ్ములై యాశావ**
**కాశమ్ములన్నింటఁగలయఁబ్రాకి**
**త్రిభువనాక్రాంతి విక్రమరేఖ మెఱసి**
**యమ్మహావిష్ణు వామనత్వమ్ము ననుక**
**రించు నంభోజమిత్రు మరీచిజాల**
**మడఁచుఁగావుతఁబుడమిలో నిడుమలెల్ల''**

వామనుడై బలిచక్రవర్తి నుండి మూడడుగుల నేలను దానంగా పొందిన తరువాత ''ఇంతింతై వటు డింతయై'' విశ్వమంతా వ్యాపించి త్రివిక్రముడైన విష్ణువు నపహసిస్తూ సూర్యకిరణాలు దశదిశలా వ్యాపించాయని భావం. అట్టి సూర్యకిరణాలు మీ దుఃఖాలను తొలగించుగాక! అని శుభాకాంక్ష. మూలానికే మాత్రం తీసిపోని అనువాదమిది. మయూర జగన్నాథుల శ్లోకాల నన్నింటినీ అనువదించకపోయినా ఆంధ్రీకరించినంతవరకూ రచన ఆకర్షణీయంగా సాగింది. ఇనుపగుగ్గిళ్ల వంటి మయూరుని శ్లోకాలను పింగళివారు అనుపగుగ్గిళ్లుగా మార్చారు. పండితరాయల సుధాలహరి శ్లోకానువాదాలు సుధారసధారలే.

పండితరాయల అన్యాపదేశాలు ఆహ్లాదదాయకాలు. అనన్యసామాన్యాలు. డాక్టర్ మహీధర నళినీ మోహన్ పండితరాయల అన్యాపదేశాలను పండిత పామర రంజకంగా అనువదించి గచ్ఛద్వ్యాఖ్యారూపంలో భారతిలో ప్రచురించారు. పింగళి లక్ష్మీకాంతంగారు కూడా తనకు నచ్చిన పండిత రాయల శ్లోకాల ననువదించి 'అన్యాపదేశలహరి' అనే పేరుతో ప్రకటించారు. భ్రమరగీతి, పద్మవనము, జలధరార్భటి, దుర్జన తాడనము, గజబృంహితము, సింహగర్జనము, చందన

చర్చ, కోకిలాలాపము, కురంగివిలాపము, చిలుక పలుకు అన్యాపదేశలహరి యందలి శీర్షికలు. అన్ని శీర్షికలందలి పద్యాలు కలిసి అర్ధనూటపదార్లు. ఈ అనువాద పద్యాలన్నీ సులభ సుందర శైలీ విన్యాసంతో సహృదయ హృదయ మందిరాల నలంకరించాయి. గంగాలహరి అనువాదం వలెనే అన్యాపదేశలహరి అనువాదం గూడా స్వేచ్ఛానువాదం. మూలవిధేయత కంటె మూల విపులీకరణ అధికం. కోకిలాలాపం ఖండికలో పింగళివారు వ్రాసిన పద్య మిది.

**''కీరచకోర పారవతకేకి సమూహము లార! చాలు మీ**
**మీ రవముల్ వృథార్భటులు మెల్ల దొలంగుడు చాటు చోటికిన్**
**నోరు మెదల్ప బోకుడు, వినూత్నవసంతరసాల పల్లవాం**
**కూరకషాయకంఠమున గోకిల గానసుధన్ వెలార్చెడిన్''**

ఈ పద్యానికి మూల శ్లోక మిది.

**''కాకివృకా ఘూకబకాశ్చభేకాః**
**ప్రణమ్యయుష్మానిదమేవ యాచే**
**కోలాహలం మా కురుతక్షమధ్యం**
**పుంస్కోకిలః కూజతి మంజురావమ్''**

ఆ శ్లోకం మాత్రమే కాక

**''తావచ్చకోరచరణాయుధ చక్రవాక**
**పారావతాదివిహగాః కలమాలపంతు**
**యావద్ వసంత రజనీఘటికావసాన**
**మాసాద్యకోకిల యువాన కుహూంకరోతి''**

అనే శ్లోకం గూడా పై పద్యాని కాధారమని నాగళ్ల గురుప్రసాదరావుగారి భావం. అంటే మూలంలోని ఈ రెండు శ్లోకాలను పఠించి సారాంశాన్ని సుందర పద్యరూపంగా సంతరించారని సారాంశం. మొత్తం మీద తేజోలహరి, గంగాలహరి, అన్యాపదేశలహరి అనే త్రివేణీ సంగమం మధురపండితరాజం. మూలానుసరణం, మూలప్రపంచనం, మూలకుంచనం అనే లక్షణత్రయంతో శోభిస్తున్న మధుర గ్రంథరాజం మధుర పండితరాజం. పింగళివారు ఆంధ్రభారతికి సమర్పించిన ''నూటపదహార్లు'' మధుర పండితరాజం.

# గద్యరచనలు

పింగళివారు గొప్ప కవి మాత్రమే కాదు. గొప్ప విమర్శకుడు కూడా. వారి విమర్శకు వారి అధ్యాపకత్వం వన్నె పెట్టింది. ''ఆ విమర్శకు రెండు ముఖము లున్నవి. అందొకటి సాహిత్య శాస్త్ర సిద్ధాంతములతో గూడినట్టిది. రెండవది యాంధ్రసాహిత్య చరిత్ర రూపమున నున్నట్టిది. ఈ రెండు రంగములలో సవ్యసాచిగా విహరించినవారు లక్ష్మీకాంతం గారు'' అని పింగళివారి స్మారక వ్యాసంలో శ్రీ నాగళ్ల గురుప్రసాదరావుగారు ప్రశంసించారు. భారత వ్యాఖ్య, సంస్కృత వ్యాకరణం, గౌతమ నిఘంటువు వంటి గ్రంథా లున్నా ప్రధానంగా సాహిత్య చరిత్ర, సాహిత్య విమర్శ గ్రంథాలే వారికి లభించిన ఖ్యాతికి ముఖ్య కారణాలు. గౌతమ వ్యాసాలు, రేడియో ప్రసంగాలు ఈ రెండు విభాగాలలో అంతర్గతాలే.

## మహాభారత వ్యాఖ్యానం

**''పారిజాతము తన కంటఁబడెడు వఱకె**
**ద్రుమము ద్రుమమునఁదిరుగు మధువ్రతమ్ము**
**భారత కవిత్వ రుచి పట్టువడెడు వఱకె**
**ఇతర కావ్యాలు తడవు సాహిత్య వటువు''**

భారత కావ్య ప్రశంసగల పింగళివారి ప్రశస్త పద్యం ఇది. పారిజాతవృక్షం కన్పించనంతవరకు తుమ్మెద ఇతర ద్రుమాల నాశ్రయిస్తున్నట్లే భారత కవితా మాధుర్యాన్ని ఆస్వాదించనంతవరకే సాహిత్య విద్యార్థి ఇతర కావ్యాలను పఠిస్తాడని భావం. భారత కవిత్వంపై ఇంతటి ప్రత్యయం పింగళివారికి.

పింగళివారికి భారతంపై ఇంతటి అభిమానము కలగడానకి కారణం వారి గురుదేవులు వేంకటశాస్త్రిగారే. తన తండ్రికి జబ్బుగా వుందని తెలిసి పింగళివారు స్వగ్రామం వెళుతుంటే, తిరిగి రావడానికి ఆలస్యం గావచ్చు కనుక భారతం చదవమని గురువుగారి ఆదేశం. పింగళివారు స్వగ్రామం చేరేటప్పటికే తండ్రి మరణించాడు. ఆర్థికపరమైన లావాదేవీలు తేల్చుకోవటానికి పింగళివారు కొంతకాలం స్వగ్రామంలోనే ఉండవలసి వచ్చింది. అంతలో ఆ గ్రామ మునసబు గారి అమ్మాయికి మహాభారతం వినాలనే కోరిక కలిగింది. భారత పురాణం చెప్పగల సమర్థులు లక్ష్మీకాంతంగారని తెలుసుకొని మునసబుగారు పింగళి వారి నాహ్వానించారు. పింగళివారికి గుర్వాజ్ఞ గుర్తుకు వచ్చింది. రెండు నెలలపాటు

భారత పురాణం చెప్పారు. ఈ అవకాశం లభించడంవల్ల లక్ష్మీకాంతంగారు మహాభారతాన్ని క్షుణ్ణంగా పరిశీలించారు. పాండవ నాటకంలో వారు ధర్మరాజు పాత్రను ధరించినప్పుడు భారత పఠనం వలన లభించిన జ్ఞానాన్ని ఉపయోగించుకొని వుంటారు. 1927లో పరిశోధక పదవిలో మద్రాసు వెళ్ళినప్పుడు రెండున్నర సంవత్సరాల పాటు మహాభారతం మీద పరిశోధనలు చేశారు. మద్రాసు కన్నెమెరా లైబ్రరీలోని, తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలోని భారత సంబంధ సంస్కృతాంగ్లాంధ్ర వాఙ్మయాన్నంతా ఆపోశనం పట్టారు. మహాభారత విషయంలో ప్రామాణికులయ్యారు. ఇంతటివారయ్యారు గనుకనే వావిళ్ల సంస్థవారు మహాభారత వ్యాఖ్యానం వ్రాయించాలని కట్టమంచి వారిని కలిసినప్పుడు వారు పింగళి వారి పేరు సూచించారు. లక్ష్మీకాంతంగారు మహాభారత ఆది సభాపర్వాలకు విపుల వ్యాఖ్యానాన్ని వ్రాశారు. కాని వావిళ్ల సంస్థ అధిపతి వేంకటేశ్వరశాస్త్రిగారి మరణంతో పింగళివారికి ప్రోత్సాహం కరువైంది. ఆ బృహత్ప్రయత్నం అంతటితో ఆగిపోయింది. పూర్తి అయివుంటే ఆంధ్రభారతి ఎంత సుసంపన్నురాలై ఉండేదో! ఉన్నంతవరకైనా ఆది సభాపర్వ వ్యాఖ్యాన ప్రతి ఉనికిని పింగళివారి శిష్యమిత్రుల ద్వారానైనా తెలుసుకొని వారి పుత్రులు వెలువరిస్తే భారత సంబంధమైన నూతన విశేషాలు ఎన్నో వెలుగు చూడవచ్చు.

## సాహిత్య శిల్ప సమీక్ష

లక్ష్మీకాంతంగారు ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ఎం.ఏ. విద్యార్థులకు సాహిత్య చరిత్ర, సాహిత్య విమర్శలను బోధించేవారు. అంతకు ముందెన్ని సాహిత్య చరిత్ర గ్రంథాలున్నా పింగళివారు తన ప్రత్యేకతను తాను ప్రదర్శిస్తూ పాఠప్రవచనం చేసేవారు. అలాగే హడ్సన్ మున్నగు ఆంగ్ల విమర్శకుల గ్రంధాలను పరిశీలించి, భారతీయ సాహిత్య శాస్త్ర గ్రంధాలను పఠించి, స్వీయ ప్రతిభను జోడించి సాహిత్య విమర్శను విద్యార్థులకు బోధించేవారు. ఈ రెండు గ్రంథాలు ఎప్పుడో గ్రంథరూపం దాల్చవలసింది. కాని పింగళివా రా విషయంలో శ్రద్ధ చూపలేదు. నీ భావాలు నీ కంటే ముందుగా ఇతరుల పేరుతో ప్రచురితా లవుతాయని పింగళివారితో డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారు చెప్పిన మాటలు యథార్థాలయ్యాయి. ఆ విషయం లక్ష్మీకాంతంగారు గమనించారు. 1966వ సంవత్సరంలో సాహిత్య శిల్ప సమీక్ష గ్రంథం ప్రచురిస్తూ ధీర గంభీరంగా వ్రాసిన పీఠికలో ''ఇది నేను

ముప్పది యేండ్ల క్రితము ప్రచురింపవలసిన గ్రంథము. ఇప్పుడైనను, నా అలసతను సహింపని నా విద్యార్థిమిత్రులు కొందరు తరిమి హెచ్చరించుటచే దీనిని వెలువరింపగలిగితిని. అయినప్పటికి దీని వ్రాతప్రతులు ఆంధ్ర దేశములో సుమారు ఒక వేయికి పైగా ఉన్నవి. ఆ ప్రతులు గల వారిలో కొందరు ఇందలి సిద్ధాంతములను, వాక్యములను, ప్రకరణములను, నా పేరు మీద గాక పోయినను, పత్రికలలో, గ్రంథములలో విరివిగా ప్రచారము చేసి ఈ నూత్న విమర్శ సంప్రదాయమునకు కొంత ప్రతిష్ఠ సంపాదించిరి. వారికి నేను కృతజ్ఞుడను'' అని తన భావాలను తస్కరించిన వారిని సత్కరించారు.

ఈ గ్రంథంలో పాశ్చాత్య విమర్శ సిద్ధాంతాలకు, భారతీయాలంకారిక సిద్ధాంతాలకు గల భేదసాదృశ్యాలను వీరు వివరించారు. ఈ రెండు పద్ధతులు ఎంతవరకు సంవదిస్తాయో నిరూపించటానికి ప్రయత్నించారు. ఇటువంటి కృషి చేసినవా రింతకు ముందు లేకపోలేదు. కాని ఈ రెండు సిద్ధాంతాలను పోల్చి, సాదృశ్య భేదాలను గుర్తించి, అందంగా ఆవిష్కరించడానికి పూనుకొన్నవారిలో వీరే ప్రథములు. భారతీయాలంకారికులు చేసిన సిద్ధాంతాలు వారి కాలానికి సంబంధించినవని, కాలానుగుణంగా మార్పులు వస్తాయని, ఆ మార్పులను అంగీకరించాలని వారు సూచించారు. దశరూపక లక్షణాలను గురించి వివరిస్తూ, ''పూర్వకాలంలో మహోదారపురుషుల చరిత్రతో పాటు సంఘంలోని అల్పుల చరిత్రను గూడా సంస్కృత కవులు కావ్య వస్తువుగా స్వీకరించి నాటక వాఙ్మయశాఖను విస్తరింపజేశా''రని భావించారు. ఇలా అనేక విషయాలను గూర్చి తన భావాలను ప్రకటించారు.

అయితే మూడు దశాబ్దాలు వారు బోధించిన సాహిత్య విమర్శ విశేషాలు గ్రంథరూపములో వచ్చినందుకు సంతోషించినవారు విద్యార్థులకు వారు చెప్పిన నోట్సును మార్పులేకుండా ప్రచురించినందుకు విచారించారు. ఎన్నెన్నో అనంతరకాలపు విశేషాలను చేర్చడానికి అవకాశం ఉన్నా వినియోగించుకోనందుకు చింతించారు. నవల, కథానిక, వ్యాసం, జీవిత చరిత్ర వంటి శీర్షికలు ఎంతో విపులంగా వివరించదగ్గవి. భారతీయ సాహిత్య ప్రస్థానాన్ని గూర్చి మాత్రమే రస స్వరూపం, రస నిష్ఠ, రససంఖ్య, రసరాజం, శృంగారభేదాలు, రసాభాసం అనే శీర్షికలతో విశదీకరించారు. ధ్వనికి సంబంధించిన విశేషాలు లేనేలేవు. పుస్తకరూపం

ధరించేటప్పుడు శ్రద్ధతో, ఎన్నో శీర్షికలను చేర్చి విపులీకరించి ఉంటే బాగుండేది. ఉదాహృత వాక్యాలు ఏ యే గ్రంథాల నుండి గ్రహించినది పుటల నుట్టంకిస్తూ సూచించటం సక్రమ పద్ధతి, శాస్త్రీయ పద్ధతి. ''ఆ మూల గ్రంథముల పుటలు, పంక్తులు ఇవ్వలేకపోతిని. అయినా అవి సూనృతములే. శంకనీయములు కావు'' అని సమర్థించుకోవటం సమంజసం కాదు. వారిపై గల విశ్వాసంతో శంకించకపోయినా, వారి పద్ధతి నౌనని తల పంకించటం కష్టం.

అయినప్పటికీ, కొన్ని విషయాలను గూర్చి సంక్షిప్తంగా వ్రాసినప్పటికీ, కొన్ని విషయాల నసలు ప్రస్తావించకపోయినప్పటికీ, ఉట్టంకిత వాక్యాలకు సాక్ష్యాలను సూచించనప్పటికీ సాహిత్య శిల్ప సమీక్ష ప్రామాణిక గ్రంథమే. ఉన్నత విద్య నభ్యసించే విద్యార్థులకు కొన్ని దశాబ్దాల పాటు ఉపయోగపడిన ఉత్తమ విమర్శ గ్రంథమే. సాహిత్య వేదంగా సంభావింపబడిన ఈ విమర్శ గ్రంథాన్ని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ఉత్తమ విమర్శ గ్రంథంగా సంభావించి బహుమతి ప్రకటించారు. వారి సాహిత్య చరిత్ర నుత్తమ సాహిత్య గ్రంథంగా భావించి అకాడమీ వారు ప్రచురించారు.

## ఆంధ్రసాహిత్య చరిత్ర

**''ప్రారంభించిన వాఙ్మయాధ్వరము నిష్పత్త్యూహ్య పర్యాప్తమై**
**నా రామామణి యంత్యకాల శుభవాంఛాపూర్తి గావింపగా**
**ఆరోగ్యంబును నాయువున్ మతియు ధైర్యంబున్ బ్రసాదింపవే**
**క్షీరాంభోనిధి కన్యకా హృదయ రాజీవార్క! భక్తప్రియా!''**

ఎప్పుడో ప్రారంభించి పూర్తిచేయాల్సిన ఆంధ్రవాఙ్మయ చరిత్ర రచనను పింగళివారు తిరుపతిలో ప్రారంభించారు. ఇంతలో భార్య మరణించింది. ఆంధ్రవాఙ్మయ చరిత్రను పూర్తిగావించటం వారి సతీమణి అంత్యకాల శుభవాంఛ. ఆమె చివరి కోర్కెను తీర్చడానికి ఆయురారోగ్యాలను, శక్తి సామర్థ్యాలను ప్రసాదించమని వేంకటేశ్వరస్వామిని వారు ప్రార్థించారు. ఆ వేంకటేశ్వరస్వామికే అంకితమీయాలని అంకిత పద్యాలు గూడా వ్రాశారు. కానీ గ్రంథం పూర్తి చేయకముందే వారి జీవిత కాలం పూర్తి అయింది. రాయల యుగ ప్రారంభం పింగళివారి జీవిత యుగానికి ముగింపు అయింది.

సాహిత్య చరిత్రలో యుగవిభజన ముఖ్యాంశం. ఆంధ్ర సాహిత్య చరిత్రను పింగళివారు పది యుగాలుగా విభజించారు. ''రాజవంశం పేరు మీదను, దేశ విభాగము పేరు మీదను, మరికొన్ని ప్రమాణముల మీదను ఈ విభాగములు చేయవచ్చును గాని మహాకవుల పేరు మీదనే ఆ యుగములను విభజించి పిలుచుట న్యాయము'' అని కవుల పేరుమీద యుగ విభజన గావించారు. వీరు నాయకరాజుల యుగం తర్వాత యుగానికి క్షీణయుగమని పేరు పెట్టారు. ఈ పేరు నచ్చక, ఆ యుగంలో మంచి కవిత రాలేదనే వీరి వాదం నచ్చక ఆ యుగ సాహిత్యాన్ని ఉషఃకిరణాలు, నవోదయం పేరుతో కొందరు వ్రాశారు. అయినా పింగళి వారి విభజన బహుజనామోదాన్ని పొందింది.

కవికాల నిర్ణయ, కుల నిర్ణయాలే సాహిత్య చరిత్రగా చెలామణీ అవుతున్న రోజులలో కవితా విమర్శకు ఉచిత స్థానా న్నిచ్చి తనదైన బాణీలో విద్యార్థులకు పింగళివారు బోధించారు. ఆ బోధించిన విషయానికే గ్రంథరూపా న్నిచ్చారు. కావ్య తత్త్వాన్ని వివరించేటప్పుడు గాని, కవి స్థానాన్ని నిర్ణయించేటప్పుడుగాని వారు పదాలను ఆచితూచి ప్రయోగిస్తారు. వారి నిర్ణయాలు అధిక సంఖ్యాకులకు ఆమోదయోగ్యాలు. ఒక కవి కవితలోని సద్గుణాలను ప్రశంసిస్తూనే, తాను దోషాలని భావించిన వానిని స్పష్టాతిస్పష్టంగా విమర్శిస్తారు. అంతిమ తీర్పును ఆవిష్కరిస్తారు. నన్నెచోడమహాకవి కుమారసంభవంలోని కవితా శక్తిని వివరిస్తూ, ''కాళిదాసునే మురిపించెడి పద్యములు ఇట్టివి ఈ గ్రంథములో చాలా కలవు'' అని స్తుతించారు. నన్నెచోడుడు తన గురువైన జంగమ మల్లికార్జునకు పరమేశ్వరునకు అభేదాన్ని పాటిస్తూ చెప్పిన పద్యాలు పింగళివారికి నచ్చలేదు. ''పరాకాష్ఠ చెందిన ఇతని గురుభక్తి యారాధనీయమే కాని ఆ గురునకు పరమశివునితో అభేదమును పాటించెడి పారవశ్యము మాత్రము సమర్థనీయము కాదు'' అని తన వ్యతిరేకతను వ్యక్తీకరించారు. ఎఱ్ఱన నాచన సోమనల కవితలలోని తారతమ్యాన్ని వివరించేటప్పుడు ఇద్దరు కవులలోని గుణదోషాలను తెలియజేశారు. చివరకు ''సోమన భారతము వ్రాయవలసి వచ్చినచో యుద్ధ పంచకమును మాత్రము వ్రాయగలడేమోగాని తిక్కనవలె తుది పర్వములనుగాని, ఎఱ్ఱన వలె అరణ్య పర్వమును గాని వ్రాయలేడు'' అని ఎఱ్ఱననే పైమెట్టున నిలబెట్టాడు. అంతటితో నాగక ''వ్యాసుడు, వాల్మీకి మొదలైన ఆర్ష కవులకును, నైషధాది లౌకిక కావ్యకర్తలకును ఏ వాసి

కలదో, అట్టి వాసియే తెలుగున కవిత్రయము వారికిని ఇతర ప్రబంధ కర్తలకును కలదు. ఎఱ్ఱన తెలుగున ఆర్షకవి వర్గము లోనివాడు. సోమన లౌకిక ప్రబంధ కర్తల కోటి లోనివాడు'' అని నిగ్గు తేల్చారు.

అయితే కవికాల నిర్ణయాదులలోను, కవుల తారతమ్య నిరూపణలోను పింగళివారి అభిప్రాయాలతో ఏకీభవించని వారున్నారు. రంగనాథ రామాయణ నామ చర్చ విషయంలోను, ఎఱ్ఱన సోమనల తారతమ్య నిరూపణ విషయంలోను, వీరి నిర్ణయాలను వ్యతిరేకించినవారున్నారు. కొందరు కవులను గూర్చి సంక్షిప్తంగా – అతి సంక్షిప్తంగా వ్రాశారని విమర్శించే వా రున్నారు. అయినా పింగళివారి ఆంధ్రసాహిత్య చరిత్ర సాహితీ ప్రియుల మన్నన లందుకున్నది. ''ఈ చరితమ్ము సాహితీ, మేరువులౌ బుధోత్తముల మెప్పు గడించెను మున్నె'' అనీ

**''ఇది జనించిన నలుబది యేండ్ల నుండి**
**సరస సాహిత్య విజ్ఞాన సత్ర మనుచు**
**ఆశ్రయింపని తెలుగు విద్యార్థి లేడు**
**చొచ్చిచూడని తెల్గు వ్యాసుండు లేడు''**

అనీ కృతి సమర్పణ పద్యాలలో తిరుపతి స్వామికి ఆత్మవిశ్వాసంతో విన్నవించుకున్నారు.

**''ఆంధ్ర వాఙ్మయ చరితంబు నవల నెవరు**
**చెప్పి వ్రాసిన నది గురూచ్ఛిష్టము కద!''**

అని వారి శిష్యులు బాలాంత్రపు రజనీ కాంతారావు గారు స్తుతించటం గురుభక్తితోనే కాదు, గురుశక్తి గ్రహణతో కూడ.

## కుమార వ్యాకరణం

తెలుగు ఉపాధ్యాయులకు సంస్కృత భాషా జ్ఞానం అవసరం. సంస్కృత శబ్దార్థజ్ఞానం ఆంధ్ర వాఙ్మయ పఠనం వలన కొంత లభిస్తుంది. అయితే శబ్ద స్వరూప జ్ఞానం మాత్రం వ్యాకరణ పఠనం వలన చేకూరుతుంది. ఆ దృష్టి తోనే ఎం.ఏ. తెలుగు విద్యార్థులు, 'బి' విద్వాన్ విద్యార్థులు సంస్కృతం పేపరులో ఉత్తీర్ణులు కావాలనే నిబంధనను అధికారులు విధించారు. ఆ కొద్దికాలంలో, సూక్ష్మంలో మోక్షం అన్నట్లు, సంగ్రహంగా నైనా చదవగలిగిన సంస్కృత వ్యాకరణ గ్రంథాలు తెలుగులో లేవు. ఇంగ్లీషులో సంస్కృత వ్యాకరణ గ్రంథా లున్నా వాటివలన తెలుగు విద్యార్థులకు ప్రయోజనం శూన్యం. పరీక్షా పత్రాలు తెలుగులో

వ్రాయాల్సిన విద్యార్థులు శాస్త్రాన్ని ఇంగ్లీషులో చదవటం మంచి పద్ధతి కాదు కదా! సంస్కృతంలో ఉన్న వ్యాకరణ సూత్రాలను నేర్వవచ్చుగదా అని అనవచ్చుగాని తెలుగులో పరీక్షవ్రాసే విద్యార్థులు సంస్కృతంలో ఎందుకు శ్రమపడతారు?

తన అధ్యాపకత్వ కాలంలో విద్యార్థులు పడుతున్న ఈ అవస్థల్ని పింగళి లక్ష్మీకాంతంగారు గమనించారు. స్వయంగా తానొక ప్రణాళికను ఏర్పరచుకొని, ఎం.ఏ. విద్యార్థులకు సంస్కృత పాఠప్రవచనం చేశారు. ఒక సంవత్సరములోనే సంస్కృత వ్యాకరణంలోని ప్రధానాంశాలను విద్యార్థులకు బోధించగలిగారు. ఆ బోధించిన వ్యాకరణోపన్యాసాలనే చిరు మార్పులతో కుమార వ్యాకరణం పేరుతో రచించారు. తన ఆరాధ్యదైవమైన తిరుపతి వేంకటేశ్వరునకు ఈ వ్యాకరణ గ్రంథాన్ని అంకితం చేశారు.

ఇది సంగ్రహవ్యాకరణం. విద్యార్థుల ప్రయోజనార్థం వెలసిన వ్యాకరణం. అందువలన మరీ లోతులలోకి వెళ్లలేదు. పరీక్షలలో విద్యార్థుల ఉత్తీర్ణత ప్రధానం. అయినా కొన్ని సందర్భాలలో లోతుకు వెళ్లక తప్పలేదు. పరీక్షలకు అంతగా అవసరం లేకపోయినా భవిష్యత్తులో ఉపయోగపడుతుందని పింగళివారు భావించారు. ఈ వ్యాకరణ రచనలో వీరు తనకుగల భాషా శాస్త్రజ్ఞానాన్ని గూడా ఉపయోగించుకున్నారు. ఈ పద్ధతి విద్యార్థులకు ఆసక్తిదాయకమని అనుభవం వలన వీరు గ్రహించారు.

ఈ గ్రంథం అనతి కాలంలోనే అత్యంత ప్రచారాన్ని పొందింది. అనంతర కాలంలో అకాడమీ వారొక సంస్కృత వ్యాకరణాన్ని ప్రకటించారు. వ్యక్తిగతంగా కూడా మరికొందరు సంస్కృత వ్యాకరణాలు వ్రాశారు. అయితే, కొత్తగా ఎన్ని వ్యాకరణ గ్రంథాలు వచ్చినా, పింగళివారి వ్యాకరణ గ్రంథానికి గల ప్రచారం తగ్గలేదు. ఈ గ్రంథాన్ని పఠించిన పాఠకులు ఎం.ఏ. పరీక్షలో ఉత్తీర్ణత నందటమే కాదు. కొంతకు కొంత భాషా పాండిత్యాన్ని గూడా పొందగలరు.

## పరిష్కరణలు

లక్ష్మీకాంతంగారికి మార్గ కవిత్వంపైన ఎంత అభిమానమో, దేశి కవిత్వం పైగూడా అంతే అభిమానం. కాబట్టే వారు రంగనాథ రామాయణ ప్రచురణ విషయంలో సహకరించారు. ద్విపద భారతాన్ని, పల్నాటి వీర చరిత్రను పరిష్కరించారు. ‘‘... పాడదగిన పద్య కవిత్వము నెడ నొక కంటిని. పఠన

యోగ్యమైన కవిత్వము నెడ రెండవ కంటిని పెట్టి యుభయగుణములను ఏకము చేసి యా మహానుభావులు (ద్విపదకర్తలు) ప్రవచనము చేసిన రసాయనమే ద్విపద కవిత్వం. ఇది గేయమును అగును, పాఠ్యమును అగును... సౌలభ్యమైన శైలీప్రౌఢికి కూడలియై, దేశీయమైన శుద్ధ పదకవిత్వమునకును, సాంస్కృతికమైన ప్రౌఢ సాహిత్యమునకును సామరస్యము గలిగించి యుభయతారకమైన కావ్యపథమును తీర్చి దిద్దినది'' అని ద్విపద కవిత్వాన్ని గూర్చి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

పింగళివారు విశాలాంధ్ర పబ్లిషర్స్ సంస్థ కోసం పల్నాటి వీర చరిత్రను పరిష్కరించారు. వివిధ వ్రాత ప్రతులను సంపాదించి, సరిచూసి, శుద్ధప్రతిని సిద్ధం చేశారు. ఈ గ్రంథాన్ని పరిష్కరించి ప్రచురించటం వ్యయ ప్రయాసలతో గూడిన బృహత్కార్యం. వ్యయం అంతా విశాలాంధ్రవారు భరించారు. ప్రయాస అంతా పింగళివారు సహించారు. ఈ మహా యజ్ఞంలో వీరిని ప్రోత్సహించినవారు గూడూరి నమశ్శివాయగారు. సహకరించినవారు అవసరాల సూర్యారావుగారు. తెలుగుపుడమి పడతి కంకితమైన ఈ పరిష్కృత కావ్యప్రతులు - అంతకు ముందే మరో పరిష్కృత గ్రంథం ఉన్నా గూడా - అచిరకాలంలోనే ఆంధ్రదేశం నలుచెరగులా వ్యాపించాయి. పింగళివారికి కీర్తి సంపాదించి పెట్టాయి.

పల్నాటి వీర చరిత్ర పరిష్కృత ప్రతి ఎంత నిర్దుష్టమో, ఆ గ్రంథానికి పింగళివారు వ్రాసిన పీఠిక అంత విశిష్టము. తనకంటె ముందు పల్నాటి వీర చరిత్రను పరిష్కరించి, ప్రకటించిన అక్కిరాజు ఉమాకాన్తముగారి కృషిని పింగళివారు ప్రశంసించారు. అయితే వారి వాదంతో విభేదించవలసి వచ్చినప్పుడు ఏ మాత్రం వెనుదీయలేదు. శ్రీనాథుడు కర్ణాట దేశస్థుడనే ఉమాకాన్తము గారి వాదాన్ని పింగళివారు నిరాకరించారు. శ్రీనాథుడు ఆంధ్రుడని సోపపత్తికంగా నిరూపించారు. వీరచరిత్రలోని కట్టుకథ ఏదో, అసలు కథ ఏదో వివరించారు. ఆంతరంగిక సాక్ష్యం ఆధారంగా ఆ నాటి సాంఘికాది పరిస్థితులను విశదీకరించారు. చారిత్రక సాక్ష్యాలను, ఛందోవిశేషాలను విపులీకరించి తన బహుముఖ ప్రజ్ఞాపాటవాలను నిరూపించుకున్నారు. సాహిత్య చరిత్రలో పల్నాటివీరచరిత్ర స్థానం ఎంత ఉన్నతమో, పరిష్కర్తల స్థానంలో పింగళివారి స్థానం గూడా అంతే ఉన్నతం.

## గౌతమ నిఘంటువు

పింగళివారి గ్రంథాలలో కొన్ని విద్యార్థుల కోసం వ్రాసినవి. గౌతమ నిఘంటువు అందులో ఒకటి. ముఖ్యమైన పదాలకు అర్థా లుండాలి. చేతితో పట్టుకోవడానికి సౌకర్యంగా ఉండాలి. ఈ దృష్టితో సిద్ధపరచిన ఆంగ్లాంధ్ర నిఘంటువు లింతకు ముందు లేకపోలేదు. ఇది మరో నిఘంటువు. 7000 ఇంగ్లీషు పదాలకు అర్థాలున్న నిఘంటువు ఇది. పింగళి వారు తమ గోత్రనామంతో ప్రకటించుకున్న నిఘంటువు ఇది. పదాలకు అర్థాలను చెప్పడమే కాకుండా ఆ పదాలను వాక్యాలలో వాడే విధానాన్ని కూడా వివరించిన నిఘంటువు ఇది.

## గౌతమ వ్యాసములు

పింగళివారు తాను గౌతమ గోత్రుణ్ణని ఎంతో గొప్పగా భావిస్తారు. ''గౌతమ గోత్రజుడ నంచు గర్వింతు మదిన్'' అని ఆత్మలహరిలో వారే చెప్పుకున్నారు. ''నే నా మహనీయుల గోత్రమునకు మచ్చయె యైతిని'' అని తరువాతి పద్యంలోనే చెప్పుకున్నా అంతరాంతరాలలో అభిమానం అట్లాగే ఉంది. కాబట్టే తన గోత్రనామంతో మరో గ్రంథాన్ని కూడా వెలువరించారు. ఆ గ్రంథమే గౌతమ వ్యాసములు. వ్యాసాష్టక సంకలన గ్రంథమిది.

ఆంధ్ర వాఙ్మయ స్థూలరూపం అనే మొదటి వ్యాసంలో సూక్ష్మంలో మోక్షం అన్నట్లు వెయ్యేండ్ల తెలుగు సాహిత్యాన్ని వీరు అరవై పుటలలో ఆవిష్కరించారు. ప్రముఖ కవులందరిని గూర్చి సంక్షిప్త సుందరంగా తెలిపారు. ఆయా కవీంద్రుల గుణాలతో పాటు లోపాలను గూడా ఉట్టంకించారు. ఆంధ్ర నాటక కళాపరిషత్తు ఆరవ వార్షికోత్సవ సభలో చేసిన అధ్యక్షోపన్యాసము రెండవ వ్యాసం. ఈ ఉపన్యాసంలో వీరు నాటకాభివృద్ధికి ఎన్నో సూచనలు చేశారు. పోటీ పరీక్షలు పెట్టి రూపకాలు వ్రాయించడం ప్రయోజన శూన్యమని వీరి ఉద్దేశం. ద్విపద భారతాన్ని, రంగనాథ రామాయణాన్ని పరిష్కరించి వ్రాసిన పీఠికలు ఈ సంపుటిలోని మూడు, నాలుగు వ్యాసాలు. రంగనాథ రామాయణ పీఠికలో వివాదాంశా లున్నప్పటికీ వారు చూపించిన ఉపపత్తులు ఆలోచనాత్మకాలు. మానికొండ సత్యనారాయణ శాస్త్రిగారి మానికొండ రామాయణాన్ని ప్రశంసిస్తూ వ్రాసిన వ్యాసం ఐదవ వ్యాసం. పింగళివారీ రామాయణాన్ని రమణీయమని ఎంతో ప్రశంసించారు. కాని ఈ గ్రంథానికి అంత పేరు రాలేదు. విమర్శక కవులైన కట్టమంచి వారి వ్యాసమంజరికి, ముసలమ్మ

మరణం గ్రంథానికి వ్రాసిన పీఠికలు ఆరు, ఏడు వ్యాసాలు. ఈ రెండు గ్రంథాలు, ఆ గ్రంథాలకు పింగళివారు వ్రాసిన రెండు పీఠికలు ఆంధ్రదేశములో ప్రసిద్ధి నందాయి. పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నప్రబంధానికి మూలాన్ని నిర్ణయించే వ్యాసం చివరి వ్యాసం. రవివర్మ భూపతి రచించిన ''ప్రద్యుమ్నాభ్యుదయం'' పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నానికి తేజస్సు నిచ్చిందని వీరీ వ్యాసంలో నిరూపించారు. పింగళివారి విమర్శనా పటిమను నిరూపించే గ్రంథాలలో ప్రముఖమైన వ్యాససంపుటి గౌతమ వ్యాసాలు.

## రేడియో ప్రసంగాలు

రెండు దశాబ్దాలకుపైగా పింగళి లక్ష్మీకాంతంగారు అధ్యాపకవృత్తి నిర్వహించారు. వందల కొలది విద్యార్థులు వారి పాఠప్రవచనా న్నాలకించారు. వారు విద్యార్థి దశలో ఎన్నో నాటకాలలో నటించారు. వేలకొలది ప్రేక్షకులు వారి గానామృతా న్నాస్వాదించారు. అయితే వారి పాఠ ప్రవచనం విద్యార్థుల వరకే పరిమితం. వారి గానమాధుర్యం వారి విద్యార్థి దశకే పరిమితం. అధిక సంఖ్యాకులైన ఆంధ్రులకు వారి వాణిని విని ఆనందించే అవకాశం ఆకాశవాణి ద్వారా చేకూరింది. విజయవాడ ఆకాశవాణి కేంద్రములో వారు సాహిత్య కార్యక్రమ ప్రయోక్తగా ప్రవేశించారు. ఎందరో కవిపండితుల ప్రసంగాలను రేడియోలో విన్పించారు. వారు గూడా ఎన్నో రేడియో ప్రసంగాలు చేశారు. సాహిత్య కార్యక్రమాలకు ఉపోద్ఘాతాలు చెప్పారు. సూక్తిముక్తావళి ద్వారా ప్రజలకు నీతివాక్యాల నందించారు. వారు గావించిన రేడియో ప్రసంగాలన్నీ 'నా రేడియో ప్రసంగాలు' అనే పేరుతో 1963లో ప్రచురణ నందాయి. వారి ముద్రిత రేడియో ప్రసంగాలు పందొమ్మిది. వాటిలో రెండు వ్యాసాలు గాంధీజీ ప్రవచనాలకు అనువాదం. 'బుద్ధుని ధర్మప్రచారం' ఢిల్లీ నుండి ప్రసారమైన ఆంగ్ల ప్రసంగానికి అనువాదం. భారతభారతి విజయవాడ రేడియో కేంద్రంలో ఒక కార్యక్రమానికి ఉపోద్ఘాత ప్రసంగం. తక్కిన పదిహేను ప్రసంగ వ్యాసాలు వివిధ సాహిత్య విషయ ప్రసంగాలు.

కాళిదాసుకు పూర్వమే సంస్కృత నాటక రచయితగా లబ్ధ ప్రతిష్ఠుడైన మహా కవి భాసుడు. భాసనాటక చక్రమని ఖ్యాతి గాంచిన రూపకాలన్నీ భాసునివేనా? అని సందేహించారు కొందరు పండితులు. 'భాసనాటకకర్తృత్వము' అనే ప్రసంగ వ్యాసంలో పింగళివారు ఆ రూపక సమూహ రచయిత భాసుడే

అని నిరూపించారు. భాసుని ఏకాంక నాటకాలలోని విశేషాలన్నింటినీ మరో ప్రసంగంలో వివరించారు. కాళిదాసుని గ్రంథాలలోని ప్రణయతత్త్వాన్ని గూర్చి, కాళిదాసు రచనలలోని ఆశ్రమజీవితాన్ని గూర్చి రెండు ప్రసంగ వ్యాసాలలో తెలిపారు. సంస్కృతాంధ్రకుమార సంభవ రచయితలైన కాళిదాస నన్నెచోడుల కవితా తారతమ్యాన్ని సోదాహరణంగా కాళిదాస నన్నిచోడుల కవితాసాదృశ్యంలో నిరూపించారు. 'ఆంధ్ర సాహిత్యంపై సంస్కృత మహాభారత ప్రభావం' అనే వ్యాసంలో ఆంధ్ర మహాభారతాన్ని నోరారా నుతించారు. ''ఈ భరత ఖండంలో ఏ దేశభాషలోను ఆంధ్ర మహాభారతము వంటి భారతము లేదు. ఆంగ్ల సారస్వత ప్రతిష్ఠకు ఒక షేక్స్పియర్ నాటక చక్రమే చాలినట్లుగా ఆంధ్ర సారస్వత ప్రతిష్ఠకు ఒక్క మహాభారతమే చాలును'' అని నిష్కర్షగా తెలిపారు. నాటక శరీర బంధం, ఆంధ్ర ప్రబంధము – ఉత్పత్తి, కావ్యము – కవిత్వము, భావము – ధ్వని, రసానుభూతి, పురాణము – ఇతిహాసము–కావ్యము అనే వ్యాసాలు ఏ ఒక్క గ్రంథానికో, కవికో పరిమితం కాక సాహిత్య తత్త్వాన్ని నిరూపించేవి. భక్తి – ప్రేమ అనే రెండు భావాల అవినాభావ సంబంధాన్ని సోదాహరణంగా వివరించిన వ్యాసం 'సన్నిహిత భావములు – భక్తిప్రేమ'. తనచిన్ననాటి చదువు ఎలా సాగిందో బాలబాలికల నుద్దేశించి ఆసక్తిదాయకంగా చేసిన ప్రసంగం 'నేను చిన్ననాడు చదివినవి'. ఆ నాటి వీధి బడులను శ్రోతల యెదుట సాక్షాత్కరించేటట్లు చేసిన ప్రసంగం ఇది.

ఇవి రేడియో శ్రోతల నుద్దేశించిన ప్రసంగవ్యాసాలు గనుక వ్యావహారిక భాషలో సాగక తప్పదు. శైథిల్యం లేని సరళత్వంతో సాగిన వ్యాసా లివి. సంస్కృతాంగ్ల భాషలలో వీరికిగల పాండిత్యం ఈ ఆంధ్ర వ్యాసాలలో అడుగడుగునా కన్పిస్తుంది. అయితే వీరి వ్యాసాలు సులభ సుందరరీతిలో సాహిత్యసారాన్ని అందించాయేగాని పాండిత్య భారంతో క్రుంగిపోలేదు. సాహిత్య శిల్ప సమీక్ష, ఆంధ్ర వాఙ్మయ చరిత్ర, గౌతమ వ్యాసాలతో సరిసాటియైన ప్రసంగాలు పింగళివారి రేడియో ప్రసంగాలు. ప్రసంగ సాహిత్యంలో సరిసాటిలేని మేటి ప్రసంగాలు పింగళివారి రేడియో ప్రసంగాలు.

ఇంతేకాక పింగళివారు విజ్ఞాన సర్వస్వంలోని తెలుగు సంస్కృతి సంపుటిలో తిక్కన, పెద్దన, సూరన కవీంద్రుల కవితా ప్రాశస్త్యాన్ని గూర్చి మూడు వ్యాసాలు వ్రాశారు. వారి ఆంధ్ర సాహిత్య చరిత్ర ఎంత ప్రామాణికమో వీరి ఈ వ్యాసాలు గూడా అంతే ప్రామాణికాలు.

లక్ష్మీకాంతంగారి పద్యరచన యెంత కమనీయమో, గద్యరచన అంత రమణీయం. వారు మహాకవులు గనుక వారి వచన రచన గూడ కావ్య భాషలోని కమనీయతను పుణికి పుచ్చుకున్నది. వారి వచన రచన ప్రౌఢం. వచన గమనం గజగమనం. సమత వారి గద్యలోని ప్రధాన లక్షణం. వారి కొన్ని వాక్యాలు సూత్రాల వంటివి. లక్ష్మీకాంతం గారి పద్యకవిత్వంలో శిల్పానుకూలమైన పదసంయోజన ఉన్నట్లు, వారి వచన రచనలో తీర్చిదిద్దిన పలుకుబడి గోచరిస్తుంది. సాహిత్య శిల్ప సమీక్ష, ఆంధ్ర సాహిత్య చరిత్ర, గౌతమ వ్యాసాలు గ్రంథాలలో వారి రచన ప్రౌఢ గంభీరం కాగా రేడియో ప్రసంగాలు వంటి రచనలలో సరళసుందరం. మొత్తం మీద పింగళివారి వచనరీతి లక్ష్మీకాంతం రీతి. అది ఒక ప్రత్యేక రీతి.

# 9. కాటూరి వారి ప్రత్యేక కృతులు

పింగళి కాటూరి కవులు జంటగా తొలకరి ఖండకావ్య సంపుటినీ, సౌందరనంద మహాకావ్యాన్నీ ప్రచురించారు. అంతటితో వారు జంట కవితకు స్వస్తి చెప్పారు. ఎవరి గ్రంధాలను వారే ప్రచురించుకున్నారు. పింగళివారు తన పేర ప్రకటించుకున్న ప్రత్యేక కృతులను గూర్చి వెనుకటి పరిచ్ఛేదములో ప్రస్తావించుకున్నాము. ఈ పరిచ్ఛేదములో కాటూరి వారి కమనీయ కావ్యాలను గూర్చి తెలుసుకుందాం.

కాటూరివారు స్వతంత్రంగా వ్రాసిన రెండు లఘు కావ్యాలు పౌలస్త్య హృదయం, గుడిగంటలు. ఈ రెండు కృతులనూ ఒకే సంపుటిగా ప్రచురిస్తూ, ప్రచురిస్తున్న ఈ రెండు కావ్యాలనూ తన అన్నయ్య రామకృష్ణయ్యకు అంకితమిస్తూ, తనను గూర్చి, తన కుటుంబాన్ని గూర్చి, తన గ్రామాన్ని గూర్చి ఆ రెండు కావ్యాలకంటె ఎక్కువ సంఖ్యలో పద్యాలు వ్రాశారు. నేను, మావాళ్లు–మా ఊరు, కృతి సమర్పణము అనే మూడు శీర్షికలలోని పద్యాలు మూడు తక్కువ వంద. ఇందులో మావాళ్లు–మా ఊరు శీర్షికలోని 85 పద్యాలలో 27 పద్యాలు వారి స్వగ్రామాన్నిగూర్చి చెప్పిన పద్యాలు. కాటూరివారు తన గ్రామదేవతకు సమర్పించిన నక్షత్ర మాల ఆ పద్యమాల. తండ్రి తర్వాత తండ్రి యంతటివాడైన అగ్రజుడు రామకృష్ణయ్యకు కృతి సమర్పణ సమయంలో సమర్పించిన పంచరత్నాలు 'కృతిసమర్పణము' లోని పద్యరత్నాలు. తన్ను గూర్చి చెప్పుకున్న పద్య సప్తకం 'నేను' అనే పద్యస్తబకం.

## నేను

ఏ కవియైనా తన స్వరూప స్వభావాలను వివరించడానికే ఈ శీర్షిక నెన్నుకుంటారు. ఈ శీర్షిక కవి స్వీయ చరిత్రకు నిలయం కావాలి. కాటూరివారి జంటకవన మిత్రులు పింగళివారు 'ఆత్మలహరి' శీర్షికతో కొన్ని పద్యాలు వ్రాశారు.

ఆ పద్యాల సంఖ్య గూడా స్వల్పమే అయినా ఇంతకంటే ఎక్కువే. ఈ శీర్షికలోని ఏడు పద్యాలలో వినయంపాలు ఎక్కువ. తాను గురుకృప వలన, పింగళివారి మైత్రి వలన కవిత చెప్పే శక్తి కొంత పొందానని వినయంగా విన్నవించారు. కవినామం దాల్చినందుకు ఈశ్వరస్తవంగాని, స్వీయ వంశప్రశస్తిని గాని చేయజాలనందుకు ఎంతో విచారించారు.

**''చేసి యెఱుంగ దేవతల సేవలు, తీర్థము లాడ, క్షేత్రసం**
**వాస మొనర్ప, విప్రుల సపర్య లొనర్పను, పైతృకమ్ము శ్ర**
**ద్ధా సహితుండనై సలుప, దానము ధర్మ మెఱుంగ, సంజకున్**
**దోసిలియొగ్గఁనెన్నడు అధోగతికే చెయిసాచుదున్ సదా''**

తన జీవిత పూర్వభాగం ఇలా పూర్వాచార పరాయణత్వానికి భిన్నంగా, దైవభక్తికి దూరంగా గడచిపోయినందుకు విచారిస్తూ భద్రాద్రి రామ దర్శన సమయంలో ఇలాంటి పద్యాన్నే చెప్పారు. ఆ పద్యం 'పన్నీటి జల్లు' ఖండికా సంపుటిలో ప్రచురితం. భగవంతుడు తనకు కులము, విద్య, రూపము, కలిమి అనే నాలుగు లక్షణాల ననుగ్రహిస్తే తాను వెంగలియై అన్నిటినీ కలుషిత మొనర్చుకున్నానని ఆవేదన చెందారు. అప్రయత్నంగా తనకు లభించిన కవన లేశాన్ని తన వంశ కథనానికి వినియోగించి పితౄణభారాన్ని వదలించుకుంటానని తన వంశగాథా వివరణకు పూనుకున్నారు. కాటూరివారు సద్గుణులు గనుక, వినయశీలురు గనుక ఇలా చెప్పుకున్నారు గాని వా రధోగతిలో ఎన్నడూ లేరు. సహృదయ హృదయానంద సంధాయియైన కవితలల్లిన వ్యక్తికి సద్గతి తప్ప అధోగతి యెక్కడిది?

కాటూరివారు గురువుల కృపవలన త్రిభాషావేత్తలైనారు. వారి వివిధ రచనలే వారు సంస్కృతాంధ్రాంగ్లాలలో నిష్ణాతు లనడానికి సాక్ష్యాలు. ఆ విషయాన్ని వారెంత వినయంగా చెప్పుకుంటారో గమనించండి.

**''ఆంధ్ర గీర్వాణ కవిరాజు, లాంగ్లసుకవు**
**లల రవీంద్ర కవీంద్రుఁడు సలుపు గావ్య**
**కుసుమమాలలు దలఁదాల్చుకొనెడు పాటి**
**సరసత ఘటిల్లెఁ జాలు నీ జన్మమునకు''**

వారు గీర్వాణ గ్రంథాల ననువదించారు. ఆంగ్ల గ్రంథాల నాంధ్రీకరించారు. ఆంధ్రభాషలో సద్గ్రంథాలను వెలయించారు. రవీంద్ర కవీంద్రుని కవిత లాస్వాదించి మురిసిపోయారు. గాంధీ అడుగుజాడలలో నడచి యాత్మతృప్తి నందిన విషయం ఈ పద్యంలో చెప్పకపోయినా తక్కిన రచనల ద్వారా తెలుస్తున్నది. ఇట్లు తృప్తినందిన సంతృప్త జీవనులు కాటూరి వేంకటేశ్వరరావు గారు.

## మావాళ్లు

కాటూరివారు తన వంశస్థులను గూర్చి వ్రాసిన ఖండిక మావాళ్లు. 'నేను' ఖండికలో కాటూరివారు తనను గూర్చి సూచనామాత్ర పరిచయం గావించుకున్నారు. మావాళ్లు ఖండికలో తనవాళ్ల నందరినీ భక్తిభావంతో పూజించారు. కాటూరివారు తన అన్న రామకృష్ణయ్యను మిన్నగా భావించారు. తండ్రి తర్వాత తండ్రి యంతటి వాడని తలంచారు. వారికి తన కృతి ద్వయాన్ని అంకితమిస్తూ, ఆ వంకతో తన వంశవర్ణన గావించారు.

తన వంశదీపకుడైన ఎఱ్ఱనను, ఉన్నంతలో గుట్టుగా, సంతృప్తిగా జీవనం సాగించిన ముత్తాత వెంకటరెడ్డిని, ముత్తవ్వ అనంతమ్మను, త్యాగ,. భోగాలతో సన్నుతి కెక్కిన తాత శంకరయ్యను, రామాలయంలో రామాయణ భారత కథలను గానం చేసే తన పినతాత (దత్తు తండ్రి) కొండయ్యను, తన బాల్యంలోనే మరణించిన తండ్రి వేంకటకృష్ణయ్యను, తండ్రి కన్న మిన్నగా భావించిన అన్న రామకృష్ణయ్యను, సాధువర్తనుడైన తమ్ముడు శంకరయ్యను, చిన్నతనంలోనే భర్తను కోల్పోయి పుట్టింటికి చేరిన తన తాతల చెల్లెలు సీతమ్మను, కన్నతల్లి రామమ్మను, పెంచిన తల్లి లక్ష్మమ్మను, పిల్లనిచ్చి అత్తయైన అక్క రత్నమ్మను - ఇలా దాదాపు తన వంశస్థులందరినీ నుతించారు. కాటూరి వారి స్వవంశగానం వలన వారి పూర్వీకు లెంతటి సద్గుణ సంపన్నులో తెలుస్తుంది. ఉమ్మడి కుటుంబ వ్యవస్థలోని ఆత్మీయత లెంత గొప్పవో తెలుస్తుంది.

ఎఱ్ఱాప్రగడ కాటూరి వంశదీపకుడని కాటూరివారు స్తుతించారు. ఎఱ్ఱాప్రెగడ స్వస్థలం గుడ్లూరు. అద్దంకి ప్రభువు వేమారెడ్డి కాలంలో ఎఱ్ఱాప్రెగ్గడ గుడ్లూరు నుండి గుండ్లకమ్మ నదీతీర గ్రామమైన చదలవాడ చేరారు. కొన్ని శతాబ్దాల తర్వాత ఆ కవీంద్రుని వంశం వారు చదలవాడ గ్రామం వదలి కృష్ణాజిల్లాలోని కల్పటం చేరారు. అక్కడ కొన్ని తరాలు గడిపిన తర్వాత ఎఱ్ఱన

వంశస్థులు కాటూరు వెళ్లారు. నూజివీడు ప్రభుని అనుగ్రహంతో కాటూరు గ్రామణికత్వాన్ని పొందారు. అప్పటినుండి వారు కాటూరు వా రయ్యారు. ఈ వంశస్థులలో పేరు గాంచిన వ్యక్తి వేంకటరెడ్డి. వేంకటరెడ్డి పేరులోని రెడ్డి కుల సూచకం కాదు. గ్రామణికత్వ సూచకం. పుణ్యచరితుడైన వేంకటరెడ్డి ''హలమ్మును గలమ్ము నూని కాలమ్ము ద్రో'' చిన వ్యక్తి. కరణీకంతో వచ్చే ఆదాయం అంతంత మాత్రం. ''కరువు కాటకముల'' వల్ల వ్యవసాయంలో ''ఫలసాయం'' రాలేదు. కష్టాలను తట్టుకోగల ఓర్పు, ఉన్నంతలో సర్దుకుపోయే నేర్పు గలవాడు కావడం వలన వేంకటరెడ్డి ఏదో ఒక రకంగా కాలం గడిపాడు. ఆ విషయాలను వివరిస్తూ కాటూరివారు

**''ఎండల కెండి, వానలకు నెట్టిటులో తలయొగ్గి, క్షేత్రముల్**
**పండిన వేళలన్ దినుచుఁ, బండనిచో నొకప్రొద్దు లుండుచున్**
**నిండిన పాడికుండలు, ననింద్య చరిత్రము, పాలికాఁపు చిం**
**తండును, బక్కటిద్దు జత దన్ బ్రదికింపఁగ నెట్టెఁగాలమున్''**

అని వ్రాశారు. ఎండవానలను భరిస్తూ, ఉన్నప్పుడు తింటూ, లేనప్పుడు పస్తులుంటూ వేంకటరెడ్డి కాలం నెట్టుకొచ్చినట్లు కాటూరివారి కథనం. కాలం నెట్టటం అనే పదబంధం భావభరితం. దారిద్ర్య స్థితికి సూచకం. పాలికాపు చింతడు, బక్కటెద్దుల జత ఆయనను బ్రతికించాయని చెప్పడం కాటూరి వారి కృతజ్ఞతా బుద్ధికి చక్కని ఉదాహరణ.

వేంకటరెడ్డి వేంకటేశ్వరరావు గారి ముత్తాత. వేంకటరెడ్డిగారికి ఇద్దరు కుమారులు. ఇద్దరు కుమార్తెలు. ఇద్దరు కుమారులలో పెద్దవాడు శంకరయ్య. రెండవ కొడుకు కొండయ్య. కొండయ్య అనపత్యుడు. పెద్ద కుమారుడైన శంకరయ్య పుత్రుడు వేంకటకృష్ణయ్య. వేంకటకృష్ణయ్యకు ముగ్గురు పుత్రులు. రామకృష్ణయ్య, వేంకటేశ్వరరావు, శంకరయ్య. ఈ ముగ్గురిలో రెండవవాడైన వేంకటేశ్వరరావును సంతు లేని కొండయ్య దత్తపుత్రుడుగా స్వీకరించాడు. ఈ వేంకటేశ్వరరావే ఈ గ్రంథకర్త. గ్రంథకర్తయైన కాటూరి వారు తన కుటుంబ సభ్యుల నందరనూ – పెద్దలను, పిన్నలను – భక్తితో ప్రస్తుతించారు. రక్తితో ప్రశంసించారు.

కాటూరి వారి తాతలు శంకరయ్య, కొండయ్యలు. వారిరువురు ఇంద్రో పేంద్రుల వంటి వారట! వారి యన్యోన్యతను కాటూరి వారు మిక్కిలి గొప్పగా ప్రశంసించారు. వారెద్దరూ ఒకే ఇంట్లో వుంటారు. ఒకే ఇంట్లో తింటారు. కాని

సహ పంక్తిలో కాదు. ఒకరితో మరొకరు మాటాడుకోరు. తమ్ముడంటే అన్నకు అమిత ప్రేమ. అన్న అంటే తమ్ముడికి అమిత గౌరవం. ఎంత గౌరవమంటే - ''అరువదేండ్ల యీడున గూడ నన్న కెదురు బలుకుటకు, నన్న చెంగట నిలుచుటకును జంకునంత'' ''అరమరలు లేని సౌదర్య మమరె నిజము'' అని ఆ అన్నదమ్ముల అనురాగాన్ని కాటూరి వారు అభినందించారు.

శంకరమంత్రి సర్వసద్గుణ సంపన్నుడు. అతని సత్పుత్రుడు వేంకట కృష్ణయ్య. కాటూరి వారి కన్నతండ్రి కాటూరి వారికి ఊహ వచ్చిరాకముందే తనువు చాలించటం వారి కుటుంబానికి దుఃఖకారణం. కాటూరి వారికి తన తండ్రి రూపం కొంతకు కొంత మాత్రమే గుర్తు. ''అనాతంకధృతి, రమ్యకృతి, నకలంక శుభాకృతి'' యని అలంకారమయ వాక్యాలతో జనకుని స్తుతించటం,

**''మేలిమిపైడి కీడయిన మేని పసల్, పరిపూర్ణ చంద్రునిన్**
**దేలిక సేయు నెమ్మొగము తీరు, వెడంద యురమ్ము సౌరు, మో**
**కాళుల కాను కేలుగవ, క్రాల్గనులున్, జెవిదాఁకు మూపులున్**
**బోలఁగ జూచి తండ్రి శుభమూర్తి గణింతురు రేల నాల్మగల్''**

అని తండ్రి రూపాన్ని రమణీయంగా వర్ణించటం కనుకలి వలన కంటె వినుకలి వలననే. బంధువులందరు గొల్వగా పెండ్లికి వెళ్ళినట్లు వేంకటేశ్వరుని సేవించడానికి తిరుపతి వెళ్లిన వేంకటకృష్ణయ్య స్వామి సన్నిధిలోనే తనువు చాలించాడు.

**''అన్న కెనిమిదేఁడు, లనుజుండు చంటివాఁ**
**డమ్మగోడు చెప్ప నలవి కాదు;**
**కొండపైకిఁజేదికొన్న వేంకటసామి**
**కుతల మందు మమ్ముఁగూలఁద్రోచె''**

నని తండ్రి మరణానికి కాటూరివారు ఎంతో దుఃఖించారు. అంత దుఃఖంలోనూ చివరి రెండు పాదాలలో చమత్కారాన్ని సాధించారు. తండ్రిని కొండపైకి చేదుకొన్న స్వామి తమ కుటుంబాన్ని అగాధంలో త్రోసివేసినట్లు చమత్కృతి.

తండ్రి మరణానంతరం, పూప వయస్సులోనే కరణీకంతో పాటు కర్షణ భారం వహించిన తన అగ్రజుడు రామకృష్ణయ్యపై కాటూరివారి కెంతో గౌరవం. అన్నను స్తుతిస్తూ, వీరు చెప్పిన పద్యాలన్నీ రామకృష్ణయ్య సద్గుణాలను నిరూపించే పద్యాలు మాత్రమే కాదు. ఆ అన్నపై ఈ తమ్మునికున్న అమితమైన గౌరవాన్ని నిరూపించే పద్యాలు కూడా.

**''లేకితన మ్మెఱుంగఁ, డవలేపవిదూరుఁడు, రాజకార్య సం**
**ధాకుశలుం, డతంద్రమతి, ధర్మవిదగ్రణి, త్యాగభోగ సు**
**శ్రీ కలితుండు, నార్యనుత శీలి, సమానులలోన నుత్తమ**
**శ్లోకుఁడు, సాహితీరసవశుండగు కృష్ణుఁదలంతు నగ్రజున్''**

రామకృష్ణయ్యగారు పూడిపోయిన తాతలనాటి చెరువును మరలా త్రవ్వించారు. భీమేశ్వరాలయాన్ని పునర్నిర్మించారు. అర్తుల కాదరువై రక్షించారు.

ఇలా అన్నను ఏడెనిమిది పద్యాలలో ప్రస్తుతించిన కాటూరివారు తన తమ్ముడైన శంకరయ్యను కూడా ఆశీర్వాదపూర్వకంగా రెండు పద్యాలలో అభినందించారు. శంకరయ్య గూడా చిన్నతనంలో కుటుంబ భారాన్ని పైనిడుకొన్న యుదారమూర్తియట! సాధువర్తనుడు, సత్యవ్రతుడు, ధర్మపరుడు, వినయగుణుడు నైన శంకరయ్య తమ సోదరులు ముగ్గురిలో గుణాధికుడై, గణన కెక్కాడని, అట్టి తమ్మునికి శుభాలు చేకూరాలని కాటూరివారు కోరుకున్నారు.

కాటూరివారు తన పూర్వీకులలో పురుషులతో సమానంగా స్త్రీలను గూడా వర్ణించారు. ఉమ్మడి కుటుంబాలు స్త్రీల ఓర్పుకు పరీక్షా స్థానాలు. చిన్ననాడే భర్తను కోల్పోయిన దురదృష్టవంతురాలు వేంకటరెడ్డి కుమార్తె సీతమ్మ. పుట్టింటికి చేరిన సీతమ్మ కొన్ని తరాల పాటు పుట్టింటి వారందరికీ సేవ చేసింది.

**''తండ్రి తరమున, నన్నల తరమునందు,**
**మేనయల్లుని తరమున, మేనయల్లు**
**తనయులము మా తరమ్మునఁదాన యింటఁ**
**బెద్దతనమూని సీతమ్మ బిద్దనేర్చె''**

ఇలా సేవచేసినందుకు సీతమ్మను స్తుతించారు కాటూరివారు. సీతమ్మ సోదరుని భార్య లక్ష్మమ్మ. వేంకటేశ్వరరావు గారి దత్తు తల్లి ఆమె. ఆమె ఓర్పును నుతిస్తూ వేంకటేశ్వరరావుగారు

**''బావ తరమునఁ, దత్తనూభవుని తరము**
**నందు, మా తరమునయందు నాడుబిడ్డ**
**యైన సీతమ్మ పెత్తన మనుమతించి**
**నిండుమనసున లక్ష్మమ్మ నెగడు టెంతు''**

అని అన్నారు. అంటే వీరిద్దరూ ఎంత అరమరికలు లేకుండా ఉమ్మడి కుటుంబములో జీవనం సాగించారో అర్థం చేసుకోవచ్చు.

కాటూరి వారికి కన్నతల్లి పైన, పెంచిన తల్లి పైన ఇద్దరిపైన భక్తి భావమే. 'అమ్మా' అని పిలిస్తే పెంపుడు తల్లి కొండెక్కినంత సంతోషపడుతుందట! అమ్మా! అని పిలిస్తే తననే అనుకొని వచ్చిన కన్నతల్లి తనను కాదని తెలుసుకొని బాధపడుతుందట!

**''ఇతఁడు దత్తుఁ డగుట నెపుడైన 'అమ్మా'యు**
**టంచుఁ, బిలిచినంత నరుగుదెంచి**
**'నిన్నుగా' దనంగ నిలువున నీరౌ మ**
**దంబఁదలచి యిపుడు నలమటింతు''**

నని కాటూరివారు విచారపడ్డారు. 'ఒరుల మేలునకై చెమరించి సానపై జందన ఖండమై మనిన సాధ్వి మదంబకు నీడు వత్తురే?'' అని వారి మాతృ ప్రశంస. ఇంతగా ఉమ్మడి కుటుంబములోని స్త్రీల జీవితాన్ని వర్ణించిన కాటూరివారు ఉమ్మడి కుటుంబంలోనే జీవిస్తున్న తన భార్యను గూర్చి మాత్రం వ్రాయనేలేదు. తనను గూర్చి వ్రాసుకున్నదే తక్కువ. అయినా తనను గూర్చి తన భార్యను గూర్చి కాక తన వంశంలోని తక్కినవారిని గూర్చి మాత్రమే వారు వర్ణించదలచు కోవడం ఇందుకు కారణం కావచ్చు.

కాటూరివారు స్వర్గస్థుడైన తన సోదరుడు రామకృష్ణయ్యకు తన గ్రంథద్వయాన్ని అంకితమిచ్చారు. స్వర్గస్థుడైన తండ్రికే అంకిత మీయవచ్చు కదా! తన తండ్రి తన తెలిసీ తెలియని వయస్సులో మరణించాడు. ఉమ్మడి కాపురం పెత్తనం వహించి సంసారా న్నీదిన వ్యక్తి అన్న రామకృష్ణయ్య. అందుకే భ్రాతృౠణ భారం తొలగించుకోవడానికే ఈ అంకితమని చెప్పుకున్నారు.

**''నేరఁడు మంచి చెడ్డలు, గణింపడు గీమునఁగష్టసౌఖ్యముల్**
**వీతిఁడియ్యై సదా తిరుగు వీఁడని రోయక, నన్ను, మత్ర్పజన్**
**గూరిమి నోమె; అగ్రజునకుం దుద కిచ్చితి నిష్కరాగ్ని సం**
**స్కారము; నింక నా యొసఁగఁజాలిన దొక్క కృతి ప్రదానమే''**

**''ఆలుంబిడ్డలు, పైరుపచ్చలనకే 'యాగమ్మకాకిం' బలెన్**
**గాలిచ్చం దిరుగాడు దుర్వ్యసని నాకై యెంత చింతించెనో**

**లోలో, నెన్నఁడు నొవ్వనాడఁడు, దయాళుండై ననుంబ్రోచె: స
చ్ఛీలుం డన్నకు నీ కృతిద్వితయమున్ జేమోడ్చి యర్పించెదన్''**

తన కృతి ద్వితయాన్ని అన్న ఋణం తీర్చుకోవడానికి అంకితమిస్తూ కాటూరి వారు చెప్పిన పద్యాలలో ఈ పద్య ద్వితయం ఈ అన్నదమ్ముల స్వభావాల కద్దం పడుతున్నది.

కవిత్వమనీ, సభలనీ దేశమంతా తిరుగుతూ కుటుంబ భారాన్ని పట్టించుకోనివారు కాటూరివారు. సంసారాన్ని పోషిస్తూ, తమ్ముడికి ఏమాత్రం కష్టం కలగనీయని వారు కాటూరి వారి అన్నగారు. అందుకే అంత భక్తితో అంకితం గావించడం.

## గ్రామీణ జీవనం

మావాళ్లు, మా ఊరు అని కాటూరి వారు తన వంశ ప్రశస్తికి పెట్టిన పేరు. 'మావాళ్లు'లో వారి వంశంలోని స్త్రీ పురుషులలో తనకు నచ్చిన వారి నందరిని నుతించారు. వారి వారి స్వరూప స్వభావాలను సహజ సుందరంగా వర్ణించారు. అంతటితో ఆగక వారి గ్రామాన్నీ, ఆ గ్రామంలోని వివిధ వృత్తుల వారినీ వినుతించారు. ఈ ఖండికలో వారి గ్రామాన్ని గూర్చి వారు వర్ణించిన విశేషాలు కాటూరు గ్రామానికి మాత్రమే పరిమితం కాదు. ఆనాటి పల్లెటూళ్లన్నిటిలో కన్పించే విశేషాలే.

తూర్పు కృష్ణా జిల్లా ప్రస్తుతం మాగాణి ప్రాంతం. కాని కాటూరి వారి తరానికి ముందు తరంలో – విజయవాడ వద్ద కృష్ణానదికి ఆనకట్ట కట్టకముందు – కృష్ణా జిల్లా పూర్తిగా మెట్టజిల్లా. వర్షాధారంగా పండిన పంటలే వారికి జీవనాధారం. అతివృష్టి, అనావృష్టి రెండూ వారికి బాధాకరమే. అతివృష్టి వలన పచ్చికరువు, అనావృష్టి వలన ఎండుకరువు. పచ్చి కరువు వచ్చిన రోజుల్లో ఆ ప్రాంత ప్రజలు ఎలా జీవించారో ఒక పద్యంలో వివరించారు.

**''గుమ్మడి పండులన్ గుడము గూరిచి వండియుఁ, దాటిపండులన్
గుమ్మునఁగాల్చియున్ మెసవి, గోగులు, దొగ్గలి, చింతయాకు శా
కమ్ములు, జొన్నయన్నమును, కమ్మని మజ్జిగ తోడుగా అనం
తమ్మ కుటుంబమున్ గడపెఁదాళ్మియె సర్వముఁజక్కబెట్టఁగన్''**

గుమ్మడి కాయతో చేసిన ప్రత్యేక వంటకం, కుమ్ములో కాల్చిన తాటిపండ్లు, జొన్నన్నం, గోంగూర, దొగ్గలి ఆకు, చింతాకులతో వండిన కూరలు - ఇవి పచ్చికరువు రోజుల్లో ఘనాహారం. కమ్మని మజ్జిగ ద్రవాహారం. ఇది కాటూరి వారి ఇంట్లో వాళ్ల ముత్తవ్వ అనంతమ్మ పెట్టిన ఆహారం మాత్రమే కాదు. ఆరోజుల్లో అందరి ఆహారం అదే.

కాటన్ దొరగారి పుణ్యమా అని కృష్ణా, గోదావరి నదులపై ఆనకట్టలు వెలిశాయి. ఆనకట్టల వలన ఆయా ప్రాంతాలలో పాడిపంటలు పుష్కలంగా వెలిశాయి. పుష్కలమైన పాడిపంటల వలన ప్రజల స్థితిగతులలో ఎంతో మార్పు వచ్చింది. అధోగతి నుండి పురోగతి.

**''ఎఱడాల్ బియ్యము వోయి రాజనము లాయెన్ భుక్తి, పూరింటికాం**
**పురముల్ వోయెను, మండువాల భవనమ్ముల్ మన్కి కాయెన్, జలా**
**హరణక్లేశము వాసి యాంధ్రకుఁబెరళ్లం దబ్బెఁగూపాంబువుల్**
**సరసాంతఃకరణావధిన్ బొగడఁగా శక్యంబె కృష్ణానదిన్''**

మెట్ట వరి బియ్యం పోయి రాజనాల వంటి బియ్యం లభించాయి. పూరిళ్లు మండువా లోగిళ్లుగా రూపొందాయి. పెరట్లోనే నూతులు ఏర్పడడం వలన స్త్రీలకు నీళ్లు దూరం నుండి తెచ్చుకునే శ్రమ తప్పింది. కృష్ణవేణి ఎప్పుడూ కరుణాంతః కరణయే. ఆనకట్ట వలన కలిగిన సౌకర్యాలివి. ఆనకట్ట దగ్గర ఆగిన కృష్ణను కాటూరివారు చమత్కారంగా వర్ణించారు.

**''అంతట నింద్రకీలగిరి యంఘ్రి సమీపమునందు మేటి ధీ**
**మంతులు హూణపాలకు లమర్చిన సేతువు హేతువై దిశా**
**భ్యంతర పూర్ణ వీచి నిచయార్భటి నాథుని జేరు కృష్ణ కొ**
**క్కింత విలంబనమ్ము లభియించెను వేణిక లల్లికొంటకున్''**

నదులన్నీ సముద్రంలో సంగమిస్తాయి. అందుచేత నదులకూ, సముద్రునికీ గల సంబంధాన్ని భార్యాభర్తల సంబంధంగా భావించారు పూర్వులు. భర్త చెంతకు చేరడానికి తొందరపడుతున్న స్త్రీ జడ సరిగా ఉందో లేదో చూసుకోవడానికి ఒక క్షణం ఆగిన దృశ్యంతో ఆనకట్ట చెంత ఆగిన కృష్ణానదిని పోల్చి వర్ణించారు కాటూరి వారు. ఇది చివరి రెండు పాదాలలోని రమణీయమైన భావం. మొదటి రెండు పాదాలలో ఆనకట్ట నిర్మించిన ఆంగ్లేయుల నభినందించారు. కాటూరివారు జాతీయవాది. అయినా ఆంగ్లేయులు చేసిన సత్కార్యాల నభినందించడానికి వారి జాతీయవాదం అభ్యంతరం కాలేదు.

కాటూరివారు తన గ్రామాన్ని వర్ణించిన పద్యాలన్నీ స్వభావోక్తి సుందరాలే. ప్రభాత సమయంలో మేల్కాంచే తన పల్లెటూరును వారు వర్ణించిన పద్యం ఎంతో మనోహరం. సరసహృదయమున్న ప్రతి వ్యక్తీ కాటూరివారి కవి హృదయాన్ని మెచ్చుకొని తీరుతారు.

**''తొలికోళ్ల యెచ్చరింతల రెక్క లల్లార్చి**
**మలుకోళ్లగములు మాటెలుఁగు సూప**
**మునుమున్న మేల్కన్న ముదియవ్వ కదురు ఝుం**
**కృతి సుతిగా నూలికృతులు వాడఁ**
**గరకంకణధ్వనుల్ కవ్వంపుఁజప్పళ్లు**
**బెరయఁగా నిల్లాండ్రు బెరుగు దరువఁ**
**బులుగుల కలకలమ్ములతోడఁగలయంపి**
**సవ్వడుల్ తీయనై సందడింప**
**మోటగిలకల రవళితోఁదోఁటలకును**
**జలముతోడు బలీవర్దములను గాఁపు**
**లదలుపన్ మోకు జవ్వాట లాలకించు**
**చల్లన న్మేలుకాంచు మా పల్లెటూరు.''**

తొలికోళ్లు మలికోళ్లు కూస్తున్నవి. ముసలమ్మలు రాట్నం వడుకుతూ పాటలు పాడుతున్నారు. పక్షుల కిలకిలారావాలతో స్త్రీలు చల్లే కళ్లాపి చప్పుళ్లు కలిసిపోతున్నవి. పెరుగు చిలికే ఇల్లాండ్ర గాజులమ్రోతతో కవ్వపుమ్రోత కలిసిపోతున్నది. మోట తోలుతూ కాపులు ఎడ్ల నదిలిస్తున్న ధ్వనులకు మోట గిలకల ధ్వనులు తోడవుతున్నవి. ఈ హడావిడికి పల్లె మేలుకొంటున్నదని చమత్కారం. పల్లె పట్టులను మేలు కొలిపేవి పైడి కంట్లు అనే పక్షుల కూతలు, ఆబెయ్యల అంబారవాలు కూడా.

ఇలా మేల్కొన్న పల్లెలలో నాలుగు కులాలవారూ వరుసలు పెట్టి పిలుచుకుంటూ, పరస్పరం సహకరించుకుంటూ ఆనందంగా జీవితం గడుపుతున్నారు. కాటూరివారు నాగరికత పల్లెటూళ్లలో తెచ్చిన పెనుమార్పులను గమనించారు; విచారించారు. తన విచారాన్ని కవితా రూపంలో వ్యక్తీకరించారు. కష్టసుఖాలలో, కలిమి లేములలో ఆనాటి పల్లెప్రజలు పరస్పరం సహకరించు

కొనేవారు. ''నేటి యన్నల కెడమొగాల్ పెడమొగాలు వచ్చి పడియె నెట్లు?'' అని వారి వేదన.

**''పల్లె బ్రతుకుల మాధుర్య మెల్ల విఱిగి**
**పంచకోల కషాయ ముప్పతిల నేల?''**

అని వారి ఆవేదన. ఎవరి వృత్తి వారు చేసుకుంటుంటే, ''ఎల్లవృత్తులను నుమ్మడి యూటగ'' సౌఖ్యాన్ని పెంచాయి. పండిన పంట ఊరు దాటి యెరుగదు. పేదలు పస్తులుండగా ధాన్యం ఎవరూ అమ్మలేదు. కలవారి పాడికుండ లుండగా పేదలకు మజ్జిగ కరువు ఉండేది కాదు. కమ్యూనిజం అనే పేరు వినకపోయినా సంఘానికి మేలు చేసే పనులు చేసేవారు. ఇతరుల కివ్వటమే భోగంగా, పదిమందిలో పలచన కావటం కొరత పడటంతో సమానంగా ఆ నాటి గ్రామ ప్రజలు భావించేవారు. అన్ని వృత్తులు సమానమే వారి దృష్టిలో. మంచివారిని పురస్కరించేవారు. అన్యాయార్జిత విత్తాన్ని తిరస్కరించేవారు. దైవాన్నీ, సత్యాన్నీ విశ్వసించేవారు. అట్టి సజ్జనులను విస్మరింపని విజ్ఞాని కాటూరివారు. ఆనాటి రచ్చబండలపై కొలువుదీర్చే ఊరి పెద్దలను ఎంతగానో నుతించారు.

అయితే కాటూరి వారి కాలంలో ధర్మం నాలుగు పాదాలా నాట్యమాడిందా? అధర్మపరులు అసలు లేనే లేరా? ఉన్నారు. ఉన్నారన్న విషయం కాటూరివారికి తెలియదా? తెలుసు. అయితే అప్పటికీ ఇప్పటికీ తేడా వుంది.

**''నాఁడును గల్లు ద్రావిరి, ధనమ్ములు ముచ్చిలి, రన్యదారలన్**
**గూడిరి కాని పాపమను కొంకును, పొక్కునొ యన్న భీతి వె**
**న్నాడెను వారి; నియ్యదన నట్టి భయ మ్ముడివోయి, చప్పగా**
**నూడెను సిగ్గు, పాపరతు లూర్జితులై విహరింతు రిచ్చమై''**

అప్పుడు కల్లు త్రాగారు. పరుల సొత్తు కాజేశారు. అన్యకాంతలతో సంబంధాలు పెట్టుకున్నారు. కాని తాము చేస్తున్నది పాపమనే భయం వుండేది. బయటపడుతుందేమో నన్న భీతి ఉండేది. ఇప్పుడు భయం లేదు. సిగ్గు ఎగ్గూ లేదు. పాపరతులే ఎక్కువ ధీమాగా వుంటున్నారు. జారులు, చోరులకు గౌరవ మిచ్చేవారు గూడా ఎక్కువయ్యారు.

ఇలా కాటూరివారు తనను గూర్చి, తన వాళ్లను గూర్చి , తన గ్రామాన్ని గూర్చి చక్కగా వర్ణించారు.

"గత కాలము మేలు వచ్చుకాలము కంటెన్" అన్న నన్నయ్య భావాన్ని వారు సమర్థించడాన్ని అభ్యుదయవాదులు సమర్థించకపోయినా వారి ఋజు స్వభావాన్ని సన్నుతి సేయక తప్పదు ఈ ఉపోద్ఘాత కావ్యంలో కాటూరివారు గ్రామీణ జన జీవనాన్ని సహజంగా వర్ణించారు. సంస్కృతాంధ్ర పద సమ్మిళితమైన సుందర సుకుమార శైలిలో వర్ణించారు.

## పౌలస్త్యహృదయము

కాటూరి వారు రచించిన లఘుకావ్యం పౌలస్త్యహృదయం. ముప్పై తొమ్మిది పద్యాల ఈ ఖండకావ్యం కాటూరి వారికి అఖండ కీర్తి నార్జించి పెట్టింది. నిజాని కీ కావ్యం రూపంలో సన్నదైనా కవితా దీపంగా మిన్న యైనది. ఇతర సామాన్య కావ్యాల కంటె ఈ కావ్యం భిన్నం. వస్తుస్వీకరణలో, వస్తు నిర్వహణలో ఈ కావ్యం ప్రత్యేకతను సంతరించుకున్నది.

ఈ కావ్య కథావస్తువు రామాయణము. అయితే రామాయణంలో రామునికి ప్రాధాన్యం. పౌలస్త్య హృదయంలో రావణునికి ప్రాధాన్యం. రామాయణంలో రావణుడు దుర్మార్గ ప్రతినాయకుడు. పౌలస్త్య హృదయంలో రావణుడు ఉదాత్త ప్రతినాయకుడు. రామాయణ పఠన సమయంలో సీతారాముల కష్టాలకు కన్నీరు కారుస్తాం. పౌలస్త్య హృదయ పఠన సమయంలో వైకుంఠవాసం కోరి వైకుంఠధాముని రాక కోసం ఎదురుచూస్తున్న రావణుని బాధను చూసి బాధపడతాం. రావణుడు వైకుంఠవాసం కోరటమెందుకు? విష్ణు నివాసం అయిన వైకుంఠమే అతని నివాసం గూడా కనుక.

వైకుంఠ ద్వారపాలకులు జయవిజయులు. సనక సనందాదుల శాపం వలన వారు భూలోకంలో రాక్షస జన్మల నెత్తవలసి వచ్చింది. శత్రుభావంతో మూడు జన్మలెత్తిన తరువాత తిరిగి వైకుంఠధామాన్ని చేరగలరని విష్ణుమూర్తి వరం. తొందరగా ఈ జన్మలను ముగించుకొని వైకుంఠధామం చేరాలని జయవిజయుల కోరిక. రావణ కుంభకర్ణులు రెండవ జన్మ నెత్తిన జయవిజయులు. రావణుడు చేసే దుర్మార్గాలన్నీ రాముని చేతిలో మరణాన్ని కోరే. ఈ దృష్టితో ఆలోచిస్తే రావణుడు దుర్మార్గుడు కాక మరేమౌతాడు? వైరంతో జీవించవలసి వచ్చినవాడు దుష్కృత్యాలు చేయకుండా ఉండడం ఎలా?

వాల్మీకి రామాయణంలో రావణుడు శ్రీరాముని విష్ణువు అవతారంగా భావించినట్లు సూచన లేకపోలేదు. ఈ సూచన నందుకొని అధ్యాత్మ రామాయణం, రంగనాథ రామాయణం, భాస్కర రామాయణం, ఉత్తర రామాయణం, గోపీనాథ రామాయణాలలో రావణుడు వైకుంఠధాముడైన రాముని రాక కోసం, అతని చేతిలో మరణం కోసం ఎదురు చూస్తున్నట్లు వర్ణించటం జరిగింది. ఆ గ్రంథాలలోని రావణుని స్వభావానికి రమణీయ కవితా రూపమే పౌలస్త్య హృదయం.

భావన రెండు రకాలు. సంప్రదాయ సిద్ధ భావన, సంప్రదాయ విరుద్ధ భావన. రామాదులు ధర్మమూర్తులని సంప్రదాయ సిద్ధ భావన. రావణాదులలో సద్గుణాలు లేకపోలేదని సంప్రదాయ విరుద్ధ భావన. ఈ భిన్న భావన కాధారాలు ఆ గ్రంథాలలో ఎక్కడో ఒకచోట చేసిన సూచన. ఆ సూచన ఆధారంగా సంప్రదాయ భిన్న భావనతో కొందరు కవులు గావించిన రచనలు లోకంలో ప్రసిద్ధి గాంచాయి. భాసమహాకవి యజ్ఞఫల నాటకంలో కైకేయిని ఉత్తమురాలుగా చిత్రించారు. దుర్యోధనునిలోని ఉదాత్త లక్షణాలను నిరూపించారు. కైకేయీ సౌశీల్యం, కైకేయీ హృదయం, కైకేయి వంటి కావ్యాలు వెలిశాయి. రారాజు, రాజరాజు వంటి కావ్యాలు రూపొందాయి. ఆ శ్రేణిలో చేరిన రచన కాటూరి వారి పౌలస్త్య హృదయం.

రావణునిపై పాఠకులకున్న పూర్వ భావాల నన్నింటినీ తొలగించి రావణుని పట్ల సానుభూతిని కలిగించే క్వావ్యం పౌలస్త్య హృదయం. సహృదయ హృదయాహ్లాదకర కావ్యం పౌలస్త్య హృదయం.

పౌలస్త్య హృదయం ఉత్తమ పురుషలో సాగిన రావణ సంభాషణాత్మక కావ్యం. ప్రాచీన దృష్టిలో రావణ స్వగతం. ఆధునికుల దృష్టిలో ఏకపాత్రాభినయం. పద్యమయ ఏకపాత్రాభినయం. ''శ్రీరాముడు లంకపై నెత్తివచ్చుట చూచి సముద్రుడు రావణునితో జెప్ప బోగా రావణుడనిన మాటలు'' అని ప్రారంభ వాక్యాలు.

**''నురుఁగుల్ గ్రక్కుచు నూర్పు సందడులు మిన్నుల్ ముట్ట నొక్కుమ్మడిన్**
**బరుగుల్ ద్రొక్కుచు శీర్ణకేశముల నుద్బాహుండవై వచ్చు త**
**త్తఱమున్ గాంచిన నుత్తలం పడెడి జిత్తం; బీ భయోద్వేగ మె**
**వ్వరిచే నీ కొనఁగూడె నర్ణవపతీ! వాక్రుచ్చవయ్యా! వెసన్''**

అని గ్రంథ ప్రారంభ పద్యం. ఈ పద్యంలో కవి సముద్రుణ్ణి మానవీకరించాడు. నిజానికి సముద్రుడు రాముని రాకను రావణునకు చెప్పినవాడు కాడు. ఇది కవి నూతన కల్పన. రావణుడు సముద్రుని మానవాకృతిలో నుహించి సంభాషణ గావించినట్లు కవి భావన. శత్రువు వచ్చాడనే వార్తను మిత్రునికి చెప్పడానికి ఆత్రుతతో వచ్చినవాడు సముద్రుడు. ఆలా తొందరపాటుతో వచ్చిన రూపాన్ని కాటూరివారు సహజంగా, మనోహరంగా వర్ణించారు. నురుగులు క్రక్కటం, నిట్టూర్చటం, జట్టు వీడిపోవటం, బాహువులు పైకెత్తటం, పరుగులు తీస్తూ రావటం - ఎంత సహజవర్ణన! ఈ లక్షణాలను సముద్రానికి గూడా అన్వయించుకోవచ్చు.

ఈ గ్రంథం సంక్షిప్త రామాయణం. రావణుడు సముద్రునితో గావించిన సంభాషణలో గత సంఘటనలన్నింటినీ గుర్తుచేశాడు.

**''వసవల్చు చెక్కిళ్ల వయసున లజ్జమై**
**మునియాజ్ఞఁదాటక దునుముఁసొగసు**
**జనపాలు వ్రేలు నీడున శైవచాపమ్ము**
**విఱిచిన శృంగార వీర మహిమ**
**పసుపు బట్టల నిగ్గు పస భార్గవ క్రోధ**
**సంధ్య మాయించిన శౌర్యసార**
**మాలిఁబాసిన క్రొత్తయఁలతమై వజ్రసా**
**రుని వాలి నొక కోలఁదునుము పటిమ**
**వింటయే కాని ఇన్నిటికంటె, రాచ**
**పట్టము దొరంగి, నారలు గట్టి కాన**
**మెట్టినట్టి వెక్కసమైన దిట్టతనము**
**వింటి; సామికే తగు ననుకొంటి కాని''**

వంటి పద్యాలు ఉదాహరణలు. ఈ పద్య పఠనం వలన తాటకవధ, శివచాప ఖండనం, పరశురామ గర్వభంగం, వనవాసగమనం, సీతావియోగం, వాలివధ పాఠకుల స్మృతి పథంలో మెదలగలవు. రావణుడు ఆత్మోత్కర్ష గావించుకొనే సందర్భంలో గూడా రామాయణంలోని వివిధ ఘట్టాలు స్ఫురిస్తాయి.

**''రావణుఁడన్నఁగాళ్లబడు రాయియుఁఅప్పయు గాదు జాలిమై**
**గావఁగ నాతి కోఁతియును గాకియు గ్రద్దయుఁగాదు. లోకవి**
**ద్రావణుఁడుగ్రవీర చరిత ప్రథితుం డతిమానియౌ దశ**
**గ్రీవుఁడు పోరిలోఁబొడిచి గెల్చును జచ్చును గాక. వేఁడునే?''**

రాయిఅప్ప – అహల్య, నాతి – శబరి, కోతి – సుగ్రీవుడు, కాకి – కాకాసురుడు, గ్రద్ద – జటాయువు. వీరంతా రాముని అనుగ్రహానికి పాత్రులైన వారు. అంటే రామాయణ కథను కొంత చెప్పినట్లు. తాను వారి వంటి దీనుణ్ణి కాదని లోకవిద్రావణుడనని చెప్పటం వలన రావణుని ఆత్మాభిమానం అద్భుతంగా ఈ పద్యంలో వ్యక్తీకరించబడింది.

రావణుడు అనన్యసాధ్యమైన కార్యాల నెన్నో సాధించాడు. అందుకు కారణం ఆత్మబల ప్రదర్శన కాంక్ష కాదట! విష్ణుదర్శన కాంక్ష యట!

**''పాతాలాధిపు తోఁకఁద్రొక్కితి, శచీప్రాణేశుకైశ్యమ్ము డా**
**చేతం బట్టితి, వెండికొండ శివుతో శీతాచలేంద్రాత్మజో**
**పేతం బల్లలనాడఁజేసితిఁగదా! యీ విశ్వవిక్షోభ మే**
**లా తప్పింపఁడు సామి నన్నెతిఁగి? మేలా నన్ను వంచించుటల్?''**

మొదటి మూడు పాదాలలో రావణుని వీరకృత్య వర్ణన యున్నది. నాగలోక నాకలోకాలను జయించాడు. కైలాస పర్వతాన్ని పెకలించాడు. ఈ విశ్వక్షోభ విష్ణు సాక్షాత్కారం కోసం. చివరి భాగంలో రాముడు తనను సంహరించడానికి రాకుండా వంచించాడని అన్నాడు. దోషం దేవునిపైనే నెట్టాడు.

**''పదుగురలోన నన్గుఱుతుపట్టునొ లేదొ యటంచు సర్వభూ**
**విదిత పరాక్రముండనయి వీఱిడి సేఁతలు పెక్కు చేసితిన్**
**బదుగురు 'వీఁడు రక్కసుఁ' డనన్ వెడ నిందల కగ్గమైతిఁ దా**
**మదిమది నుండినన్ మఱచె మాధవుఁడెంతటి క్రూరచిత్తుఁడో?''**

తనను రాముడు గుర్తించటానికే తా నంతటి క్రూరకృత్యాలు చేశాడట! అయినా తనను మరచిన రాముడు క్రూరచిత్తుడని నేరారోపణ గావించాడు. మునులను హింసించడం తన కిష్టం కాదుట, సతులను చెరపట్టడానికి తాను పశువు కాదట, ఇంతటి దుష్టకార్యాలు చేసినా రాముడు తనను గుర్తించనందువల్లనే సీతాపహరణం గావించాడట.

**''సాగరా! ఏమి వచియింతు? జానకమ్మ**
**తల్లినే హరియింపక తప్పదాయె''**

'జానకమ్మ తల్లి' అనే ప్రయోగం వలన, పై భావ వ్యక్తీకరణం వలన రావణునిపై ఎంతో కోపం ఉన్న వ్యక్తి గూడ అయ్యో! పాపం అనక తప్పని పరిస్థితిని కల్పించారు కాటూరివారు.

రావణుడు తనపై దండెత్తి వచ్చిన రాము నింకా దర్శించలేదు. దర్శించి విన్నవింప వచ్చినవాడు సముద్రుడు. రాముణ్ణి యుద్ధరంగంలో కలుసుకోవాలనే కాంక్షతో తొందరపడుతున్నవాడు రావణుడు. తన ప్రభువు ఎలా వున్నాడో తెలుసుకోవాలని తొందరపడుతున్నవాడు రావణుడు. అందుకే సముద్రిణ్ణిలా ప్రశ్నించాడు.

**''చూడుము నెచ్చెలీ! విభునిఁజూచితివే కద! చెప్ప మెట్టులు**
**న్నాఁడొ రఘూద్వహుండు, లలనా విరహవ్యథఁగ్రాగి చిక్కియు**
**న్నాఁడొ! దశాస్యకంఠ దళన ప్రవణాగ్రహవృత్తి వెల్గుచు**
**న్నాఁడొ? అధిజ్య ధన్వుఁడరుణద్యుతి రంజిత నేత్ర కోణుఁడై''**

సీతా విరహవ్యథతో చిక్కిపోతే బాధ, ఆ బాధ వలన తనను సంహరించడానికి సిద్ధపడితే సంతోషం పొందాలని రావణుని కోరిక.

ఇంతకు పూర్వం ఎందరో శత్రువులను సంహరించాడు విష్ణుమూర్తి. కాని వారిని వరాహ రూపంలోనో, నరసింహ రూపంలోనో వధించాడు. వరాహావతారం జంతురూపం. నరసింహావతారం నరజంతు మిళితరూపం. తనను సంహరించడానికి మాత్రమే విష్ణువు పురుషోత్తమాకృతిని ధరించాడని రావణుడు పొంగిపోయాడు. ''శౌరి కపూర్వ విక్రమ రసమ్మున బారణ చేయగా వలెన్'' అని రావణుని నిశ్చయం. ఇలా రావణుని అభిప్రాయాలన్నిటినీ కాటూరివారు రసవంతంగా వివరించారు ఈ లఘుకృతిలో.

ఈ కావ్యంలో నామౌచిత్యం, పాత్రౌచిత్యం, సంబోధనౌచిత్యం, వృత్తాంతౌచిత్యం, అలంకారౌచిత్యం మొదలైన ఔచిత్యాలను ఎంతో, ఎంతెంతో వివరించవచ్చు. తక్కువ పద్యాలలో ఎక్కువ ప్రభావం చూపే రచనలు చేయటంలో కాటూరివారు మిక్కిలి సమర్థులు. అటువంటి మరొక రచన గుడిగంటలు.

# గుడిగంటలు

పౌలస్త్య హృదయం కంటే గుడిగంటలులో ఒకే ఒక పద్యం ఎక్కువ. అది పౌరాణిక కావ్యం. ఇది సాంఘిక కావ్యం. భక్తి భావం రెండింటిలోనూ అంతర్వాహిని. పౌలస్త్య హృదయంలో వైరభక్తి ప్రధానం. గుడిగంటలలో దాస్యభక్తి ప్రధానం. పౌలస్త్య హృదయం సముద్రునితో రావణుడు గావించిన సంభాషణ. గుడిగంటలు కావ్యం వేంకటశ్వర కవి వేంకటేశ్వరస్వామితో గావించిన సంభాషణ. తొలి కావ్య శీర్షిక 'పౌలస్త్య హృదయం' రావణ హృదయాన్ని విప్పిచెప్పే శీర్షిక. మలి కావ్య శీర్షిక, 'గుడిగంటలు' గుడిలోని దేవుని మేలుకొలిపే శీర్షిక.

సర్వజన మంగళాన్ని ప్రబోధించేవి గుడిగంటలు. ఈ గుడిగంటలను మ్రోగించే అవకాశం కొందరకు లేకపోవటం ఘోరం. వారికి ఈ అవకాశం కలుగనీయని వారిది ఘోర నేరం. సమాజంలో అంటరానివారుగా భావిస్తున్న మానవులకు దేవాలయ ప్రవేశం లేకపోవటం వలన కవి గుండెలు అలాటంతో కావించిన నినాదాలే ఈ గుడిగంటలు. గాంధీ మహాత్ముడు ప్రేమభావంతో పంచములకు పెట్టిన పేరు హరిజనులు.

ఈ గ్రంథములోని నలభై పద్యాలలో ప్రస్తావితాంశాలు నాలుగు. ప్రధానాంశం హరిజన దేవాలయ ప్రవేశ సమస్య. రెండవది హింసాసమస్య. మూడవది స్వామివారి మేలుకొలుపు. నాల్గవది ఆత్మభక్తి భావన. స్వామివారి మేలుకొలుపు పద్యాలు భక్తి భావపూరితాలు. సంప్రదాయ భావవిలసితాలు. ప్రకృతి వర్ణన సంశోభితాలు. సమాస రచనా బంధురాలు.

ప్రపంచంలో పెచ్చుపెరిగిన హింసావ్యాపారం కాటూరివారి సున్నిత మనస్సును గాయపరచింది. ఈ హింసాధోరణి చెలరేగుతుండగా నీవు కొండపై కూర్కు చెందటం న్యాయం కాదని, మేలుకోమని దైవానికి కాటూరి కవి విన్నవించారు.

**"వరడులు గంకగృధ్రములు వాయసముల్ చెరలాడు నిచ్చమై**
**కొఱవులు బూని శాకినులు గ్రుమ్మరు, నెత్తుటి వఱ్ఱు లోడఁగాఁ**
**బుఱియలుదేల మొండెములు మున్కలు వెట్టఁగ నల్లరాళ్లుగా**
**బరగిన పంటచేలఁబెనుపాపము పండెడు నిద్రమేలుకో."**

కాకులు, గ్రద్దలు, రాబందులు స్వేచ్ఛగా విహరిస్తున్నాయి. నక్కలు ఊళ లేస్తున్నాయి. శాకినీ దయ్యాలు కొరవులు చేతబట్టుకొని తిరుగుతున్నాయి.

పంటచేలు శ్మశానాలుగా మారిపోతున్నాయి. నెత్తుటి కాలువలలో పుఱ్ఱెలు తేలియాడుతున్నాయి. మొండేలు మునకలు వేస్తున్నాయి. ఇది రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో జపాను దేశంలో స్థితి అనీ, ఈ దుస్థితినే కాటూరివారు వర్ణించారనీ పింగళి వేంకటకృష్ణారావుగారి ఉద్దేశం.

ఈ కావ్యంలో ప్రధానాంశం హరిజన దేవాలయ ప్రవేశం. హరిజనులను హిందూ సమాజం వెలివేసింది. వారి సేవలను పొందుతున్నది గాని వారికి హక్కులే మాత్రం కల్పించటం లేదు. అందుచేత వారు గంగానమ్మలను, పీరుసాహెబులను, అంకమ్మలను, పోతురాజులను కొల్చుకుంటున్నారు. ఈనాటికి – ఏనాటినుండో మనసులో మెదలుతున్న కోరికను తీర్చుకోవడానికి కొండపైకి ప్రయాణం కట్టారు. ఇలా గుడికి ప్రయాణం కట్టే సాహసం వారికి గాంధీ మహాత్ముని హరిజన దేవాలయ ప్రవేశోద్యమం వలననే చేకూరింది. ఆ వచ్చిన వారిపై నీ దయాదృక్కులు ప్రసరింపజేయమని కాటూరి వారి ప్రార్థన. ఆ వచ్చినవారు రాజకీయనాయకుల్లా, రాచరికాన్ని ఆశించటం లేదు. ఆపద వచ్చినప్పుడు మాత్రమే దేవునికి మ్రొక్కే ఆపద మ్రొక్కులవారు కారు. తీర్చలేని కోరికలు కోరేవారు కారు. నీకు వడ్డికాసులు సమర్పించగలిగినవారు కారు. వారు కోరిందల్లా నీ పాద సందర్శనమే. వారికి ప్రపన్నజనతార్తిహరమ్మైన నీ పాదాలు దర్శించే అవకాశమీయవయ్యా అని వారి వేడికోలు.

> **''అడుగగరారు రాచరిక, మాపదమ్రొక్కుల వారు గారు, నీ**
> **కుడుగర లీయలే, రడుగనొల్లని యర్థము వేడబోరు, వీ**
> **రడిగిన దొక్కటే! విరచితాంజలి మాలలు మాలలెల్ల నీ**
> **యడుగుగవన్ బ్రపన్న జనతార్తి హరమ్మును జూడనీఁగదే''**

'విరచితాంజలి మాలలు మాలలెల్ల' అనే సమాసం హరిజనులపై కాటూరి వారికి గల ప్రసన్న భావాన్ని వ్యక్తీకరిస్తున్నది. దర్శనభాగ్యమీగదే, తెఱపించవేద్వాః కవాటముల్, తల్పుతీయవే, వాకిళులు మూయకు నీ గుడికో దయాలయా, మోముచాటయ్యేదే? దాగికోదగదయా! మొదలైన విన్నపాల నెంతో వినయంగా చేశారు.

మాలడు దైవానికి చేసే సేవలు పెక్కులు. ఆవులు కాచి పాలు పిండి తెచ్చే వాడు మాలడు. పైరు పెంచేవాడు మాలడు. పంట పండించి గాదెల

నిండించేవాడు మాలడు. భార్యాబిడ్డల నుపవాసాలుంచయినా ముప్రొద్దు నిన్ను సేవించేవాడు మాలడు. అతనికి ''నేలా మోము జూపించవో'' అని కాటూరి వేసిన ప్రశ్న. దేవుని నిలదీసి కాటూరివారు ప్రశ్నించిన ప్రశ్న లీలఘు కావ్యంలో అనేకం.

''తిన్నాఁడొ పస్తులే యున్నాఁడొ, ముప్రొద్దు
గుడువఁబెట్టును నీకుఁగడుపునిండ
కట్టెనో మై గోచి పెట్టెనో, దువ్వలు
వలు దెచ్చి నీకిచ్చుఁదలకు మొలకు
నీరాడెనో ధూళి పొరాడెనొ, సుగంధి
నీరమ్ము లార్చు నిన్ రేపుమాపు
ఎండెనో తడిసెనో, ఎండవానలు సోఁక
కుండ నీ కిడు గుళ్లు గోపురములు
నేఁడుకాదు గదా యితం డూడిగమ్ము
సలుపు, టొకనాఁడు గోరిక దెలియనడుగ;
వడుగవచ్చిన గుడిదూరి గడియ వైచి
కూరుచుంటివి కొండెక్కి గొప్ప దొరవు''

పై పద్యం వలన హరిజనుని భక్తి, భావంతో పాటు పేద స్థితిగూడా తెలుస్తున్నది. హరిజనులు ఎంత దుర్భర స్థితిలో జీవిస్తున్నారో తెలిపే పద్యం మరొకటి.

''చీఁకటి కొంపలో బ్రదుకు, చింకితలల్, మెయిఁగాటిపోఁత, పె
ల్లాఁకటి కింత సంకటియు నంబలియున్, జవి కింత యుప్పుగల్
వేఁకటి కింత చప్పిడియు, వేకికి బస్తులు నైన వీరిపై
నీ కరుణాకటాక్షరస నిస్సరణమ్ములు పొంగి పొరుతన్''

చీకటి నిండిన ఇండ్లలో వారి నివాసం. చింపిరి తలలు. ధరించడానికి వల్లకాటిలో శవంపై కప్పిన వస్త్రమే ఆధారం. ఆకలికి కొంచెం సంకటి, అంబలి. ఉప్పు గల్లు వారి శాకం. జబ్బుచేస్తే చప్పిడి మెతుకే పథ్యం. ఇట్టివారిపై నీ కరుణారసనిర్భరాలైన దృష్టులను ప్రసరింపజేయవయ్యా స్వామీ అని కాటూరివారు ఏడుకొండలవానికి విన్నవించుకున్నారు.

వేంకటేశుని విన్నపాలు సప్తగిరీశు డాలకించాడు. హరిజనులకు దర్శన మొసగి యనుగ్రహించాడు. కాటూరి వా రానందోత్సాహాలతో 'అల్లదిగో! రమారమణు నంఘ్రిసరోజయుగమ్ము... కొలుచుకొండు భవమ్ములు పొంగిపొర్లగన్ అని హరిజనుల పుణ్యం పండిందని పలికారు. దయయన్న నీదయా అని శ్రీనివాసుని నుతించారు. శ్రీనివాసుని శ్రీపదములు తన జన్మజన్మల పాపాలను పోగొట్టగలవని విశ్వసించారు. చిట్టచివరగా తాను వేంకటేశ్వరనికి కింకర భావంతో చేసే సేవలను ముగింపు గీతంగా విన్నవించారు.

**''కసవున్ జిమ్మెద, నీరు జిల్కెదను నీ కల్యాణగేహాన, బా**
**నసముం జేసెద, గట్టియల్ విరుతు, గింజల్ పొట్టువో దంచెదన్**
**కుసుమాన్నంబులు వార్చి నీ కిడెద, నంట్లుం దోముదున్, వీవనన్**
**విసరన్, బాధములొత్త నాకిడవె తండ్రీ జన్మజన్మాలకున్''**

ఆముక్తమాల్యదలో విష్ణుచిత్తుడు చెప్పిన ''గృహ సమ్మార్జనమో! జలాహరణమో!... అనే పద్యాన్ని జ్ఞప్తికి తెచ్చే పద్యం ఇది. హరిజనోద్ధరణ కామన, విశ్వశాంతి కామన ప్రధానంగా గల ఈ కాటూరి వారి భక్తి కావ్యం సులభ సుందరశైలిలో సాగి సహృదయుల నలరించింది. పౌలస్త్య హృదయం, గుడిగంటలు కావ్యద్వయంతో పాటు కాటూరివారి ఉపోద్ఘాత కావ్యాన్నిగూడా చేర్చి ఆ మూడు కావ్యాల సంపుటిని పిలకా గణపతి శాస్త్రిగారు త్రివేణీ సంగమం అని ప్రశంసించారు.

## పన్నీటి జల్లు

కాటూరివారి బహుముఖ వ్యక్తిత్వానికి నిదర్శనం పన్నీటిజల్లు. కాటూరి వారి పద్యగేయాల సంకలనమే పన్నీటిజల్లు. ఈ గ్రంథంలోని ఖండికలు కథాప్రధానాలు కావు. భావప్రధానాలు. ఈ కావ్యంలోని ఖండికలను భక్తి ఖండికలు, దేశభక్తి ఖండికలు, ప్రశంసాఖండికలు, బాలకవితా ఖండికలు. అని ప్రధానంగా విభజించవచ్చు .పన్నీటిజల్లులోని ఒక్కో పద్యం ఒక్కో పన్నీటి బిందువు. వెరసి పన్నీటి జల్లు.

# భక్తి ఖండికలు

కాటూరివారు ఆస్తికులు. అయినా నిత్యజీవితంలో వారు గావించిన క్షేత్ర సందర్శనం, తీర్థయాత్రాచరణం తక్కువ. వారి సాహిత్య జీవితంలో సౌందర్య దృష్టి, సామాజిక దృష్టి యెక్కువ.

**''కొలిచి యెఱుగ వేలుపుల నెవ్వరి న్మున్ను**
**మంత్ర తంత్రములను మఱగి యెఱుగ**
**మునుగలేదు తీర్థముల, పాపపంకమ్ము**
**నందు మునిగి అంగలార్తు నేడు''**

జీవిత చరమాంకంలో భక్తి భావరహితంగా తాను జీవించిన జీవిత పూర్వాంకాన్ని తలచుకొని ఎంతో వేదన చెందారు. 1949లో రమణమహర్షిని దర్శించిన తర్వాత కాటూరివారిలో ఆధ్యాత్మిక దృష్టి పెరిగింది. దైవస్తుతి, దైవభక్త స్తుతిపరాలైన ఖండికల నెన్నిటినో రచించారు. శంకర భగవత్పాదుల సౌందర్యలహరి, దేవ్యపరాధక్షమాపణ స్తోత్రము, శివాపరాధక్షమాపణ స్తోత్రాల నాంధ్రీకరించారు.

శంకరాచార్యులవారు అద్వైత మత స్థాపకులైన మతాచార్యులు. అత్యద్భుత కవితానిర్మాణాచార్యులు. అంతటి మహాపురుషుని రచనలను కాటూరివారు భక్తి భావంతో, కవితానురక్తిభావంతో ఆంధ్రీకరించారు. శంకరుల వారి దేవ్యపరాధ క్షమాపణ స్తోత్రం ద్వాదశ పద్య సంశోభితం. కాటూరివారు శంకరుల వారి భావాల నన్నిటినీ తన కన్వయించుకొని మనోహరంగా ఆంధ్రీకరణ గావించారు. ఒక శ్లోకానువాదాన్ని గమనించండి.

**''జగదంబ విచిత్ర మత్రకిం పరిపూర్ణా కరుణాస్తిచేన్మయి**
**అపరాధ పరంపరావృతం నహి మాతా సముపేక్షతే సుతమ్''**

**''నిండు మనమున నను గరుణించి ప్రోచు**
**టబ్బ మది కాదు సూ జగదంబ! నీకు**
**సుతుని యపరాధములు పరశ్శతము లేని**
**కడుపునం బెట్టుకొను గాదె కన్నతల్లి!''**

మూలభావాన్ని అనువాదం చేయటమే కాక తెలుగుదనాన్ని పద్యంలో ప్రవేశపెట్టటం గూడా కాటూరి వారి ప్రత్యేకత. 'నిండు మనమున' అనే పద్య ప్రారంభ పదబంధం 'నిండు మనంబు నవ్య నవనీతసమానము' అనే ఆదికవి

పదప్రయోగాన్ని జ్ఞప్తికి తెస్తున్నది. తనయుని తప్పులను తల్లి కడుపులో దాచుకుంటుంది. ''కడుపునం బెట్టుకొను గాదె కన్నతల్లి'' అనే పాదంలో మూలభాగంలో కంటె సొగసుదనం, తెలుగుదనం వ్యక్తమౌతున్నది. ఈ ఖండికలోనే ''కలుగునుబో కుపుత్రకుడు కల్గదుగాదె కుమాత యెన్నడున్'' అనే మకుటంతో చెప్పిన మూడు పద్యాలు ముచ్చటైన పద్యాలు. కాటూరివారు శంకరాచార్యులవారి సౌందర్య లహరిలోని కొన్ని శ్లోకాల నాంధ్రీకరించారు. వారి అనువాద పద్యాలు అర్థవై. అన్ని పద్యాలు స్వతంత్రపద్యాలనిపించేటంత అందంగా ఆంధ్రీకరించటం కాటూరి వారికే చెల్లింది. సౌందర్యలహరి ప్రారంభ శ్లోకానికి కాటూరి కవీంద్రుడు చేసిన అనువాదం ఇందుకు సాక్ష్యం.

**''శివశ్శక్త్యా యుక్తోయది భవతి శక్తః ప్రభవితుం**
**న చే దేవం దేవోనఖలు కుశలః స్పన్దితుమపి**
**అతస్త్వా మారాధ్యాం హరిహర విరించాదిభిరపి**
**ప్రణన్తుం స్తోతుంవా కథమకృత పుణ్యః ప్రభవతి''**

**''ఈ వొకయింత తోడు పడ నెంతకునేనియు నేర్చుబో శివుం**
**డీ వటు మిన్నకున్న యెడ నెందులకుం గొఱగాడు శక్తిరో!**
**దేవతలున్ త్రిమూర్తులు నుతించి భజించెడి నిన్ను మ్రొక్కి నీ**
**సేవ లొనర్చు పున్నెములు సేయరు నాఁడును నేఁడు మాదృశుల్''**

భావం ఆది శంకరులదైనా వ్యక్తీకరణ పద్ధతి కాటూరివారిదే. 'ఎందులకుం గొఱగాడు' వంటి తెలుగుదనం నిండిన ప్రయోగాలతో చక్కని చిక్కని రీతిలో అందంగా సాగిన అనువాద మిది. కాటూరివారి ఆంధ్రీకరణ పద్యాలన్నీ ఈ విధంగా సాగటం వలననే పాఠక హృదయాల నలరిస్తున్నాయి.

**''శివశివా శివ నీకు చేయెత్తిమ్రొక్కెను**
**సైపు మపరాధములు శంభూ మహా దేవ....''**

అనే మకుటంతో శంకరుని శివాపరాధక్షమాపణా స్తోత్రాన్ని గూడా కాటూరివారు ఆంధ్రీకరించారు.

శంకరులవారి శ్లోకానువాదాలతో తృప్తి పొందలేదు కాటూరివారి భక్తి భావం. భక్తిభావంతో వివిధ దేవతలను స్తుతిస్తూ వా రెన్నో పద్యాలు వెలయించారు. పన్నీటిజల్లులో ప్రథమ శీర్షిక ఆంజనేయస్తోత్రం. తుది శీర్షిక వేంకటేశ్వర స్తోత్రం.

వివిధ సందర్భాలలో వారు దర్శించిన దేవతలను తన్మయతతో స్తుతించిన పద్యాలెన్నో ఈ సంకలనంలో స్థానం సంపాదించుకున్నాయి. ఇంద్రకీలాద్రిపై వెలసిన కనదుర్గను సందర్శించినప్పుడు ''కంటి నేటికి గన్నార గనకదుర్గ''నని సంతోషంతో ఆరు పద్యాలతో నర్చించారు

**''విద్యలు యశమ్ము సంపదల్ వేడఁబోను**
**ఐహికాముష్మిక సుఖమ్ము లడుగఁబోను**
**ఒల్ల నే నన్య భోగముల్ చల్లనైన**
**నీ మొగమ్మున నా చూడ్కి నిలువనిమ్ము''**

వంటి పద్యాలలో కాటూరివారి విశుద్ధ భక్తి భావన వ్యక్తమౌతుంది.

కాటూరివారు దేవతలనేకాక, దేవతల నారాధించిన భక్తపుంగవులను గూడా భక్తితో స్తుతించారు. రమణ మహర్షి, విమలానందయతీంద్రులు, కంచికామకోటి - శ్రీ శంకరాచార్య, మీరాబాయి, త్యాగరాజు మున్నగు ముముక్షువులు ఈ కవీంద్రుని కవితా నీరాజనాల నందుకున్నారు. తన మదిలో మెదలిన సంశయాల నే మతమూ తీర్చలేకపోయినప్పుడు, విమలానంద భారతీ స్వాముల యనుగ్రహం లభించిందట! ఆ బోధపుష్కలుని పుష్కల కరుణ వలన తాను ధన్యాత్ముడనయ్యానని కాటూరివారు భావించారు. స్వాములవారిని చేరక ముందటి స్థితిని వర్ణిస్తూ వారు చెప్పిన పద్యం అప్పటి వారి మానసిక స్థితికి నిదర్శనంగా నిలుస్తున్నది.

**''శాంకరమంచు ద్వైతమని శాక్తమటంచును బౌద్ధమంచు న**
**ల్వంకల లాగు పండితుల వాక్కులు కర్కశ తర్కజుష్టముల్**
**శంకఁదొలంగఁజేయుటకుఁజాలక కుత్తుక బంటిగా ననున్**
**బంకమునందుఁగూలిచిన బాసిన దున్న రవంత తెల్వియున్''**

తర్కవిజ్ఞానమంతా ప్రదర్శించిన పండితుల వాక్యాల వలన ఉన్న తెలివి గూడా పోయిందనటం తర్కదృష్టి కంటె తాత్త్విక దృష్టి మేలని నిరూపించడానికే. విమలానందుల వంటి వారి దర్శనం వలన వికల భావాలన్నీ తొలగి విమల భావాలు చేకూరగలవని కాటూరివారి విశ్వాసం. మహాపురుషుల దర్శనం ఆత్మానందదాయకం అనడం వాస్తవమే గదా?

# దేశభక్తి ఖండికలు

కాటూరివారు దైవభక్తులే కాదు, దేశభక్తులు కూడా వారు దేశభక్తి పూరిత గేయాలు వ్రాసి జైలు శిక్ష ననుభవించినవారు. జాతీయ కళాశాలలో ఆచార్యత్వం నెరపినవారు. జాతీయోద్యమానికి సహకరించిన కృష్ణాపత్రిక నిర్వహణలో సహకరించినవారు. అందువలననే స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలోని ప్రతి ప్రముఖ సంఘటనకూ స్పందించి వారు కవిత లల్లారు. వారి కవితలలో కొన్ని దేశభక్తిని వాచ్యంగా వెల్లడించేవైతే, మరికొన్ని వ్యంగ్యంగా వ్యక్తీకరించేవి. విజయతోరణం, ఆగష్టు 15, అవబృధోత్సవం, మాతృభూమి, ఓటుపాట, రాటపు పాట వంటి ఖండికలు స్పష్టంగా దేశభక్తిని వెల్లడించేవి కాగా, పిల్లంగ్రోవి పిలుపు, స్వప్న భంగం వ్యంగ్యంగా దేశభక్తి ప్రచారం గావించేవి.

కాటూరివారు కాంగ్రెసువాది. కాంగ్రెసు భారతమాత దాస్య శృంఖలాలను ఛేదించగలదని, విజయలక్ష్మిని చేపట్టగలదని వారి విశ్వాసం. అందువల్లనే 1934వ సంవత్సరంలోనే విజయతోరణం అని ఒక పద్యం వ్రాశారు. ఆ పద్యంలో కాంగ్రెస్ రథంలో విజయలక్ష్మి విహరణను వర్ణించారు.

**''పటు దండహతుల పాల్పడుచు నాబాల వృ**
**ద్ధమ్ము తాల్చిన సహనమ్ము పండి**
**బంధనాలయములఁబలు వింత క్రూరక**
**ర్మము లోర్చుకొన్న తాలిమి ఫలించి**
**తలిరుబోండ్లెల్ల నంతర్గేహములు వీడి**
**తాల్చిన వీరవ్రతమ్ము పూచి**
**ధనము మానము ప్రాణమును వ్రేల్చు ధన్యుల**
**జన్నంపుఫలము సాక్షాత్కరించి**
**సత్యశాంతుల పేరి యశ్వముల వల్గు**
**వల్గనముల కనర్గళత్వమ్ము గఱప**
**విషమ తలములు చదును గావింప నదిగో**
**వెడలె కాంగ్రెసు రథమున విజయలక్ష్మి''**

ఈ పద్యంలో స్త్రీ బాలవృద్ధులు తమ సర్వస్వాన్ని స్వాతంత్ర్య యజ్ఞంలో వ్రేల్చిన విధం, బంధనాలయాలలో బాధలు పడిన పద్ధతి వివరింపబడింది. కాంగ్రెస్ రథాశ్వాలు సత్యశాంతులని గాంధీ సిద్ధాంతములను స్తుతించారు.

కాంగ్రెసు పార్టీ గాంధీకి ముందూ ఉన్నది. గాంధీకి తరువాతా ఉన్నది. కాని సత్యమే సాధనంగా, అహింసే ఆయుధంగా, శాంతి సంగ్రామాన్ని నడిపి విజయం సాధించింది మాత్రం మహాత్ముని మార్గదర్శకత్వంలోనే. అందుకే కాటూరివారి దృష్టిలో గాంధీ యోగిపుంగవుడు. పూర్వ ఋషుల కంటె అధికుడు:

**"హుంకరించెనొ? యగస్త్యుడు నేడు నహుషు నౌ**
**ద్ధత్యమ్ము వమ్మొనర్చు ధరణి ద్రెళ్ల**
**ధృతవజ్రమగు దివస్పతి హస్త స్తంభన**
**మొనరింప జేయెత్తెనో చ్యవనుడు**
**తాల్చెనేమొ వశిష్ఠతాపసి బ్రహ్మదం**
**డమ్ము కౌశికుని గర్వము హరింప**
**అలికనేత్రుండు వెల్వెల బాఱ నఱకాల**
**గన్ను చూపించెనో గౌతముండు**
**అంతకును మీదు మిక్కిలి యద్భుతమ్ము**
**లేమి పొడమెనో! కాక యీరేడు జగము**
**లేల తలయూచు ముక్కుపై వ్రేలితోడ**
**బాపురే! మేలు! మేలు సెబా సటంచు"**

ఈ సీస పద్యంలో అగస్త్య, చ్యవన, వశిష్ఠ, గౌతమ మునీంద్రుల ఘనకార్యాలను ప్రస్తుతించి, గాంధీ గొప్పదనం అంతకు మించిన అద్భుతాలకు కారణం కావడంవల్లనే ఈరేడు జగాలు సెబాసని మెచ్చుకున్నట్లు ఈ కవీంద్రుని వర్ణన. బాపూను బాపురేయని ప్రశంసించటం కాంగ్రెసు పట్ల కాటూరివారి యనురక్తికి, బాపూజీ పట్ల భక్తికి నిదర్శనం.

బాపూజీని వీరు భక్తిపూర్వకంగా వాచ్యంగా ప్రస్తుతించటమేకాక పురాణ గాథా వర్ణన ద్వారా వ్యంగ్యంగా గూడా వినుతించారు. 'పిల్లంగ్రోవి పిలుపు' ఖండికలో శ్రీకృష్ణుడు గావించిన గోవర్ధనోద్ధరణ కథాంశం. కాని ఆ మిషతో కాటూరివారు భారత స్వాతంత్ర్య సంగ్రామ వర్ణన గావించారు. గాంధీని శ్రీకృష్ణుడుగా, భారతీయులను గోపాలురుగా, బ్రిటిష్ రాజును దేవేంద్రునిగా భావించి ఈ ఖండికను చెప్పినట్లు అర్థమౌతుంది.

కాంగ్రెసు కోసం కాటూరివారు ప్రచార గీతాలను గూడా వ్రాశారు. చల్లపల్లి రాజా వారు జస్టిసు పార్టీ తరఫున ఎన్నికలలో అభ్యర్థిగా నిలబడ్డారు. జస్టిసు పార్టీ ఆంగ్లేయులకు అనుకూలం, కాంగ్రెసుకు వ్యతిరేకం.

**''ఓటు ఓ టనియేవు వోటు నిమ్మనియేవు**
**ఓటు నీ కెటు లిత్తుమో రాజా!**
**ఓటు నీకెటు లిత్తుమో రాజా!!''**

అనే మకుటంతో వీరు రాజావారికి వ్యతిరేకంగా ప్రచారం చేశారు. ఈ గీతంలో జమీందారు పేదప్రజల కష్టాల నెరుగని కర్కోటకుడని, నష్టాల నెరుగని దుర్మార్గుడని, అటువంటి వ్యక్తికి ఓటెందుకు వేయాలని ధైర్యంగా ప్రశ్నించారు. ''రాచబిడ్డవు నీవు రైతు కస్తే మెరుక'' అని నిలదీశారు. ఆనాడు ఆ ప్రాంతంలో వాడవాడలా మార్మోగిన గీతమిది. ఖాదీ ఉద్యమ ప్రచారం కోసం వీరు వ్రాసిన రాటపు పాట కూడా దేశభక్తి పూరితమే.

ఎందరో త్యాగమూర్తుల త్యాగ ఫలితంగా, ఎందరో వీరవరేణ్యుల పోరాట ఫలితంగా భారతదేశం స్వాతంత్ర్యాన్ని సాధించింది. మాతృదేశ దాస్య విముక్తి కోసం బందిఖానా కేగిన కాటూరివారికి అపరిమితానందం చేకూర్చే సంఘటన యిది. ఆ సందర్భంగా వీరు చెప్పిన పది పద్యాలు పాఠకులకు పరమానంద దాయకాలు. ప్రారంభ పద్యంలోనే వీరి పరవశత్వం ప్రారంభమైంది.

**''తెలవారెం దెలవారె, బీడకలయ్యె త్రెళ్లెన్ బరాధీనతా**
**కలుషం, బాలయగోపుర ధ్వజములన్ ఘంటాఘణాత్కారముల్**
**చెలగెన్, నల్వదికోట్ల గొంతుల జయశ్రీగీతి విప్పారె, మం**
**గళతూర్యమ్ములు మ్రోసె, భారతము మింటన్ దోచె మువ్వన్నియల్''**

'తెలవారెం దెలవారె' అని పదపునరావృత్తి చేయడం వలన వీరి సంతోష సంభ్రమం సూచింపబడింది.

కాటూరివారు అచ్చమైన ఆంధ్రులు. కాంగ్రెసు పార్టీ ప్రత్యేకాంధ్ర రాష్ట్రావతరణను సమర్థించలేదు. కాటూరి వారికి కాంగ్రెసు పద్ధతి నచ్చలేదు. గాంధీ విధానాన్ని వీరు మెచ్చలేదు. వెంటనే తన భావాలను కవితా రూపంలో వ్యక్తీకరించారు. ఏ పాటల ద్వారా కాంగ్రెసు ప్రచారం గావించారో ఆ పాటల ద్వారానే కాంగ్రెసును వ్యతిరేకించారు.

"తెలుగుజెండా బయలుదేరింది
తెలుగుఢంకా దిశల మ్రోగింది"

అనే పల్లవితో వీరు తెలుగువారి గుండెలు పల్లవించే గీతం వ్రాశారు. ఈ గీతంలో కాంగ్రెసును, గాంధీని కూడా తీవ్రపదజాలంతో దూషించారు.

"కాంగ్రెస్సు పప్పింక ఉడికేనా
గాంధి ఏకూ లింక వడికేనా"

అని అనడం వారి ఆవేశాన్ని తెలియజేస్తుంది. కాటూరివారు మొదట ఆంధ్రులు. పిమ్మట భారతీయులు. అందువల్లనే ఇంత ఆవేశం. ఇంత ఆవేదన.

"కాంగ్రెస్ గీంగ్రెస్ జాంతేనై
గాంధీ గీంధీ కర్తే నై"

అని వారు 'మేమాంధ్రులం' అనే గీతంలో గర్జించటం కూడా ఈ దృష్టితోనే. ఈ రెండు గీతాలు వ్రాసినంత మాత్రం చేత వీరి దేశభక్తిని శంకించాల్సిన అవసరం లేదు. వీరి రాష్ట్రభక్తి దేశభక్తిని మించిపోయిందని భావించటం సమంజసం.

కాటూరివారు శాంతిప్రియులు. అహింసావాదులు. ఈ ప్రపంచం హింసాకులం కావడం వారి హృదయాన్ని ఆకులపరచింది. తారణ ఉగాదినాడు తన మనోవేదన నంతా ఉగాది కవితారూపంలో వ్యక్తీకరించారు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో జపానుపై అణుబాంబు ప్రయోగింపబడింది. అంతటి వినాశం అంతకు ముందెన్నడూ జరుగలేదు. అణుశక్తి మానవ వినాశ కారణం కావడం కాటూరివారికి బాధ కలిగించింది. అందుకే

"వరదాన గర్వమున నీ
నరదానవు లింతనంత నలిరేగి వెసన్
పరపీడా వ్రతులై స్వో
దరపూరణ మాచరింత్రు దర్పోద్ధతులై"

అని వారు మానవుల పరపీడనా దృష్టిని వ్యతిరేకించారు. 'జడశక్తి పరిణామం' శీర్షికతో వీరు వ్రాసిన పదహారు పద్యాలు పరమాణు శక్తిని నిరసించేవే. ప్రపంచ ప్రజలకు సర్వదా స్వస్తివాచకం పలికేవే.

జయ ఉగాది సందర్భంలో చెప్పిన 'కొత్తపూత' ఖండికలో గూడా కాటూరి వారు దుష్టభావాలను తొలగించుకోమని ప్రజలను కోరారు.

**"క్షుద్రమతులార! కరుణా దరిద్రులార!**
**సిగ్గువిడనాడిన పరోపజీవులార!**
**జయసమారంభవేళా ప్రసన్నచిత్త**
**కుసుమతోరణ గట్టుడీ దెసలు నిండ"**

ఉగాది సందర్భంగా చెప్పిన ఈ రెండు ఖండికలలోనే కాక, 'జడశక్తి పరిణామం' ఖండికలోనే కాక, బుద్ధదేవుని స్తుతిస్తూ చెప్పిన 'బుద్ధదేవుడు' ఖండికలో గూడా ఈ కవీంద్రుడు సర్వప్రాణిహితాన్ని కాంక్షించారు.

'బుద్ధదేవుడు' శీర్షికతో కాటూరివారు మూడు పద్యాల ఖండికను వ్రాశారు. బుద్ధుడు చారిత్రక పురుషుడు. మహాపురుషుడు. దేవుడు కాదు. కాని తర్వాతి తరాల వారు బుద్ధుణ్ణి అవతారమూర్తిగా ఆరాధించారు. పింగళి కాటూరి కవులు సౌందరనందంలో బుద్ధభగవానుని నోరారా నుతించారు. కాటూరివారు ప్రత్యేకంగా వ్రాసిన ఖండిక ఇది. ఈ ఖండికలో ప్రథమ భాగం భగవద్గీతలో కృష్ణ భగవానుడు చెప్పిన శ్లోక భావం.

**"దుష్ట శిక్షణమ్ము శిష్ట రక్షణ మాచ**
**రింప దేవు డవతరించునంద్రు"**

అయితే దేవు డెన్ని అవతారాలు ధరించి భువిపై నవతరించినా సాధుపీడ విరుగడ కాలేదని వీరు తర్వాతి రెండు పాదాలలో అసంతృప్తిని వ్యక్తీకరించారు.

**"ఎన్ని మారు లవతరించిన భూమిపై**
**సాగు టుడుగదయ్యె సాధుపీడ"**

రెండవ పద్యంలో సాధుపీడ గుండెను మండించగా భువిపై నవతరించిన బుద్ధుని మహాద్భుత వృత్తాన్ని స్తుతించారు. మళ్ళీ చివరి పద్యంలో బుద్ధుడు ప్రతిపాదించిన కరుణభావం అదృశ్యమైపోతున్నందుకు కవి విచారాన్ని వ్యక్తీకరించారు.

**"మింట నెగురు పక్కి, మంటిలో పొరలాడు**
**కీటకముల గములు, నీటఁదిరుగు**
**భూతకోటి నొక్క పొలుపున గన్న నీ**
**కరుణ దిక్కుమాలి సురిగె నేడు"**

మానవులపై మాత్రమే గాక సర్వజీవకోటిపై బుద్ధుడు చూపిన కరుణ భావం పట్ల కాటూరి వారికి గల అనురక్తి ఈ ఖండిక వలన వ్యక్తమౌతున్నది.

# ప్రశంసా ఖండికలు

కాటూరివారు కళాప్రియులు. కవితాస్రష్టలు. అందువలననే తనవంటి కళాప్రియులను, కవితా స్రష్టలను నోరార నుతించారు. వారి ప్రశంసలకు పాత్రులైన సమకాలిక కళాకళత్రు లెందరో! వారిలో సుప్రసిద్ధు లున్నారు. అప్రసిద్ధు లున్నారు. తనకు నచ్చినవారు సుప్రసిద్ధులైనా, అప్రసిద్ధులైనా కాటూరివారు ప్రశంసించారు. పన్నీటిజల్లులోని ఎనభై మూడు ఖండికలలో ఇరవై ఖండికలకు పైగా ప్రశంసా ఖండికలే.

కాటూరి వారి ప్రశంసకు నోచుకున్నవారిలో ప్రధానులు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు. కాటూరివారు ముట్నూరి వారి దర్బారు కవులు. దర్బారు శాయరు పేరుతోనే కాటూరివారి ఖండికలు కొన్ని ప్రకటించబడ్డాయి. ముట్నూరివారి దర్బారు కళోపాసకులతో నిత్యం కళకళలాడుతుండేదట! తన కుటీరంలో కొలువుదీరిన ముట్నూరి వారిని కాటూరివారు సన్నుతించిన పద్య మిది.

**''కమ్మని కైతగాండ్రు, పులకండము లొల్కెడి గాయకుల్, తథోం**
**ధిమ్మని నాట్యమాడు నభినేత లనేక కళాప్రవీణులున్**
**సమ్మతిఁగొల్వగా సగము సాగిలఁబడ్డ త్రిభంగి కాకృతిన్**
**జేమ్మమసీదులో గురుత సల్పు నినుం గనఁగన్ను పండువౌ''**

''గురుగ్రంథ సాహెబ! గ్రంథ సాహేబుజీ, గ్రంథ గురుదేవా'' అని సంబోధిస్తూ, ముట్నూరి వారి స్వరూప స్వభావాలను ప్రశంసిస్తూ వీరు వ్రాసిన పన్నీటి జల్లు ఖండిక ప్రశంసనీయం.

'పన్నీటి జల్లు' శీర్షికతో కాటూరివారు వ్రాసిన మరో ఖండిక కవిసమ్రాట్ విశ్వనాథ-వారిని వినుతించే ఖండిక. విశ్వనాథ వారి గజారోహణోత్సవ సందర్భంలో చెప్పిన ఖండిక యిది. నవరత్నాల వంటి తొమ్మిది పద్యాలలో విశ్వనాథవారి బహుముఖ ప్రజ్ఞను వీరు బహుధా ప్రశంసించారు.

**''కథలు సెప్పికొన్న, కావ్యమ్ములు పఠించు**
**కొన్న, నవల చదివి కొన్న, నాట**
**కముల నాడికొన్న, గతి వేఱలేమి మా**
**తలల నీదు కృతులె తాల్చవలసె''**

నని విశ్వనాథ వారు సృష్టించిన వివిధ ప్రక్రియలను వినుతించారు.

కాటూరివారి గురుదేవులు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు. శాస్త్రిగారిని గూర్చి కాటూరివారు మూడు ఖండికలు వ్రాశారు. ఆ ఖండికలలోని పద్యాలలో కొన్ని పన్నీరు చిలికించేవి. కొన్ని కన్నీ రొలికించేవి. గురువుగారి నిర్యాణ సందర్భంలో చెప్పిన పద్యాలు విషాదంతో నిండినవి. రాజసభలలో అసూర్యంపశ్యగా కాలం గడుపుతున్న తెలుగు కవితాకన్యను పల్లకీ నెక్కించి దిగ్వీధుల త్రిప్పిన మహామహుడ వని కాటూరి కవి తన గురుదేవుని స్తుతించారు.

**''అవనీపాల సభాంతరమ్ముల నసూర్యంపశ్యయై పండిత**
**ప్రవరుల్ చర్విత చర్వణ క్రియల నావర్తింపగాఁజేయు నృ**
**త్యవిశేషమ్మును జూపు మా తెలుఁగు కన్యన్ బల్లకీమీద త్రి**
**ప్పవె దిగ్వీధుల నీవు నైక విధ నేపథ్య ప్రధానమ్మునన్''**

కాటూరివారు గావించిన కవిస్తుతిలో మాధవపెద్ది బుచ్చిసుందరరామ శాస్త్రి, తుమ్మల సీతారామమూర్తి వంటి తెలుగు కవులే కాక రవీంద్ర కవీంద్రుల వంటి యన్య భాషా కవీంద్రులు నున్నారు. కవీంద్రులే కాదు. వీరి స్తుతికి పాత్రులైన వైణిక విద్వాంసు లున్నారు. గాయక శ్రేష్ఠు లున్నారు. నటశేఖరు లున్నారు. కాటూరివారి గుణగ్రహణ శక్తికి నిదర్శనాలు వారి వివిధ ప్రశంసాఖండికలు.

## చమత్కార ఖండికలు

కాటూరివారు చమత్కార ప్రియులు. ఆ చమత్కారం సహృదయానంద దాయకం. కాటూరివారికి అక్షరాభ్యాసం చేసిన గురువుకు కాటూరు గ్రామప్రజలు స్వర్ణ కంకణం సమర్పించి సన్మానించారు. ఆ సందర్భంలో కాటూరివారు గురువుగారిని పది పద్యాలలో ప్రశంసించారు.

**''మదిని మెత్తందనమ్మును మాటలందు**
**పరుసదనమును........''**

గల తన గురువును వారు శిష్యవత్సలుడని స్తుతించారు. ఆ కాలపు గురువులు విద్యార్థులకు అవసరమైతే దండించి విద్యాబుద్ధులు నేర్పేవారు.

''బుద్ధి చెప్పువాడు గ్రుద్దితే నేమయా'' అని వారి భావం. కాటూరి వారి గురువుగారు గూడ పిల్లలను దండించే చదువు చెప్పేవారు. ఆ విషయాన్ని జ్ఞాపకం చేస్తూ ప్రస్తుతం తాము స్వర్ణకంకణ ప్రదానంతో కసి తీర్చుకుంటున్నామని కాటూరివారు చమత్కరించారు. ఆ పద్యాన్ని గమనించండి.

"గురుదేవుని దక్షిణపున్
గరమా! మున్నెంత మమ్ము గాఱియ యిడితో
దొాఱకె గద నిప్పుడే బం
గరు కడియము లోన దూర్చి కసి దీర్చుకొనన్"

తన నెంతగానో బాధించిన గురుదేవుని కుడిచేతిని బంగారు కడియంలో దూర్చి కసి దీర్చుకుంటున్నారట!

'నవ్వులతోట' అనే పేరుతో వీరు గావించిన వినాయక స్తుతి గూడా పేరుకు తగ్గట్లు ఆనందాన్ని అందించేదే. అందులో ఒక పద్యం ఒక ప్రాచీన సంస్కృత చాటువుకు చేసిన అనువాదం. ఈ పద్యం హాస్య చమత్కారాల సమ్మేళనం.

"యుగపత్స్వగండ చుంబనలోలౌ పితరౌ నిరీక్ష్య హేరంబః
తన్ముఖమేళన కుతుకీ స్వాననమపనీయ పరిహసన్ పాయాత్"

ఈ శ్లోకానువాదం ఇది.

"చెక్కులు ముద్దులాడ నిరుచెంతలఁజేరిన తల్లిదండ్రులన్
టక్కరి చూపులన్ గని తటాలున ఆత్మముఖాంబుజమ్ము వెన్
చక్కికి లాగి, వారి ముఖసారసయుగ్మము మేళవింపఁగా
ఫక్కున నవ్వు విఘ్నపతి ప్రాపగు నవ్వులతోట కెప్పడున్"

ఆది దంపతులు వినాయకుణ్ణి ముద్దు పెట్టుకుందామని ముందుకు వంగారు. అల్లరి కుర్రవాడైన లంబోదరుడు తన ముఖాన్ని వెనుకకు లాక్కున్నాడు. దానితో ఆ దంపతుల ముఖాలు ముద్దిడుకున్నాయి. మూలానికి ఏమాత్రం తీసిపోకుండా శ్లోకాన్ని అనువదించి ఆనందింపజేశారు కాటూరివారు,.

పౌలస్త్య హృదయం, గుడిగంటలు వంటి ఉదాత్త కావ్యాలను వ్రాసిన కాటూరి వారు 'సెటైరు' పద్యాలు రచించారంటే నమ్మటం కష్టమే. అయినా అది నిజం. గణపతి కొంటె చేష్ట వర్ణన వీరి సొంతం కాదు. సంస్కృత శ్లోకానువాదం ఇది. గురుదేవులకు కంకణ ప్రదానోత్సవంలో చెప్పిన పద్యం చమత్కార భరితమైనా 'సెటైర్' వంటిది కాదు. వారి కొంటె పద్యాల కుదాహరణం 'పన్నీటి జల్లు'లోని 'సిజర్స్ శిరోమణి'. కాటూరివారి మిత్రులలో జలసూత్రం రుక్మిణీ నాథ శాస్త్రిగా రొకరు. వారెప్పుడూ సిజర్స్ సిగిరెట్లు తాగుతూ కులాసాగా కాలం గడుపుతూ ఉండేవారు. వారొకసారి సంస్కృత శిరోమణి పరీక్షకు

హాజరయ్యారు. పరీక్ష తప్పారు. ఆ సందర్భంలో కాటూరివారు సిజర్స్ ప్రక్కన శిరోమణి పదాన్ని చేర్చి 'సిజర్స్ శిరోమణి' అనే పరుతో ఆనందదాయకమైన అయిదు పద్యాలు వ్రాశారు. ఆ పద్యాలలో సాహిత్య శిరోమణిగా తప్పినా సహజంగా ఒకదానిలో నీవు శిరోమణివే అని అభినందించటం విశేషం.

**''చులుకీకృత కాఫీ టీ**
**జలనిధి! ఖిల్లీ సహస్ర చర్వణ చణ! ని**
**ర్మల ధూమోజ్జ్వల పరివే**
**షలసన్మూర్తీ! సిజర్సు సారజ్ఞమణీ!''**

ఈ పద్యంలో జలసూత్రం అలవాట్లనన్నిటినీ చమత్కార భరితంగా అవహేళన చేశారు కాటూరి వారు.

కాటూరివారు చదువుకొనే రోజులలో 'సోడాబుడ్డి' శతకం వ్రాశారుట.

**''టీ జనితేన్స్పిరేషను పటిష్ఠ మహీయ గవాయిగాన వి**
**భ్రాజిత పీరుసాబు నయనాంచన కాంచన స్పెక్టికల్ ద్వయీ**
**భ్రాజిత డాబున్యూసుల షరాబు కవిత్వఖరాబు నాట్యపుం**
**బోజులలో నవాబు, పొగపూతల మింటి గిలాబు బాబయా''**

ఇతర భాషా పదాలను మాతృభాషలో కలగలిపి సరదాగా వ్రాసిన పద్యాలివి.

## సాహిత్య దర్శనము

''వచన శైలిలో పింగళివారిది, పద్యశయ్యలో కాటూరివారిది పై చేయిగా నుండునని దేశమున బలుచనైన యొక వాడుక యున్నది. రసజ్ఞుల చెవుల కిట్టి వాడుకలు వినబడవు. వారిరువురిది సరియగు జత.'' ఆంధ్ర రచయితలులో పింగళి కాటూరి కవులను గూర్చి మధునాపంతుల వారి తీర్పు ఇది. ఈ వాడుక రావడానికి కారణం పింగళివారు వచనం ఎక్కువగా, కాటూరివారు వచనం తక్కువగా వ్రాసి ఉండటం. కాటూరి వారి వచన రచన 'సాహిత్య దర్శనము'. ఈ వ్యాస సంకలనంలోని వ్యాసాలను పరిశీలిస్తే కాటూరి వారి వచన రచనారీతి ఎంత అద్భుతమో వ్యక్తమౌతుంది.

సాహిత్య దర్శనంలోని వ్యాసాలు పన్నెండు. సాహిత్య దర్శనం అనే పేరుతో ఇందులో వ్యాసం లేదు. వ్యాసాలన్నీ సాహిత్య సంబంధులు గనుక ప్రచురణ కర్తలు ఈ పేరు పెట్టారు. దీనిలో విమర్శకళ, నవల-సంఘ సంస్కారం,

ఆశుకవిత్వం, చిత్రశాల అనే వ్యాసాలు ఏ ఒక్క వ్యక్తిని గూర్చి గాని, గ్రంథాన్ని గూర్చిగాని వ్రాసినవి కావు. సాహిత్య తత్త్వాన్ని వివరించే వ్యాసాలు. సాధారణంగా విమర్శ వ్యాసంలో శాస్త్రీయ విశ్లేషణ ఎక్కువ. కాటూరివారి వ్యాసాలలో కళావిశ్లేషణ ఎక్కువ. శబ్దార్థాలు, తాత్పర్యాలు ఎవరైనా వివరిస్తారు. కవి మనోభావాలను, ఆ భావాలలోని సౌందర్యాన్ని పాఠకులకు సుందరంగా అందించేదే ఉత్తమ విమర్శ అని వీరి భావం. అందుకే విమర్శ గూడా ఒక కళ అని స్ఫురించడానికి విమర్శకళ అని పేరు పెట్టారు. విమర్శ కళను గూర్చి వివరించడానికి ఉదాహరణలుగా వీరు అజంతా గుహాచిత్రాన్ని, మల్లీశ్వరి చలన చిత్రాన్ని గ్రహించడం విశేషం. నవల–సంఘ సంస్కారం శాస్త్రీయ దృక్పథంతో విషయ ప్రధానంగా సాగిన వ్యాసం. శ్రవ్య దృశ్య కావ్యాలలోని సద్గుణాల సమన్వయమే నవల అని వీరి వివరణ. కొందరు ప్రముఖ నవలారచయితలను ఉదాహరిస్తూ నవల సమాజాన్ని ఎలా సంస్కరించడానికి ఉపయోగిస్తుందో తెలిపిన వ్యాసం ఇది. ఆశు కవితాపద్ధతులు, అవధానాలలో ఆశుకవిత కున్న స్థానం, ఆశు కవితలోని సాహిత్యపు విలువలను గూర్చి వివరించిన వ్యాసం ఆశుకవిత్వం. మాచర్లలో చిత్రశాల అనే కళామందిర శంకుస్థాపన సమయంలో చేసిన ప్రసంగం చిత్రశాల వ్యాసం. మాచర్ల ప్రాంతం బ్రహ్మనాయునికి పురిటిగడ్డ అనీ, నాగార్జునాచార్యునకు వాసస్థలమనీ పలికి, ఆ ప్రాంతంలో వెలుస్తున్న చిత్రశాలకు శుభం పలికారు. పలనాటి భూఖండాన్ని శిల్ప సద్మంగా రూపెత్తించమని ప్రజలను కోరారు.

శంభుదాసు సాత్వికత, రవీంద్రుడు – తపోవన సందేశం, ఆ యా కవీంద్రుల ప్రత్యేకతలను సూచించే వ్యాసాలు. కవులను రజోగుణ ప్రధానులనీ, సత్త్వ గుణ ప్రధానులనీ ఇరువర్గాలుగా విభజించి శంభుదాసుని సత్త్వగుణ కవీంద్రునిగా వీరు పేర్కొన్నారు. ఎఱ్ఱనార్యుని గ్రంథాల నుండే ఉదాహరణ లిచ్చి తన వాదాన్ని సమర్థించుకున్నారు. రవీంద్ర కవీంద్రుణ్ణి ఆధారంగా గ్రహించి సంస్కృతిని, ఆ సంస్కృతిపై పాశ్చాత్య నాగరికతా ప్రభావాన్ని వివరించే వ్యాసం రవీంద్రుడు – తపోవన సందేశం.

పేరిగాడు, సరస్వతీ చతుర్ముఖుల శృంగారం ఒక రచయిత గ్రంథంలోని పాత్రను, ఘట్టాన్ని తీసుకొని తనదైన దృష్టితో విమర్శించే వ్యాసాలు. వేదం వేంకటరాయ శాస్త్రిగారి ప్రతాపరుద్రీయ నాటకంలోని 'పేరిగాడు' పాత్రను, ఆ

పాత్ర సృష్టి వలన సృష్టింపబడిన హాస్యాన్ని కొంత హాస్య ధోరణితోనే వివరించిన వ్యాసం ఇది. పదవి పట్టుకొని వ్రేలాడే నాయకులను పేరిగాడిని ఆదర్శంగా తీసుకోమని ప్రబోధించే వ్యాసం ఇది. సరస్వతీ చతుర్ముఖుల శృంగార ఘట్టమే పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయ ప్రబంధానికి ఆయువుపట్టు. ఆ ఘట్టంలోని అన్వయక్లేశాన్ని తొలగించి, ఆ దంపతుల విలాసవృత్తాంతంలోని తాత్త్విక సత్యాన్ని గూడా కాటూరివారు చక్కగా వివరించారు.

మా గురుదేవులు, మా బాపిరాజు, మా బుచ్చిసుందరుని స్మృతి – ఈ వ్యాసాలు మూడు స్మృతి వ్యాసాలు. స్మృతి కవిత లాంటి వ్యాసాలు. కాటూరి వారి గురుదేవులు చెళ్లపిళ్లవారు గతించిన తర్వాత దశాబ్దానికి వ్రాసిన వ్యాసం మా గురుదేవులు. తనకు గురువుగారితో ప్రథమ పరిచయ సన్నివేశాన్ని, గురువుగారి గుణగణాలను జ్ఞప్తికి చేసుకున్న ఈ వ్యాసం భక్తి భావ పూరితం.

మా బాపిరాజు వ్యక్తి చిత్రణకు సంబంధించిన విలక్షణ వ్యాసం. బాపిరాజుగారి భౌతిక మానసిక తత్వాలను వివరించిన వ్యాస మిది. బాపిరాజులో స్త్రీ ప్రకృతి అధికమని – ఆ మాటకు వస్తే కళావంతులందరిలో స్త్రీ ప్రకృతి అధికమని ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన వ్యాస మిది.

మా బుచ్చిసుందరుల స్మృతి మరొక స్మృతి వ్యాసం. మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి కాటూరివారి కవిమిత్రులు. శాస్త్రిగారి మరణానంతరం వారిని గురించి కాటూరి వారి మనసులో మెదలిన స్మృతిశకలాలే ఈ వ్యాసం. మాధవపెద్ది కవిత్వాన్నీ, వ్యకిత్వాన్నీ ఆత్మీయంగా స్మరించుకుంటున్న వ్యాస మిది.

'శ్రీకృష్ణుడు – విదురుడు', 'విదురుని విందు' భట్టాచార్యులవారు చిత్రించిన త్రివర్ణ చిత్రానికి చేసిన కవితామయ గద్య వ్యాఖ్యానం. విదురుని భక్తి భావాన్ని అత్యద్భుతంగా భట్టాచార్యులు వర్ణరూపంలో వివరిస్తే, సుందరవచన రూపంలో వివరించారు కాటూరివారు.

## రూపకములు

ఇప్పుడు దేశంలో వాడవాడలా టీ.వి. ఇంటింటా టి.వి. శాస్త్ర విజ్ఞానం మానవుడికి ప్రసాదించిన వరాలలో ఆనందాయకవరం టి.వి. ఈ టి.వి.లలో ఎన్నో కార్యక్రమాలు. ఆ కార్యక్రమాలలో ప్రధానాలు నాటికలు. ఇప్పుడు టి.వి. ఎంత అపురూపమైన ఆదరణ పొందిందో ఒకప్పుడు రేడియో అంతటి ఆదరణ పొందింది.

మనుష్యులు ఎదురుగా లేకుండా మాట, పాట వినిపించటం పరమాద్భుతంగా తోచేది. ఆ అదృశ్య వాణికే ఆకాశవాణి అని పేరు పెట్టుకున్నారు. ఆకాశవాణిలో ఆనాడు శ్రవ్యనాటికలు ఎన్నో ప్రసారం అయ్యేవి.

రూపకాలలోని నాలుగు రకాలైన అభినయాలు ఆంగికం, ఆహార్యం, వాచికం, సాత్త్వికం. ఈ నాలుగు విధాలైన అభినయాలలో రేడియో నాటికలలో వాచికాభినయానికి మాత్రమే అవకాశం. సాత్త్విక ఆంగిక ఆహార్యాభినయాలకు అవకాశం లేదు. వాచికం ద్వారానే పాత్రల వేషం, పరిసరం, భావం - అన్నీ వ్యక్తం కావాలి. దృశ్యం లేదు. కాబట్టి సుదీర్ఘ సంభాషణలు విసుగు కలిగిస్తాయి. పదునైన చిన్న చిన్న సంభాషణలతో నాటిక నంతా నడపాలి. ఇది రచయితకు, నటునికి కత్తిమీద సాము.

కాటూరి వేంకటేశ్వరరావుగారు రేడియో కోసం కొన్ని నాటికలను వ్రాశారు. ఈ నాటికలలో వీరు వ్రాసిన రసవంతమైన చిన్న చిన్న సంభాషణలలోనే కథాదృశ్యం కనులయెదుట సాక్షాత్కరిస్తుంది.

కాటూరివారు వ్రాసిన రేడియో నాటికలు ఎనిమిది. 1. మువ్వగోపాల 2. పునఃప్రతిష్ఠ 3. నిగమశర్మ 4. నాగార్జునకొండ 5. డాక్టర్ 6. రాధ 7. పెద్దన – కృష్ణరాయలు. 8. శ్రీనివాస కళ్యాణం. ఈ నాటికల సంపుటి మువ్వగోపాల పేరుతో ప్రచురితం. 1961లో త్రివేణీ పబ్లిషర్స్ వారు ఈ సంపుటిని ప్రచురించారు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారికి ఈ నాటికల సంపుటి అంకితం.

**1. మువ్వగోపాల** : మొవ్వ క్షేత్రంలో వెలసిన గోపాలుడే మువ్వగోపాలుడు. ఇందులో కథ గోపాలుని కథ కాదు. ఆ గోపాల భక్తుడైన వరదయ్య కథ. వరదయ్యయే, అనంతర కాలంలో లబ్ధ ప్రతిష్ఠుడైన క్షేత్రయ్య. క్షేత్రయ్య తంజావూరు ప్రభువులైన విజయ రాఘవ నాయకుని సమకాలికుడు. ఈ సంగీత నాటికలో విజయరాఘవుడు, అతని ప్రేయసి రంగాజమ్మ గూడా పాత్రధారులు. ఈ చారిత్రక నాటికలో మధురభక్తి భావం పరిమళిస్తుంది. మోహనాంగీ వరదయ్యల ప్రణయం ఇందలి ఇతివృత్తం. వాగ్గేయకారుడైన క్షేత్రయ్య కథను అతని పదాల నుపయోగించుకుంటూ రచించడం ఇందలి ప్రత్యేకత. ఆనాటి సాంఘిక పరిస్థితులకు దర్పణం ఈ నాటిక. కాటూరివారి రచనకు తెలుగు పలుకుబడులు సహజాలంకారాలు.

'అరి నీ తల్లి కడుపు బంగారం కాను' నాటిక ప్రారంభం

**2. పునఃప్రతిష్ఠ** : ఇది చారిత్రకేతి వృత్తం గల నాటిక. దాయాదులచే రాజ్యం కోల్పోయిన మనుమసిద్ధిని తిక్కనామాత్యుడు కాకతిగణపతి దేవుని సహాయంతో నెల్లూరు సింహాసనంపై పునఃప్రతిష్ఠితుణ్ణి చేయటం ఇందలి కథ.

**3. నిగమశర్మ** : తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యంలోని నిగమశర్మ కథను కాటూరివారు చక్కటి నాటికగా మలిచారు. క్షేత్ర మాహాత్మ్యం వలన ఎంతటి దుష్టుడైనా మోక్షాన్ని పొందగలడని నిరూపించే కథ ఇది. తెనాలికవి నిగమశర్మ సోదరికి పేరు పెట్టలేదు. నిగమశర్మ అక్కగానే ఆమెకు ప్రసిద్ధి. కాటూరివారు ఆ పేరులేని పడతికి సుమతి అని సార్థక నామకరణం గావించారు.

**4. నాగార్జునకొండ** : చారిత్రకేతి వృత్తం గల కాటూరివారి మరొక నాటిక నాగార్జున కొండ. నాగార్జునుని నుండి నాగార్జున సాగర నిర్మాణం వరకు సంభవించిన చారిత్రక పరిణామమంతా ఈ నాటికలో ప్రదర్శితం. క్రీ.శ. 1వ శతాబ్ది నుడి 20వ శతాబ్దం వరకు గల కాలంలో 1. గౌతమీపుత్ర శాతకర్ణి 2. ఇక్ష్వాకులు 3. 3వ శతాబ్దానికి చెందిన వీరపురుష దత్తుడు 4. 20వ శతాబ్దం. ఇందులోని 4 భాగాలలో బౌద్ధమత ప్రాభవ నాశనాలు చక్కగా వివరింపబడ్డాయి.

కృష్ణవేణిపై కమ్మని పాటతో నాటికకు భరతవాక్యం.

**5. డాక్టర్** : ఇది ఈ సంకలనంలోని ఏకైక సాంఘిక నాటకం. శాస్త్రీయ దృక్పథం అంటూ ఇంగ్లీషు డాక్టర్లు ఇతరుల విశ్వాసాలను హేళన చేస్తుంటారని, స్వవిషయం వచ్చేసరికి నీరు గారి పోతుంటారని నిరూపించే సాంఘిక నాటిక ఇది. విశాలాక్షమ్మ విభూతి పెట్టించాలనీ, అభిషేకం చేయించాలనీ తాప త్రయపడుతుంది. ఆయుర్వేదం వలన గుణం ఉంటుందని నమ్ముతుంది. ఇంగ్లీషు డాక్టరు తన వైద్యం తప్ప మరోటి వైద్యం కాదంటాడు. అభిషేకం మొదలైనవి వెర్రినమ్మకా లంటాడు. తన భావాలను తీవ్రంగా వెల్లడించి ఎదుటి వారిని బాధ పెడతాడు. చివరకు ఆ డాక్టరుకే జబ్బుచేస్తే తన మందులను నమ్మడు. తోటి డాక్టర్లను నమ్మడు. విభూతి కోసం, అభిషేకం కోసం అలమటిస్తాడు. ఈ నాటిక వలన కాటూరివారు మానవ ప్రయత్నంతోపాటు, దైవంపై విశ్వాసం గూడా ఉండా లని బోధించారు. పూర్వకాలపు గ్రామ జీవనంలోని అపేక్షలను సహజ సుందరంగా వర్ణించారు. సున్నితమైన మొరటు హాస్యం గూడా సందర్భానుసారంగా వర్ణితం.

**6. రాధ :** ముద్దుపళని రాధికా సాంత్వనాన్ని అనుసరిస్తూ వ్రాసిన ఏకపాత్ర ప్రవర్తిత రూపకం. పరకీయ శృంగారానికి పట్టం కట్టిన గ్రంథం ముద్దుపళని రాధికా సాంత్వనం. ఆడది వర్ణించిన అవధి మీరిన శృంగార కావ్యం రాధికా సాంత్వనం. శృంగార కావ్యం అనడం మర్యాద తప్పనిమాట. బూతుల బుంగ అయిన ముద్దుపళని కావ్యం కాటూరివారి చేతిలో శృంగార కలశంగా మారింది. రాధికా సాంత్వనంలోని రాధాకృష్ణులు ప్రేమ ఐహిక వాంఛ కాగా కాటూరివారి రాధాకృష్ణుల ప్రణయం మధురభక్తికి రూపాంతరం. ముద్దుపళని కావ్యాన్ని అనుసరించినా కాటూరివారు తనకు తోచిన మార్పులు చేసి స్వాతంత్ర్యాన్ని ప్రకటించారు. తెనుగుదనంతో నిండిన భాషతో ఆకర్షణీయమైన రచన 'రాధ'.

**7. పెద్దన - కృష్ణరాయలు :** ఈ కవిరాజ రాజకవుల సమావేశం స్వర్గంలో జరిగినట్లు వర్ణించారు కాటూరివారు. అనంతర కాలంలో విజయనగరంలో జరిగిన పరిణామాలను గూర్చి వీరిరువురూ సంభాషించుకుంటారు. తిమ్మరుసు కనులు తీయించిన అపవాదు రాయలపై తొలగించారు కాటూరివారు. భువనవిజయంలోని కవీంద్రుల ప్రస్తావన, ఆముక్త మాల్యద మను చరిత్రల ప్రస్తావన ఈ సంభాషణాత్మక నాటికలో ఉన్నది. రాయలు హిందూ రాజ్యస్థాపన కోసం లోకాన్ని రణరంగంగా మార్చటం దోషమనీ, అశోక చక్రవర్తిలాగా ప్రేమబలంతో బహిరంతశ్శత్రువులను ముట్టపెట్టటం సమంజసమనీ భావిస్తారు. ఈ భావం రాయల వారిది కాదు. ఈ గాంధేయవాద భావం కాటూరి వారిది.

**8. శ్రీనివాస కల్యాణం :** ఇది కాటూరివారు రచించిన యక్షగానం. నృత్యనాటిక. ఆకాశవాణిలో ప్రసారం అయింది కాబట్టి శ్రవ్యయక్షగానం. ప్రదర్శనానుకూలం గనుక యక్షగానరూపకం. శ్రీనివాస కల్యాణ గాథ పురాణ ప్రసిద్ధం. హిందూ సమాజ ప్రసిద్ధం. కందార్ధాలు, ద్విపదలు, సీసాలు, వృత్తాలు, దరువులతో యక్షగాన సంప్రదాయానుగుణంగా సాగిన రచన యిది.

## అనువాదాలు

ప్రపంచంలో ఏ వ్యక్తీ సర్వజ్ఞుడు కాడు. ఏ భాషా స్వయం సంపూర్ణం కాదు. ఎంతటి గొప్ప భాషకైనా అన్య భాషల ప్రభావం అంతో ఇంతో ఉండకుండా ఉండదు. ఇది దోషం కాదు. పైగా గుణం గూడాను. ఇతరులు పండించిన విజ్ఞాన ఫలాలను అనుభవించటానికి అవకాశం కలిగించే ప్రక్రియ అనువాదం. ఆంధ్ర భాషపై సంస్కృతాంగ్ల భాషల ప్రభావం అధికం. ఈ రెండు భాషల నుండి

కాటూరివారు కొన్ని అనువాదాలను చేశారు. కాటూరివారు సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో నిష్ణాతులు. ఆ రచన ముందుగా మనకు తెలిస్తే తప్ప పఠన సమయంలో అనువాదం అనిపించకుండా స్వతంత్రగ్రంథమూ అనిపించేటట్లు రచన చేయగలగడం కాటూరి వారికి జన్మసిద్ధం. అందువలననే కాటూరివారి అనువాద రచనలు గూడా ఆంధ్ర భాషా సరస్వతి కమూల్యాభరణాలే.

## భాసానువాదాలు

సంస్కృత రూపక రచయితలలో సుప్రసిద్ధుడు భాసుడు. కాళిదాసంతటి మహాకవికి ప్రారంభదశలో భయం కల్గించిన కవీంద్రుడు భాసుడు. అత్యద్భుత నాటక నిర్మాణం వలన సహృదయ హృదయ వాసుడు భాసుడు. ప్రదర్శన యోగ్యత భాసుని నాటకాలలోని సద్గుణం. క్లుప్త సంభాషణలు, జాతీయమైన శైలి, పాత్రోచిత భాషాప్రయోగం భాస భారతీహాసాలు. ఈ సల్లక్షణాలన్ని కాటూరివారి నాకర్షించాయి. ఆ నాటకాల ననువాదం చేయాలన్న ఉత్సాహాన్ని కలిగించాయి. భాసుని నాటకాలలో చారిత్రక కాల్పనిక గాథా సమ్మేళనాలైన ప్రతిజ్ఞా యౌగంధ రాయణం, స్వప్నవాసవదత్తాలను రసోచితంగా అనువదించారు. ఈ రెండు నాటకాలు దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి పక్షాన 1967లో ప్రకటితాలు.

ఈ రెండు నాటకాలలోని కథ సుప్రసిద్ధం. వత్సరాజైన ఉదయనుడు, అవంతీ రాకుమారి వాసవదత్తల ప్రణయ వృత్తాంతం ప్రతిజ్ఞాయౌగంధరాయణంలోని కథ. మాయోపాయంతో తన ప్రభువైన వత్సరాజును బంధించిన అవంతీపతికి తగినరీతిలో బుద్ధి చెప్పిన వత్సరాజు మంత్రి యౌగంధరాయణుడు. యౌగంధ రాయణుడు తన ప్రభువును బంధవిముక్తుణ్ణి చేయడానికి చేసిన ప్రతిజ్ఞలకు, ఆ ప్రతిజ్ఞలను చెల్లించుకోవడానికి వేసిన ఎత్తుగడలకు ప్రాధాన్యాన్నిచ్చి భాసుడు ఈ రూపకానికి ప్రతిజ్ఞాయౌగంధరాయణం అని నామకరణం చేశారు. నాయకుడైన ఉదయన పాత్ర రంగస్థలంపై ప్రవేశించక పోవడం ఈ నాటకంలోని విశేషం. నాయకుని గూర్చిన తదితర పాత్రల ప్రసంగాల వలన కథాగమనం సాఫీగా సాగిపోతుంది.

తన ప్రభువైన ఉదయనుడు సార్వభౌముడు కావాలంటే మగధరాజైన దర్శకుని సోదరి పద్మావతిని ఉదయనుడు వివాహం చేసుకోవటమే మార్గమని

యౌగంధరాయణుడు నిశ్చయించుకున్నాడు. ఒక ఉపాయాన్ని ఆలోచించాడు. వాసవదత్త అంగీకారంతోనే ఆ పథకాన్ని అమలు చేశాడు. వాసవదత్త అగ్నిప్రమాదంలో మరణించిందని నమ్మించాడు. పద్మావతీ ఉదయనుల వివాహం జరిగి, ఉదయనుని సార్వభౌమత్వం స్థిరపడిన తర్వాత వాసవదత్త ఉదయనులు చేరువౌతారు. ఇద్దరు రాణులతో ఉదయనుడు సుఖిస్తాడు. స్వప్నవృత్తాంతం ఇందులో ప్రధానం గనుక ఈ నాటకానికి స్వప్నవాసవదత్తం అని పేరు.

ఈ రెండు నాటకాలను కాటూరి వేంకటేశ్వరరావు గారు చక్కగా అనువదించారు. సంస్కృత నాటకానువాదాలు యథామూలకానువాదాలు కావాలి. కాటూరివారు మూల విధేయంగానే అనువదించినా కొన్నిచోట్ల మూలాన్ని సంగ్రహించటం, కొన్నిచోట్ల విస్తరించటం జరిగింది. మూలంలోని సంబోధనలను యథాతథంగా కాకుండా తెలుగు జాతీయత కన్పట్టేట్టు సరసానువాదం చేశారు. భర్తృదారిక అనే పదాన్ని యథామూలకానువాదం కాకుండా 'చిన్నమ్మ'గారు అన్నారు. ప్రభువును ఏలినవారన్నారు. 'ఆర్య వసంతకః' అన్న పదాన్ని సందర్భానుగుణంగా చెఱపన చేట అని, దాస్యాః పుత్రైర్మధుకరైః అనే పదసముచ్చయాన్ని తుమ్మెద తొత్తుకొడుకు లనీ వారు అనువదించారు.

అనువాద విషయంలో శ్లోకాలను పద్యాలుగా మార్చటం, వచనాన్ని వచనంగా అనువదించటం యథామూలకానువాద పద్ధతి. కాని కాటూరివారు కొన్ని శ్లోకాలను వచనాలుగా అనువదించారు. కొన్ని వచనాలను పద్యాలుగా అనువదించారు. కొన్నిచోట్ల మూలంలో లేకపోయినా పాటలు గూడా వ్రాశారు. జాతీయాలు వాడటం ఎలాగూ ఉన్నది. యథామూలకానువాదానికి ఉదాహరణం.

**''కాష్ఠాదగ్నిర్జాయతే మధ్యమానాత్**
**భూమిస్తోయం ఖన్యమానా దదాతి**
**సోత్సాహానాం నాస్త్యసాధ్యం నరాణాం**
**మార్గారబ్ధాః సర్వయత్నాం ఫలన్తి''** ప్ర.యౌ.

**''కాష్ఠమును మథింప మథింప గలుగు నగ్ని**
**నేల త్రవ్వంగ త్రవ్వంగ నీరు వొడము**
**ఫలమొసగు సక్రమారబ్ధములగుపను, ల**
**సాధ్యమే యుండ దుత్సాహశక్తి యున్న''**

సంస్కృతాంధ్ర పదాల సుఖసమ్మేళనంగా సాగిన ఆంధ్రీకరణమిది. మధింపమధింప, త్రవ్వంగత్రవ్వంగ అని క్రియా పదాలను రెండుమార్లు ప్రయోగించటం వలన భావస్ఫూర్తి అధికమయింది.

**''ధన్యాస్సురభిర్మత్తాః ధన్యాస్సురభిరనులిప్తాః**
**ధన్యాస్సురభిస్నాతాః ధన్యాస్సురభిస్సంజ్ఞాపితాః ప్ర.యౌ**

**''ఒళ్లు దెలకుండాను కల్లుతాగాలి**
**కల్లుతో ఒళ్లంత కలయ బులమాలి**
**కల్లులో మునగాలి ఒళ్లు దెలియాలి**
**చావాలి కల్లుతో సొరగ మెల్లాలి**
**కల్లు ముంతెప్పటికి చల్లగుండాలి''**

ఇది లయానుగుణంగా పాడుకోవడానికి వీలైన పాట. గ్రామ్యభాష నుపయోగించటం సహజత్వం కోసం. పైగా తాగుడును గూర్చిన పాట గదా!

పొట్టన బెట్టుకొను, కొట్టిన పిండి, ముమ్మాటికి, చూడముచ్చట, బంగారు తల్లి, బాగా బతికినవారు, బెంగపెట్టుకొను, పప్పులుడుకు వంటి జాతీయాలు అనేకం.

ఈ రెండు భాసనాటకాలలో అనేక శ్లోకాలను కాటూరివారు వచనంగా అనువదించారు. పద్యాల సంఖ్య ఎక్కువైతే ప్రదర్శన యోగ్యత తగ్గుతుందని వారి భావమేమో! యౌగంధ రాయణంలో గ్రామీణ పాత్రలు అధికం. వాసవదత్తలో అంతఃపుర పాత్రలు అధికం. అందువలన ప్రతిజ్ఞలో అధికంగా తెలుగు పదాలను, వాసవదత్తలో సంస్కృతపదాలను ఉపయోగించారు.

మొత్తంమీద ఈ రెండు నాటకానువాదాలు చక్కని రీతిలో సాగాయి. ఈ నాటక ద్వయాన్ని అనువదించిన వా రనేకులు. అయినా కాటూరి వారి తీర్పు వేరు. వారి నేర్పు వేరు.

## ఆంగ్లానువాదాలు - జీవిత చరిత్రలు

జాతీయనాయకుల ఆదర్శ జీవితాలను విద్యార్థులకు వివరిస్తే వారిలో దేశభక్తి భావం పెంపొందటం తథ్యం. ఈ దృష్టితో కాటూరివారు ముగ్గురు జాతీయనాయకుల చరిత్రలను అనువదించారు. భరతన్ కుమారప్ప రచించిన గాంధీగారి సంక్షిప్త జీవిత చరిత్రను కాటూరివారు 'సత్యశోధన' పేరుతో

ఆంధ్రీకరించారు. మౌలానా అబుల్ కలాం అజాద్ అనే గ్రంథం మహదేవదేశాయి గారి ఆంగ్ల రచనకు అనువాదం. రవీంద్రుని గూర్చి లీలా మజుందార్‌గారు రచించిన ఆంగ్ల గ్రంథాన్ని కవీంద్ర కథ పేరుతో ఆంధ్రీకరించి సాహిత్య అకాడమీ వారి ప్రచురణగా వెలయించారు. ఈ మూడు గ్రంథాలు విద్యార్థుల నుద్దేశించి వ్రాసినవి కనుక భాష సరళ సుందరమైన గ్రాంథిక భాషలో సాగింది. సత్యశోధనలో అచ్చ తెనుగు పదాలు వాడాలనే పట్టుదల ఎక్కువకావడం వలన కాబోలు ఒజ్జ, ప్రెగ్గడ, కల్లరీడు, నెయ్యుడు, తెక్కలించు, సాగసుకాడు వంటి శబ్దాల నుపయోగించారు. విద్యార్థులు ఈ కొన్ని క్రొత్త పదాలనైనా నేర్చుకోవాలని వారి ఉద్దేశం కాబోలు!

## ఆంగ్లానువాదాలు - నవలలు

అలెగ్జాండర్ డ్యూమాస్ ఆంగ్ల నవల బ్లాక్‌బు లిప్ అనే నవలను కాటూరి వారు నల్లకలువ పేరుతో అనువదించారు. ఈ నవలాగాథ, నవలారచయిత రెండూ వైదేశికమైనవే. నల్ల కలువ నవల చారిత్రక నేపథ్యమున్న ప్రేమ కథ. ముగ్గురు మూర్తులు నవల ఎ.యస్.పి. అయ్యర్ రచించిన త్రీమెన్ ఆఫ్ డెస్టినీ అనే ఆంగ్ల నవలకు అనువాదం. ఈ నవలా కథ, నవలా రచయిత స్వదేశ సంబంధులే. భాష మాత్రమే ఆంగ్లం. అలెగ్జాండరు, చంద్రగుప్తుడు, చాణక్యుడు, ఈ నవలలోని ముగ్గురు మూర్తులు. అలెగ్జాండర్ దండయాత్రా కాలంతో ఆరంభమైన ఈ నవలా గాథ చంద్రగుప్తుని పట్టాభిషేకం, సెల్యూకస్ పరాజయం మున్నగు చారిత్రకాంశాలతో శోభించింది. 1944లో నల్లకలువ, 1950లో ముగ్గురు మూర్తులు నవల ప్రచురింపబడ్డాయి. సరళ గ్రాంథికంలో సాగిన అనువాదా లివి. ముగ్గురు మూర్తులు నవలలో గ్రీకు నామాలను సంస్కృతీకరించి వీరు నవలలో విదేశ వాతావరణాన్ని తొలగించారు.

## ఆంగ్లానువాదాలు - నాటికలు

ఎ.ఎన్.పి. అయ్యర్ గొప్ప జాతీయవాది. ఐ.పి.యస్. పాసై బందరులో జిల్లా జడ్జీగా ఉద్యోగం చేస్తున్నప్పుడు కాటూరివారితో పరిచయమైంది. పరిచయం స్నేహంగా మారింది. అయ్యర్ ఆంగ్ల నవల త్రీమెన్ ఆఫ్ డెస్టినీని కాటూరివారు ముగ్గురు మూర్తులు పేరుతో అనువదించారు. ఈ నవలా ప్రచురణకు పుష్కరం ముందే అయ్యర్ గారి మూడు ఆంగ్ల నాటికలను కాటూరివారు 'సీత పెండ్లి'

పేరుతో అనువదించారు. సీతపెండ్లి, ధర్మపథము, భావ బంధనము ఆ మూడు నాటికలు. సీత పెండ్లిలో బాలవితంతువుల పునర్వివాహ సమస్య, పరిష్కారం ప్రధానాంశం. ధర్మపథం నాటికలో దైవభక్తి, సత్యాహింసల ప్రాధాన్యం వివరించబడింది. భావబంధనంలో స్వేచ్ఛ పేరుతో స్త్రీల విశృంఖల విహారం, తద్వారా వారెదుర్కొనే కష్టనష్టాలు వివరింపబడ్డాయి. మరుగున పడుతున్న పాత సంప్రదాయాలకు, వెలుగులోకి వస్తున్న కొత్త సంస్కరణలకు ఉధాహరణలైన నాటికలివి

## సంకలనాలు

కాటూరి వారి వివిధ రచనల వలన వారు సత్కవియని, సద్విమర్శకుడని, ఉత్తమానువాదకుడని, ఉత్తమ రూపక రచయితయని స్పష్టమైంది. అంతేకాదు. కాటూరి వారు ఉత్తమ సంకలన కర్త గూడా. సాహిత్య రంగంలో సంకలన గ్రంథాలకు అనాది నుండి ఆదరణ లభించింది. కట్టమంచి సుబ్రహ్మణ్య కవి సంకలనం చేసిన భారత భాగవత రత్నములు, దాసరి లక్ష్మణ స్వామి సంకలనం చేసిన వర్ణన రత్నాకరం ఇందుకు ఉదాహరణలు. ప్రాచీన కాలంలో సంకలన గ్రంథ నిర్మాతలు అంకిత భావం గల కొందరు వ్యక్తులు. నవీన కాలంలో ఈ కార్య భారాన్ని సంస్థలు నిర్వహిస్తున్నాయి. ఇక్కడ గూడా సంస్థ తరపున బాధ్యత నిర్వహించేది వ్యక్తులే. కేంద్ర సాహిత్య అకాడమీ వారి ఆదేశానుసారం కాటూరి వారు తెలుగు కావ్యమాల అనే సంకలన గ్రంథాన్ని 1959లో సిద్ధం చేశారు. వేయేండ్ల తెలుగు సాహిత్యంలో లబ్ధప్రతిష్ఠులైన వందమంది కవుల కావ్యాలలోని ఘట్టాలను, పద్యాలను కాటూరివారు సంకలనం చేశారు.

సంకలన కార్యంలో సంకలనకర్తలు కొన్ని పద్ధతుల ననుసరిస్తారు. కవుల గ్రంథాలలోని మంచి పద్యాలను సేకరించి ప్రచురించటం ఒక పద్ధతి. కరుణశ్రీ కవీంద్రులు సంకలనం చేసిన కల్యాణ కల్పవల్లి ఈ పద్ధతి కుదాహరణ. కవుల కావ్యాలలోని రసవద్ఘట్టాలను సంకలనంచేసి పాఠకులకు పరిచయం చేయటం మరొక పద్ధతి. గంటి జోగిసోమయాజిగారు సంకలనం చేసిన ప్రాచీన కావ్యమంజరి రెండవ పద్ధతి కుదాహరణం. తెలుగు శారదను మేలేర్చిన పూలతో అర్చించే పద్ధతి ఒకటి కాగా, ఆంధ్ర భారతిని మధుర ఘట్ట సుమహారంతో అలంకరించే పద్ధతి. రెండవది. రెండూ మంచి పద్ధతులే. కాటూరివారు ఈ రెండూ మంచి

పద్ధతులనే భావించారు. అందువలననే సమయానుకూలంగా రెండు పద్ధతులు అనుసరించారు. పద్యాలకూ, ఘట్టాలకూ సముచితమైన శీర్షికలుంచారు. శతాధిక రచయితలను గూర్చిన సంక్షిప్త వివరణలను సమకూర్చారు. ''అందులో జేరవలసిన ప్రముఖుల రచనలు మరెన్నో చేరకపోయినా – చేసినంతవరకు చక్కని కృషి అది'' అని ఎల్లోరా విమర్శపూర్వక సంస్తుతి. ఎంతటివారు, ఎంత జాగ్రత్తగా చేసినా విమర్శ తప్పదు. అకాడమీ వారి ఈ ప్రచురణ ఆంధ్రుల నలరించటం వలననే ఈ గ్రంథం ద్వితీయ ముద్రణకు నోచుకున్నది.

## వ్యాఖ్యానాలు

కాటూరివారు విద్యార్థుల ప్రయోజనా న్నాశించి కొన్ని ప్రాచీన కవీంద్రుల రమణీయ ఘట్టాలకు వ్యాఖ్యానాలు వ్రాశారు. సర్వోదయ గ్రంథమాలవారు ప్రచురించిన 'కావ్యతోరణం' ఇట్టి వ్యాఖ్యాగ్రంథం. ఈ గ్రంథంలో నన్నయ దుష్యంతోపాఖ్యానం, శ్రీనాథుని గుణనిధి కథ, ధూర్జటి శ్రీకాళహస్తి కథ, కంకంటి వారి సీతాపరిత్యాగ వృత్తాంతం కాటూరివారి వ్యాఖ్యతో శోభించాయి. ప్రతి పాఠ్యభాగానికి వీరు చక్కని పీఠిక వ్రాశారు. ప్రతి పద్యానికి టీకా తాత్పర్యాలు వ్రాశారు. సర్వోదయ గ్రంథమాల వారే కాటూరివారి వ్యాఖ్యానంతో ప్రహ్లాద చరిత్రను గూడా ప్రచురించారు. ఈ గ్రంథాలను విద్యార్థుల కోసం వ్రాసినా పిన్నలతో పాటు ఈ వ్యాఖ్యానం పెద్దలకు కూడా ఉపయోగకరం.

కాటూరివారు ప్రత్యేకంగా రచించిన కావ్యాల వలన, ఖండికల వలన, అనువాదాల వలన, విమర్శల వలన, రూపకాల వలన, సంకలన వ్యాఖ్యానాల వలన వారికి వివిధ ప్రక్రియా రచనలో గల విశేష ప్రతిభ వ్యక్తమౌతున్నది. అశేష పాఠకుల ఆదరాభిమానాల నందుకోగల సాహిత్యస్ఫూర్తి స్పష్టమౌతున్నది.

## 10. ఈ సమస్కంధుల సంధులు - విసంధులు

వియ్యానికి గానీ, నెయ్యానికి గాని, కయ్యానికి గాని సమానత్వం తప్పనిసరి. తెలుగు సాహిత్యంలో వెలసిన జంటకవుల సంబంధం రెండు రకాలు. మొదటిది రక్తసంబంధం. రెండవది సాహిత్యానురక్త సంబంధం. ఈ సంబంధం ఎటువంటిదైనా ఆ జంటకవుల శక్తి సామర్థ్యాలు సమాన స్థాయిలో ఉన్నప్పుడే ఆ జంట సాహితీ లోకంలో సముచిత స్థానం సంపాదించుకుంటుంది. మొగమోటాలకు జంటకవులుగా మారినవారు, స్థాయీ భేదం వుండి కూడా జంటకవులుగా చేరినవారు ఎంతో కాలం సహ జీవనం సాగించలేరు.

పింగళి కాటూరి కవులు బంధువులు, ఏకమానసులు, బాల్య సఖులు, సహపాఠులు, సమస్కంధులు. అందువలననే వీరు జంటకవులుగా మిక్కిలి కీర్తి నార్జించారు. ఈ జంటకవు లిరువురిలోని సమాన అంశాలను సమీక్షిద్దాం.

వీరిద్దరూ కవి పండిత వంశంలో జన్మించారు. పింగళివారు పింగళి సూరన వంశజులు కాగా కాటూరివారు చదలవాడ ఎఱ్ఱన వంశజులు. ఇరువురూ బందరు పట్టణంలో ఒకే గురువు చెంత విద్యనభ్యసించారు. ఇద్దరూ బంధువులు. కాటూరి వారి మేనకోడలు పింగళివారి బావమరిది భార్య. విద్యాభ్యాస సమయంలో పింగళివారికి ఆర్థిక సమస్యలవలన చదువుకు కొంత ఆటంకం ఏర్పడితే, శ్రద్ధచాలక కాటూరివారికి గూడా ఆటంకం కలిగింది. పింగళివారికి వేంపటి నరసింహంగారు ఆర్థిక సమస్యను అధిగమించడానికి సహకరించారు. అల్లరి చిల్లరిగా తిరుగుతున్న కాటూరి వారిని బొడ్డపాటి వేంకటేశ్వరరావుగారు మంచి మార్గములో పెట్టి విద్యావంతులు కావడానికి సహకరించారు.

పింగళి కాటూరి కవులిరువురూ సమకాలికులచే మహాకవులుగా సంభావింప బడ్డారు. కాటూరి వారికి వారి కాలంలో మహాకవి అనే మాట పర్యాయ నామంగా ప్రచారంలో ఉన్నది అయినా వీరిద్దరికీ మహాకవులనిపించుకోవటం పెద్దగా ఇష్టంలేదు.

'ఆత్మలహరి'లో పింగళివారు ''మహాకవి యన్న కీర్తి యాంధ్రోర్వి'' లభించినదని చెప్పుకున్నారు. కాని వారికి కవి అనిపించుకోవటం కంటె 'ప్రొఫెసర్' అనిపించుకోవటమే ఎక్కువ ఇష్టం. ఇందుకు పింగళివారి ప్రియ శిష్యులు డాక్టర్ ప్రసాదరాయ కులపతిగారు చెప్పిన ఉదంతం ఉదాహరణ. పింగళివారు అనారోగ్యంగా ఉన్నారు. డాక్టరు దగ్గరకు వెళ్లి ''ప్రొఫెసర్ గారు మందు తీసుకురమ్మన్నా''రని చెప్పమని పింగళివా రొక వ్యక్తిని పంపారు. డాక్టరుగారు ''కవిగారికి ఈ మందు''లివ్వమని ఆ వ్యక్తికే చెప్పి పంపారు. ఈ సంఘటనను బట్టి పింగళివారిని కవీంద్రుడుగా లోకం గుర్తిస్తే, ప్రొఫెసర్‌గా గుర్తింపు నందాలని పింగళివారు భావించినట్లు తెలుస్తున్నది.

కాటూరి వారు గూడా అంతే. రాచకొండ నరసింహమూర్తిగారు కాటూరి వారి దగ్గరకు వచ్చి ''మహాకవులకు నమస్కారం'' అన్నారట. వెంటనే కాటూరివారు ''నన్ను పెద్దమనిషి అనండి చాలు. మహాకవి వద్దు'' అన్నారట! దీనిని బట్టి కాటూరి వారికి మహాకవి అనిపించుకోవటం కంటె మంచి మనిషి అనిపించుకోవటమే ఇష్టమని అర్థమౌతున్నది.

అయినా వీరిరువురినీ లోకం మహాకవులుగానే గౌరవించింది. వారి కవితా శక్తి అంతటిది.

పింగళి కాటూరి కవు లిర్వురకూ గురుభక్తి అధికం. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారికి జబ్బు చేసినప్పుడు విశాఖలో తన ఇంట్లో ఉంచి పింగళివారు మంచి వైద్యులను రప్పించి వైద్యం చేయించారు. కాటూరివారు గూడా బందరులో వైద్యం చేయించడానికి ప్రయత్నించారు. ఈ అంతేవాసుల గురుభక్తిని – ముఖ్యంగా పింగళివారు చేసిన సపర్యలను మెచ్చుకొని చెళ్లపిళ్లవారు 'ఆరోగ్య భాస్కరం'లో కొన్ని పద్యాలు వ్రాశారు. అందులో ఒక పద్యం

**''గురులం గొల్తురు గాక శిష్యు లెలమిన్ కోటానుకోట్లిచ్చి సం**
**బరముల్ గూర్తురుగాక వ్యాధితుల నిర్బంధించి రప్పింతురే!**
**పరమ ప్రీతిని వారి చుట్టములు సంభావింతురే! బత్తి కొ**
**త్తరకం బియ్యది నీవు నిట్టి దెచటన్ దర్శించితే! భాస్కరా!''**

చెళ్లపిళ్ల వారికి ఆ శిష్యులిద్దరిపైనా అమిత వాత్సల్యం. పింగళివారు చెళ్లపిళ్లవారి చెంత శుశ్రూష చేస్తున్న రోజులలో లక్ష్మీకాంతంగారు లేకుండా సాహిత్య గోష్ఠి జరిపేవారు కారుట! తన ప్రసంగాలన్నీ పింగళివారు వినాలని

చెప్పేవారట! అది విద్యాబోధనలో భాగమే. చెళ్లపిళ్లవారు తన అంత్య సమయంలో తన శాలువా కాటూరి వారి కీయమని తన పుత్రుని ఆదేశించారుట! ఆ శాలువాను కాటూరివారు కన్నీళ్లతో స్వీకరించారు. ఈ ఇద్దరు ఛాత్రులు గురుకృప నందిన వారని ఈ ఘట్టాలను బట్టి గ్రహించవచ్చు.

పింగళి కాటూరి కవు లిరువురూ అధ్యాపక వృత్తినే చేపట్టారు. పింగళివారు బందరు కాలేజీలో, ఆంధ్ర విశ్వ విద్యాలయం ఆంధ్రశాఖలో, తిరుపతి విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో అధ్యాపక వృత్తిని నిర్వహించగా, కాటూరివారు బందరు కాలేజీలో ఆచార్యకత్వం నెరిపారు. ఇద్దరూ శిష్య వత్సలులు అయిన ఆదర్శ గురువులు. గురువును దైవంగా భావించే ఆదర్శ శిష్యులు. ఈ ఇరువురు ఎంత గుర్వాజ్ఞ పరిపాలకులలో అంత శిష్య పరిపాలకులు.

పింగళి కాటూరి కవీంద్రు లిర్వురూ ఆస్తికులు. పింగళివారి ఆత్మలహరి 'తిరుపతి యాత్ర' ఖండికతో ప్రారంభం కాగా, కాటూరి వారి పన్నీటి జల్లు శ్రీ ఆంజనేయ స్తోత్రంతో మొదలైంది. ఈ తిరుపతి వేంకటకవుల భక్తులు ఇరువురూ తిరుపతి వేంకటేశ్వరస్వామి భక్తులే. ఆ స్వామిపై కవిత లల్లినవారే.

ఈ చట్టల ప్రియులు ఇద్దరూ చుట్టల ప్రియులే. కాటూరివారైతే చుట్టలను గూర్చి చమత్కార సంభాషణలే చేస్తారు. పండుకోబోయే ముందు చుట్టలు ముట్టుకొని పండుకుంటారేమిటి? అని అడిగినవారికి ఆదిశేషుడు కూడా చుట్టలు చుట్టుకొనే పండుకుంటాడని వీరి చమత్కారం. ఈ కవులిర్వురకూ గల అలవాట్లలో చీట్లపేక మరొకటి. ఆచుట్ట, పేక మానెయ్యమని వందసార్లు చెప్పానని కోలవెన్నువా రనగానే, ''అవి రెండూ మానేస్తే ఇక నేను ఏం చెయ్యటాని కట!'' అని కాటూరివారి చమత్కార సంభాషణ.

పింగళి కాటూరి కవు లిరువురూ స్నేహ ప్రియులు. బందరు కోటకు వెళ్లే దారిలో బొంబాయి అనే ప్రదేశంలో బందరు కవితా సమితివారు సమావేశమై సాహిత్య చర్చలు సాగిస్తుండేవారు. పింగళి, కాటూరి కవులిర్వురూ ఆ సమావేశాలకు హాజరౌతుండేవారు. అందరూ పరస్పరం స్నేహానుభావాలతో జీవించేవారు. ఇక కాటూరి వారి స్నేహ సంపద ఇంతింతనరానిది. ఆధునిక యుగ కవులందరితో వారి కెంతో అనుబంధం. కృష్ణశాస్త్రి, బాపిరాజు, మాధవపెద్ది, తుమ్మల, విశ్వనాథ మొదలైన మహామహులందరూ కాటూరివారికి సాహిత్య బంధువులు. పింగళివారు కూడా స్నేహప్రియులే. వారితో స్నేహం చేసినవారు మొదట ఏమండీ అంటూ ప్రారంభించి వారం రోజుల్లో ఏమిరా? అంటూ మార్పు చెందేవారు.

ఈ జంటకవులిరువురూ దానగుణ సంపన్నులు. అడగకపోయినా ఎదుటివారి అవసరాన్ని గుర్తించి సహాయపడటం వీరి సహజగుణం. పై చదువుల కోసం తాను పడిన శ్రమ గుర్తుతెచ్చుకొని శిష్యులకు పింగళివారు సహకరించేవారు. పింగళివారి శిష్యుడు కమలాకర వేంకటరావు పేదవాడు. ఆర్థిక కారణాల వలన కాలేజీ చదువుకు ఆటంకం ఏర్పడినప్పుడు పింగళివారు సాయపడిన విషయం ఆత్మలహరి సమీక్షా సమయంలో తెలుపబడింది.

ఇక కాటూరి వారి పరోపకార పరాయణత్వాన్ని గుర్తించి ముట్నూరి కృష్ణారావు గారు కాటూరివారిని 'గుప్తదాత' అనేవారు. కవి పండితుల కెందరికో కాటూరి వారు ఆర్థిక సహాయమందించారు. విద్యార్థుల కెందరికో సహాయపడ్డారు.

కాటూరివారు ఒకసారి వరంగల్లు వెళ్లారు. అక్కడ చిలకమఱ్ఱి రామానుజాచార్యులు గారనే కవి తన రచనయైన కల్యాణ రాఘవాన్ని పరిశీలించమని ఇచ్చారు. కాటూరివారు ఆ గ్రంథాన్ని చదివారు. ఆనందించారు. లక్ష్మీకాంతంగారి చేత పీఠిక వ్రాయించారు. పుస్తకాన్ని ముద్రింపించారు. త్రివేణి సంస్థ ద్వారా పుస్తకాలు అమ్మించి డబ్బు పంపే ఏర్పాటు చేశారు.

మరొక ఉదాహరణ. పండిత మిత్రులు కోగంటి సీతారామాచార్యులు గారు వేసవి సెలవుల్లో కాటూరి వారి ఇంటికి వెళ్లారు. వారం రోజుల పైగా కవితా గోష్ఠులతో కాలక్షేపం. ఈలోగా కిరాణా కొట్టు మనిషి తన బాకీని గూర్చి కోగంటివారికి ఉత్తరం వ్రాశాడు. పోస్టాఫీసులో తన కేరాఫ్‌తో ఉన్న ఆ ఉత్తరం చూసిన కాటూరివారు వెంటనే ఆ డబ్బు కిరాణా కొట్టు వ్యక్తికి మనియార్డరు చేశారు. స్వగ్రామం వచ్చిన తర్వాత మాత్రమే కోగంటివారు జరిగిన విషయాన్ని తెలుసుకున్నారు. కాటూరివారి గుప్తదాన గుణాన్ని నిరూపించే ఇటువంటి సంఘటనలు ఎన్నో! ఎన్నెన్నో!!

కావ్యాంకిత విషయంలో గూడా పింగళి కాటూరి కవీంద్రులు ఏకాభిప్రాయులు. కృతి నంకితమిచ్చి ప్రతిఫలం ఆశించటం వారి చరిత్రలో లేదు. దేవునికీ, గురువుకూ, తన భార్యకు పింగళివా రంకితం చేయగా కాటూరివారు గురువుకూ, అగ్రజునికీ, మిత్రులకూ తప్ప మరెవరికీ అంకితం చేయరాదని భావించారు. ఈ జంటకవు లిర్వురూ శిష్యమిత్రుల నుండి తాము గూడా గ్రంథాల నంకితంగా పొందారు. పింగళివారి శిష్యులు, సుప్రసిద్ధ పండిత విమర్శకులు శ్రీ దిగుమర్తి సీతారామస్వామి గారు తన 'సుహృల్లేఖ' గ్రంథాన్ని

గురువుగారి కంకితమిచ్చి – ఏమిచ్చినా ఋణం తీరదని పలుకుతూ – ఋణం తీర్చుకున్నారు. కాటూరి వారి మిత్రులు, తెనుగు సాహిత్యంలో తెనుగులెంకగా భాసించిన పండిత కవి శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు తాము రచించిన 'నేను' కావ్యాన్ని అంకితమిచ్చి తమ స్నేహగుణాన్ని చాటుకున్నారు. పింగళివారు పద్య పఠనం విషయంలో ప్రఖ్యాతిగాంచారు. పింగళివారి పద్యపఠనం చెళ్లపిళ్లవారి ఫక్కీలో మనోహరంగా ఉండేది. లక్ష్మీకాంతంగారు పదాలను చక్కగా విరిచి, అవసరమైనంత రాగంలో చదివేవారు అని గూడూరివారు ప్రశంసించారు. కాటూరి కవి పద్యాలను పాడరు. సాగదీయరు. విరువరు. వంచరు. సొగసుల్ని చంపి చూర్ణం చేయరు. అదోవిధంగా చదువుతారు అని జలసూత్రం వారు అభినందించారు.

ఈ జంటకవుల వాక్శక్తి అమోఘం. లక్ష్మీకాంతంగారి వాక్శక్తి ఆమోఘమైన దని నిరూపించడానికి గూడూరు నమశ్శివాయగారు ఒక సంఘటనను వివరించారు. పింగళివారు ఒకనాడు తప్పుడు తూకం తూస్తున్న వ్యక్తిని చూసి ''తప్పుడు తూకం తూస్తున్నావు, ఆ చేయి విరుగుతుంది'' అన్నారట! ఆ వ్యక్తి మరికొద్ది నిమిషాలలో మెట్లమీది నుండి కాలుజారి పడి చేయి విరగ్గొట్టుకున్నాడు. కాటూరి వారిది ఋషి వాక్కు. కేంద్ర సాహిత్య ఆకాడమీ పక్షాన కాటూరి వారు 'కావ్యమాల' అనే సంకలన గ్రంథాన్ని కూర్చారు. ఆ గ్రంథంలో ఆరుద్ర పద్యాలను ప్రచురిస్తూ, కవి పరిచయంలో 'సినీ వాలి' ఆరుద్ర రచన అని పేర్కొన్నారు. నిజానికి ఆరుద్ర అప్పటికి సినీవాలి కావ్యాన్ని రచించలేదు. సినీవాలి పేరుపైగల మోజుతో కావచ్చు, కాటూరివారిది సత్యవాక్కని నిరూపించటానికి కావచ్చు అచిరకాలంలోనే ఆరుద్ర సినీవాలి పేరుతో ఒక గ్రంథాన్ని ప్రచురించారు. కావాలని కాటూరి వారితో పీఠిక వ్రాయించారు.

ఇలా ఈ జంటకవులలో ఎన్నో సామ్యాలు కన్పిస్తున్నాయి. అట్లని వారి స్వభావాదులలో తేడాలు లేవని కాదు. ఉన్నాయి. పింగళి వారు ప్రసన్న గంభీరులు కాగా కాటూరివారు గంభీర ప్రసన్నులు. పింగళివారికి ఆత్మాభిమానం అధికంకాగా కాటూరి వారికి కలుపుగోలుతనం ఎక్కువ. పింగళివారు ఠీవిగా, దర్పంగా ఉండేవారు. వారు రిక్షాలో కూర్చున్నా సింహాసనం మీద కూర్చున్నట్లుండేదట! జరుక్ శాస్త్రి 'జండాపై కపిరాజు' వరుసలో 'రిక్షాపై కవిరాజు' అని రాగం

తీయటం ఈ దర్పాన్ని దర్శించే. కాటూరివారు వినయ సంపన్నులు. పింగళివారు తిరస్కారాన్ని ఏమాత్రం సహించలేరు. కాటూరివారు తిరస్కారాన్ని చిరునవ్వుతో సహించేవారు. పింగళివారి దగ్గరకు వెళ్లడానికి ఎవరికైనా జంకు ఉండేది. కాటూరి వారి చెంతకు ఎవరైనా సులభంగా చేరేవారు. పరిహాస ప్రసంగాలంటే పింగళివారి రసనకు విసుగు. కాటూరి వారి రసనకు మేలి ముసుగు.

పింగళివారికి భావకవిత్వంపై అభిమానం అఱ్ఱులు చాస్తున్న రోజులలో కాటూరి వారికి ప్రబంధ కవిత్వంపై మక్కువ ఎక్కువగా ఉండేదట! లక్ష్మీకాంతంగారు మెత్తని తెలుగు పదాలను ఉపయోగిస్తే కాటూరివారు తలమొత్తని సంస్కృత పదాలను ప్రయోగించేవారు. అనంతర కాలంలో పింగళి వారికి భారత కవిత్వరుచిపై అభిరుచి మొగ్గగా కాటూరి వారికి భావకవిత్వ విలాసాల వైపు మనసు మళ్లిందని గూడూరి నమశ్శివాయ గారి భావం. పింగళివారిది మేధా రాజ్యం కాగా కాటూరివారిది హృదయ రాజ్యం అని గొల్లపాటివారి విశ్లేషణ. పింగళివారు కావ్యంలో శరీర బంధం సక్రమంగా ఉంచడానికి ప్రయత్నిస్తే కాటూరివారు శైలి ఓజోమయంగా రూపొందించడానికి ప్రయత్నించేవారు. పింగళి వారు కావ్యశిల్ప ప్రియులు. కాటూరివారు చమత్కార జల్ప ప్రియులు. పింగళివారి కవితకు నిరుపహతి స్థలం వంటి అన్ని హంగులు ఉంటే తప్ప బయలుదేరదు. కాటూరి వారి కవితకు అలాకాదు. నిద్రలేపి బయలుదేరమంటే చాలు, అందంగా అలంకరించుకొని బయలుదేరుతుంది.

ఈ జంటకవుల ఆకారాలు గూడా ఆకర్షణీయాలు. పింగళి కవి ఆజానుబాహువు. విశాలనేత్రుడు. గరుడనాసిక. పలుచని చర్మం. తెల్లని మల్లెపూవు వంటి వస్త్రాలు ధరించేవారు. పాందూరు గోరంచు ధోవతి కట్టి, ఫుల్‌హాండ్స్ కప్పులఖద్దరు చొక్కా తొడిగి, అంచులు కన్పించేటట్లు మడిచిన పాందూరు జరీపేటంచు ఉత్తరీయం పైన వేసుకొనేవారు. ఆకు చెప్పులు తొడిగేవారు. తురాయి ధరించినట్లు శిరస్సున జుట్టు రెపరెపలాడుతుండేది. ముఖాన గంధపు నామం మధ్య తిరుచూర్ణం ధరించే వారు.

కాటూరి వారి మూర్తి కమనీయ గంభీరమైనది. రాజసం తగ్గి తలపాగాలేని, మీసాలున్న, ముట్నూరివారు వీరు. ప్రసన్న మందహాస సుందరమైన వదనారవిందం, ఆలోచనలతో నిండిన అరమోడ్పు కన్నులు, తాంబూలంతో ఎఱ్ఱబడిన అధరాలు, ఆజానుబాహులు, పలుచని దీర్ఘకాయం, అరనెరసిన గుబురు మీసంతో ఆకర్షణీయమైన రూపం వారిది. మోకాళ్లవరకు జారిన ఖద్దరు లాల్చీ, భుజంపైన

ఖద్దరు శిల్కు కండువా, దంతపు పన్నుచేతి కఱ్ఱ, నల్లప్రేము బంఢ కళ్లద్దాల జోడు, కిఱ్ఱుచెప్పులు, ఎడంచేతి వ్రేళ్ల మధ్య చల్లారని చుట్టతో ప్రత్యేకమైన వేషం వారిది.

బాలాంత్రపు రజనీకాంతారావు గారు గావించిన గురుస్తుతి ఖండికలోని ఈ పద్యం పింగళివారి భౌతిక రూపానికి అక్షరాకృతి.

**''ఎగదువ్వగా వంగ కెగయు పట్టు తురాయి**
**వలె నిల్చు తెలికేశముల బెడంగు**
**నిడుదైన నొసటిపై నిలువుగా దిద్దితీ**
**ర్చిన యెఱ్ఱచాదు వాసనల సొరు**
**మడత పెట్టిన బెట్టుమాయని నునుపట్టు**
**బంగారు పొడవు జుబ్బా పసందు**
**చలువ చేసిన సన్న తెలినూలు పొందూరు**
**మడుగు దోవతి పింజె మడుల తీరు**
**నయనముల తాలుచు సులోచనముల మెరపు**
**కంఠమున వ్రేలు గ్రైవేయకమ్ము ఠీవి**
**వేదికను నిల్చి నటియించు విగ్రహమ్ము**
**గురులకు గురుండొ మూరు శ్రీవరుడొ యనరె!''**

కాటూరి వారిని తొలిసారి దర్శించిన పిమ్మట అన్నపర్తి సీతారామాంజనేయులు గారు తన మనసులో ముద్ర వేసుకున్న రూపాన్ని గూర్చి ఇలా వర్ణించారు. మూర్తీభవించిన తెలుగుదనం శ్రీ కాటూరివారు. ఆజానుబాహు విగ్రహం, దబ్బపండు ఛాయ, బుఱ్ఱ మీసం, పొగచుట్ట, చేతికఱ్ఱ - ఆ పల్లెటూరి వాలకంలో ఒక హుందాతనం, నిరాడంబరత్వం, కళ్లల్లో సౌజన్యం, బుఱ్ఱ మీసాల వెనుక మందహాసం, పలకరింపులో ఆప్యాయత, మాటల్లో మార్దవం... తొలిసారి వారిని దర్శించినప్పుడు నాలో ముద్ర వేసుకొన్న రూపమిది.''

ఈ కవితాభోగు లిరువురి పట్ల, గౌరవాభిమానాలు గల రసికరాజశేఖరులు ఆంధ్రదేశములో అనేకులు. అనేక సందర్భాలలో ఈ జంటకవులను పెద్దలైనవారు ఆశీఃపూర్వకంగా అభినందించారు. పిన్నలైనవారు భక్తిపూర్వకంగా పూజించారు. పింగళి లక్ష్మీకాంతంగారు ఆంధ్రశాఖాధ్యక్షులుగా ఆంధ్ర విశ్వవిద్యాలయానికి వెళుతున్న సందర్భంలో జరిగిన సన్మాన సభలో వారి గురుదేవులు చెళ్లపిళ్లవా రాశీర్వదించారు.

**''శ్రీకిం దావుగ కీర్తికిం దెఱవుగా శ్రేయోనిదానంబుగా**
**నాకల్ప మ్మల రారు సత్కవిత కత్యంతంబునుం బాదుగా**
**లోకస్తుత్యపరంబుగా శుభయశోలుంటాకుగా జేసి ల**
**క్ష్మీకాంతుండు కృపాళుడై మనుచు లక్ష్మీకాంతు నశ్రాంతమున్''**

గుడివాడలో జరిగిన సౌందరనంద రజతోత్సవ సభలో వేలూరి శివరామశాస్త్రి గారు ప్రాయంలో, తనకంటె కనిష్ఠులైనా శేముషిలో వేయివిధాల జ్యేష్ఠులీ జంటకవులని ప్రశంసించి... ''కాటూరి వేంకటేశ్వర, శ్రీయుత లక్ష్మీకాంతులను సేసల ముంచెద దమ్ము గుఱ్ఱలన్'' అని అభినందించారు. ఇక వీరి శిష్యుల, శిష్యప్రాయుల సంస్తుతి పద్యాలు అసంఖ్యాకాలు. పింగళివారి శిష్యులు కాకాని నరసింహారావుగారు

**''ఉరుగుణ సాంద్రు, పింగళి కులోదధిచంద్రు శతావధాని ఆ**
**తిరుపతి వేంకటేశ కవిధీరుని శిష్యుని లక్ష్మి కాంత స**
**ద్గురువరు నిండు గౌరవముతో ప్రణమిల్లి సభక్తితో నిరం**
**తరమును పూజ్యపాదుల పదంబుల గొల్తు నభీష్టసిద్ధికిన్''**

అని తన నిండుగౌరవాన్ని అక్షరమాలలో అమర్చి అందించారు.

పింగళివారిని ప్రశంసించినట్లే కాటూరి వారిని గూడా అభినందించిన వారనేకులు. మచ్చున కొక్కటి.

**''చల్లని చూపు, మెల్లని వచస్సు, మనోహరమౌ మనస్సు, కం**
**పెల్లని మోము, చక్కని వివేకము, నిక్కని రాచఠీవి, పూ**
**జల్లుల వ్యంగ్యమున్ లలిత సౌమ్య విమర్శయు హత్తు కావ్యమున్**
**చెల్లెనుగాక! యే కవికి చెల్లును కాటురికిన్ వినా భువిన్''**

కాటూరివారి సద్గుణాలన్నీ హృద్యమైన ఈ పద్యంలో రాశీభూతమయ్యాయి.

పింగళి కాటూరి కవులు జంటగా వ్రాసిన మేలికావ్యం సౌందరనందం. ఆ సౌందరనంద కావ్యం ఈ జంటకవుల గురుదేవుల కంకితం. ఈ విశేషాలనన్నిటినీ పాదివి చమత్కారమైన పద్య రచన గావించిన కవితాప్రియుడు డాక్టర్ గుండవరపు లక్ష్మీనారాయణ.

**''వీకి నేలిన యట్టి పింగళివారింటి**
**క్రొత్త కైతల కూర్పు కుఱ్ఱడంట**
**కాటూరి కరణముగారి అబ్బాయితో**
**కలసి వ్రాసిన గొప్ప కావ్యమంట**

**సుందరీనందుల గందరగోళమ్ము**
**చిత్ర చిత్రాలుగా చెప్పిరంట**
**ఎవరెంత వ్రాసిరో ఈ కావ్యమందున**
**గొంతులు విప్ప కేడ్పింతురంట**
**తండ్రియొక్కడు కానట్టి తనయయౌట**
**పట్టి ముసలివానికి అంటగట్టిరంట**
**చదువుకొన్నట్టి శిష్యులు సాక్షులంట**
**పద్యకవులకిది కనుల పండుగంట''**

మొదటి పాదంలో పింగళివారిని, రెండవపాదంలో కాటూరి వారిని, మూడవ పాదంలో సౌందరనంద కావ్యాన్నీ, నాల్గవ పాదంలో కర్తృత్వ సంబంధాన్ని, తేటగీతిలో అంకిత విశేషాన్ని వీరు వివరించారు. కావ్యాన్ని కుమార్తెగా, అంకితం గైకొన్నవారిని అల్లుడుగా భావించే సంప్రదాయా న్నాధారంగా చేసుకొని చేసిన చమత్కారంలోని సొగసు సహృదయైకవేద్యం.

పింగళి కాటూరికవులు జంటకవిత నారంభించారు. జంట కావ్యాలను పండించారు. అయితే ఉమ్మడి వ్యవసాయం అంతటితో ఆగిపోయింది. ఎందుకిలా జరిగింది? వీరు విడిపోయి, విడిగా రచనలు చేసుకోవలసిన పరిస్థితు లెందు కేర్పడ్డాయి? వీరి మనస్తత్వాలలో కొన్ని భేదాలున్నా ఎన్నో సామ్యాలున్నాయి. ఏ జంటకవుల మనస్తత్వాలలో భేదం లేకుండా ఉంది? అంతమాత్రం చేత విడిపోవలసిందేనా? వీరి జంట కవిత్వం వారి కావ్యాల జంటలో విడదీయరానంత అన్యోన్యతతో అతుక్కుపోయింది. జాన్సన్ మహాశయునికి బాస్వెల్ వలె పింగళి కాటూరి కవులతో మిక్కిలి సాన్నిహిత్యం గల గూడూరి నమశ్శివాయ గారి రచనల వలన పింగళి కాటూరుల రచనా విభాగం వ్యక్తమౌతున్నది. సుప్రసిద్ధి గాంచిన

**''చూతురా? దీనిని చూతపల్లవఖాది**
**ని పికాంగనాగాన నిస్వనంబు''**

అనే సీస పద్యంలో నాల్గవ పాదం, తేటగీతి కాటూరి వారి రచనయని, 'సంక్రాంతి' శీర్షికలో గూడ ప్రారంభం నుండి కోళ్లపోరు వరకు పింగళివారి రచనయని, తర్వాతి భాగమంతా కాటూరివారి రచనయని గూడూరువారు గుట్టురట్టు చేశారు. వారు వ్యక్తీకరించకపోతే భేదం తెలుసుకోలేనంతగా ఈ జంటకవుల కవిత మమేకమై పోయింది. సౌందరనంద కావ్యం గూడా ఏక కర్తృకమా? అనిపిస్తుంది. పరిస్థితి ఇంత అనుకూలంగా ఉండగా ఏ కారణం వలన వీరు విడిపోయారు?

వీరిరువురు జంట కవనం ప్రారంభించినప్పుడు బందరులోనే నివసించేవారు. తరువాత కాటూరివారు బందరు ప్రాంతంలో ఉన్నా, పింగళివారు ఉద్యోగరీత్యా పలు ప్రదేశాలకు వెళ్లవలసి వచ్చింది. అయితే జంటకవుల నివాసం ఒకేచోట అయితే సౌకర్యం అన్నంతవరకు నిజమేగాని దూర ప్రాంతంలో ఉన్నంత మాత్రం చేత జంటగా రచన సాగించలేకపోరు. అందువలన వేర్వేరు ప్రాంతాలలో నివసించడం వీరు విడిపోవడానికి కారణం కాదు. వీరి జంట కవిత్వం విడిపోవడానికి ముఖ్య కారణం ఒకటి వుంది. ఎందుకోగాని పింగళి కాటూరి కవులలో అచ్చపు కవి కాటూరివారేనని, స్నేహధర్మం వలన కాటూరివారు పింగళివారి పేరు చేర్చి ప్రకటిస్తున్నారని సాహిత్యలోకంలో అపవాదు ఏర్పడింది. పింగళివారి మనస్సు ఈ ప్రచారం వలన తీవ్రంగా గాయపడింది. అందువలన 'నీవు వ్రాసినవి నీపేర, నేను వ్రాసినవి నాపేర ప్రకటించుకొందాము. ఇప్పటికే నీవు వ్రాసి నాపేర పెడుతున్నావనే అపప్రథ భరించలేకున్నాను'' అని స్పష్టంగా చెప్పారని నమశ్శివాయగారు పింగళివారి జీవిత చరిత్రలో వ్రాశారు. కాబట్టి వారు విడిపోవటానికి ముఖ్య కారణం లోకంలో వారి వ్యక్తిత్వాన్ని దెబ్బతీసే దుష్ప్రచారమేనని భావించవచ్చు.

ఏది ఏమైనా వారిద్దరూ కలిసి సౌందరనందం వంటి కావ్యాలు మరికొన్ని వ్రాస్తే ఆంధ్ర కవితా రసపిపాసువులు ఆనందించేవారు. పింగళివారికి కూడా అటువంటి కావ్యం మరొకటి రచించాలనే కోరిక లేకపోలేదు.

**''నిరతము వాంఛింతును సౌం**
**దరనందము చెట్టబట్టి నడయాడెడి సో**
**దర కృతి యొండు రచింపగ**
**తరమా యీ వయసు నందు తాదృశరచనల్''**

అని నిస్పృహ చెందారు.

ఈ కవితోపాసకులిద్దరూ ఒంటరి కవిత కుద్వాసన చెప్పి, జంటకవులుగా కాపురం చేసి, భావ భామినీ విహార రసరంగాలైన కావ్యాంగనలను ఆంధ్రభారతీ పరిచర్యకు పంపిస్తే ఎంతో బాగుండేదనే తెలుగు పద్యప్రియుల కోరిక తీరని కోరిక అయింది. అయినా వీరిరువురూ, ఏకమనస్కులై రచించిన సౌందరనందం ఆంధ్ర రసహృదయుల రసనలపై చిరకాలం నర్తించగలదు. ఎంతకంతే తృప్తి.

# 11. ఉపయుక్త గ్రంథాలు


1. ఆంధ్ర రచయితలు - శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి
2. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక - సంచిక 47
3. ఆంధ్ర సాహిత్యములో జంటకవులు - డాక్టర్ జంధ్యాల సుమన్‌బాబు
4. ఆధునికాంధ్ర కవితా సమీక్ష - డాక్టర్ కె.వి.ఆర్. నరసింహం
5. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు - డాక్టర్ సి. నారాయణరెడ్డి
6. కల్యాణ కల్పవల్లి - శ్రీ కరుణ శ్రీ
7. కాటూరి వారి సాహితీ సమాలోచనము - శ్రీ పింగళి వేంకట కృష్ణారావు
8. కాటూరి వేంకటేశ్వర స్మారక సంపుటము
9. గుంటూరి సీమ - తిరుపతి వేంకటకవులు
10. తత్సమ చంద్రిక - శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి
11. తెలుగు కవితా వికాసం - డాక్టర్ కడియాల రామమోహనరాయ్
12. తెలుగు భాషా సాహిత్య సంస్కృతుల చరిత్ర - డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వ విద్యాలయ ప్రచురణ
13. తెలుగు వాఙ్మయము - సంగ్రహ చరిత్ర - సంకలనము - శ్రీ కె.వి. గోపాలస్వామి
14. తెలుగు సంస్కృతి - 4వ సంపుటి
15. తెలుగు సాహిత్య సమీక్ష - డాక్టర్ జి. నాగయ్య
16. దీపమాలిక - డాక్టర్ యస్వీ. భుజంగరాయ శర్మ
17. నవ్యాంధ్ర పంచకావ్య పరిశీలనము - నరసింహదేవర ఉమామహేశ్వర శాస్త్రి
18. నవ్యాంధ్ర సాహిత్య వీధులు - శ్రీ కురుగంటి సీతారామయ్య

19. నా వాఙ్మయ మిత్రులు - శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు
20. పండితరాజ పంచామృతము - డాక్టర్ బూర్గుల రామకృష్ణారావు
21. ప్రతిభామూర్తులు - డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు
22. ప్రాచీన కావ్యమంజరి - సంకలనము శ్రీ గంటి జోగిసోమయాజి
23. పింగళి లక్ష్మీకాంతం జీవిత చరిత్ర - శ్రీ గూడూరి నమశ్శివాయ
24. భావ కవులు - ప్రతిభావిస్ఫూర్తి - డాక్టర్ శివలెంక ప్రకాశరావు
25. భారతి రజతోత్సవ సంచిక
26. భావవీణ - డాక్టర్ సి. నరసింహ శాస్త్రి (అమరేంద్ర)
27. మిత్రులు-నేనూ - శ్రీ గొట్టిపాటి వేంకటసుబ్బయ్య
28. రసజ్ఞ శిల్పి - పింగళి లక్ష్మీకాంతం శతజయంతి సంచిక
29. రసతపస్వి కృష్ణారావు - శ్రీ గొట్టిపాటి. వెంకటసుబ్బయ్య
30. శారదా సమారాధనం - ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం
31. సమగ్ర ఆంధ్ర సాహిత్యం - 12 - ఆరుద్ర
32. సారస్వత వ్యాసములు - శ్రీ నోరి నరసింహశాస్త్రి
33. సాహితీ మంజూష - సంపాదకులు. డాక్టర్. యం. కులశేఖరరావు
34. సాహిత్య పరిచయం - శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత శర్మ
35. సాహిత్య రసికత - శ్రీ పాట్లపల్లి సీతారామారావు
36. సూర్య శతకం - మయూరుడు
37. స్వీయ చరిత్ర - శ్రీ దువ్వూరి వేంకట రమణ శాస్త్రి